# భారతి

సాహిత్య మాసపత్రిక

ఆగస్టు : 1989

వెల : 5 రూపాయలు





వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938_1972)

*

సంపుటము : 66 ఆగష్టు 1989 సంచిక : 8

విడిపత్రిక వెల ఐదురూపాయలు

---

## విషయానుక్రమణిక

### ఆగష్టు 1989

# స్వవిషయం

కన్యక కథ - విష్ణువర్ధనుని చారిత్రకకథపై డాక్టర్ కొల్లూరు సూర్యనారాయణ మళ్ళీ ఎన్నో సందేహాలు లేవనెత్తుతూ ఈ సంచికలో ఒక వ్యాసం రాసారు. కన్యకా పురాణంలోని చారిత్రకతను పరిశీలించ డానికి ఆధారాలు లేవు అని ఈయన స్పష్టం చేస్తున్నారు. పైగా వైశ్యుల కుల ప్రాశస్త్యాన్ని వెల్లడించడానికి మధ్యయుగాలలో వెలువడ్డ కథనం ఈ ఉదంతమని అంటున్నారు. ఈ అభిప్రాయాలను చారిత్రక పరిశోధకులు ఎలా స్వీకరిస్తారో మరి!

పదకవితా పితామహుడు అన్నమాచార్యుడని అందరికీ తెలుసు. ఆయన భార్య తిమ్మక్క తేట తెలుగులో, ద్విపదలో - "సుభద్రా కళ్యాణం" - అనే అతి విశిష్టమైన కావ్యాన్ని రాసిన సంగతి మాత్రం ఎక్కువమందికి తెలియదు. స్త్రీ స్వభావాన్ని, ఈమె చిత్రించిన తీరు హృద్యంగా, ఆద్యంతమూ రసభరితంగా ఉంటుందనే విషయంలో ఎవరికీ సందేహాలు ఉండవు. ఈ విషయాన్నే డాక్టర్ గుమ్మా సాంబ శివరావు ఎక్కువమందికి తృప్తి కలిగేలా చెప్పారు.

ఈ సంచికలో అందిస్తున్న శ్రీ ఓబళేసు వ్యాసం "నిత్య జీవితంలో అలంకారాల వాడుక" కొత్త ఆలోచనలకు దారి చూపుతుంది. అలంకారాలు, నుడికారాలు నష్టపోకుండా భద్రపరిచే అవకాశాన్ని గురించి ఆలోచించాలని రచయిత వెలిబుచ్చిన అభిప్రాయంతో ఎవరైనా ఏకీభవించవలసి వస్తుంది.

కాలువశ్రీ దర్శించిన యోగభ్రష్టుడు గిరీశం గురించి గురజాడ అభిమానులు, విమర్శకులు సయితం ఎలా స్పందిస్తారో వేచి చూడవలసిందే. అర్జున విషాద యోగం-అశోక విషాద యోగం అంటూ తులనాత్మక రచన చేశారు డాక్టర్ రామచంద్రరావు. ఈ ఆలోచనా ధోరణి సరికొత్తదైనా, కాకపోయినా - విశిష్టమైందని మాత్రం - అంగీకరించక తప్పదు.

"గ్రామ దేవతలు" వ్యాసం మన సంప్రదాయంలోని ఒక భాగాన్ని ప్రతిబింబింప జేస్తుంది. "తొట్ల ఊగింది" అనే కీ.శే. త.రా.సు. గారి కన్నడ కథలో కొత్తదనం ఏమీ లేకపోయినా కదిలించే శక్తి మాత్రం పుష్కలంగా ఉందని తోస్తుంది. కథా కథన శిల్పచాతుర్యం ఎంత విలువైందో చెప్పడానికి ఇలాంటి కథలు చాలు.

కవిత్వం గురించి ప్రత్యేకంగా పరామర్శించవలసిన అవసరం లేదు. సమాజంలోని విభిన్న అంశాలకు చెందిన భావాలు అద్దం పట్టేలా కవిత్వం చిరంజీవత్వాన్ని పొందగలగాలని మా ఆశ. ఈ ప్రయత్నంలో ఒక సాధనమైన "భారతి"కి అందరి సహాయ సహకారాలూ ఎంతయినా అవసరం!



# ఆనందానికి కారణం

శ్రీ కె. గోదావరి శర్మ

కంటి కెదురుగా ఉన్నది చూస్తూ
పంటి కిందకి వచ్చింది తింటూ
అతి సాధారణ జీవితాన్ని
అతి సాధారణంగా జీవిస్తూ
హఠాత్తుగా ఒకరోజు ఆగి
సంతోషమయ జీవనానికి
సాధనమేమిటా అని
ఆలోచిద్దామనుకున్నాను.
ఆలోచించి చూడగా
ఆశ్చర్యం లేనిదే
ఆనందం లేదనిపించింది.
ఆశ్చర్యం ఎలా వస్తుందా అని
దిగులు పడుతూ ఆలోచించాను.

ఏనుగులకి అంతేసి శరీరాలుంటాయి కదా,
ఎలా ప్రేమించుకుంటాయా అని
ఊహిస్తూ ఆశ్చర్యపోవడానికి ప్రయత్నించాను.
ఉహుఁ! ఎంత దిగ్గజాలైనా
శరీరధర్మాల్ని ధిక్కరించవు కద!
ప్రకృతి సహజమైన చర్యల్లో
ఆశ్చర్యానికి అవకాశం లేదనిపించింది.

ఏడో నెంబరు ఇంటిగలాయనకి
ఏడుపు మొహమే కద ఎప్పుడూను,
పడగ్గదిలో ఏడుస్తూనే
పెళ్ళాంతో సరసమాడతాడా అని
హాస్యంగా ఆశ్చర్యపోవడానికి ప్రయత్నించాను.
అతని నలుగురు పిల్లలూ
అతని కార్యశూరతకి నిదర్శనాల్లా
నిలిచారు కళ్ళముందు.
ఆశ్చర్యానికి ఆస్కారమే లేదు!

ఇంత బ్రహ్మాండాన్ని
ఇంత బ్రహ్మాండంగా నిర్వహించే
ఆ పరబ్రహ్మ స్వరూపాన్ని తల్చుకుని
ఫిలసాఫికల్‌గా ఆశ్చర్యపోదామనుకున్నాను.
కాని 'వాడికి' అసాధ్యమేముందని
చులాగ్గా నవ్వేశాడు
పురాణం చెప్పే దీక్షితులుగారు.
అందులో ఆశ్చర్యం ఏమీ లేదట!

ఇంతలో మా మూడేళ్ల పాప
వింత వస్తువులా ఓ అద్దాన్ని తెచ్చి
'అద్దం అంటే ఏమిటి నాన్నా?' అని అడిగింది.
ఆశ్చర్యం వేసింది నాకు.
ఆనందమూ కలిగింది.
ఆశ్చర్యానికీ ఆనందానికీ మూలం
బాల్యమని కూడా తెలిసింది.



డా॥ కొల్లూరు సూర్యనారాయణ

# కన్యక కథ - విష్ణువర్ధనుని చారిత్రకత?!

తెలుగుజాతి చరిత్ర నిర్మాణంలో శాసనాది సాధన సామగ్రికి తోడుగా సాహిత్యం తన యథోచితపాత్ర నిర్వహిస్తోందనటంలో సందేహం లేదు. కాని ఒక చారిత్రకాధారంగా సాహిత్యపు ప్రామాణికత విశ్వసించటానికి కూలంకష పరిశోధన అవసరం ఎంతైనా వుంది. కొన్ని సందర్భాల్లో ఏ యితరాధారాలు ప్రసరించి వెలుగు చూపని కోణాల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయటానికి సాహిత్యమే మూలాధారమై నిలుస్తోంది. అయితే ఒక గ్రంథంలోని అంశాన్నో, ఒక జనశ్రుతినో చారిత్రకాధారంగా పరిశీలించే ప్రయత్నానికి ముందు, ఆ అంశపు నిర్దుష్టమైన కాలాన్ని, ఇతర ప్రామాణికతని విశ్లేషించి చూడగలగాలి. అది ఏ కాలానికి, ఏ ప్రాంతానికి, ఏ పరిస్థితులకు సంబంధించిన అంశమో చూచాయగానైనా తెలియగలగాలి. ఇవి స్పష్టంగా తెలుపబడని కారణంగానే మన సాహిత్యంలోని కొంతభాగం శాస్త్రీయమైన చరిత్ర రచనకు ఉపయుక్తం కావటంలేదు. ఒక సాహిత్యాధారంలో పేర్కొనబడిన ఒక అంశం నిర్దుష్టమైన మరో చారిత్రకాధారంవలన రూఢి పరచబడినప్పుడు దాని ప్రామాణికతని నిలదీయవలసిన అవసరం అసలుండదు. అలాగే సమకాలీన ఆధారాల వెలుగులో నిర్ధారితాలైన చారిత్రకాంశాలకు విరుద్ధంగా ప్రస్తావనలున్న అర్వాచీన సాహిత్యాన్ని కూడ మనం ఏమాత్రం పట్టించుకోనక్కరలేదు. ఇతరాధారాల మూలంగా వెలుగు చూడని ఒక సమస్య ఒకే ఒక్క సాహితీ అంశంలో లేశ మాత్రంగా చోటు చేసుకొన్నప్పుడు దానిని మాత్రం చాల క్షుణ్ణంగా పరిశీలించవలసి వుంటుంది. 'శ్రీ వాసవీ కన్యకా పురాణం' లోని విష్ణువర్ధనుని గుర్తింపు విషయం యీ కోవకే చెందుతుంది. గతంలో యీ అంశాన్ని కొన్ని వ్యాసాల్లో ప్రస్తావించి, చర్చించటం జరిగింది. విష్ణువర్ధనుని చారిత్రకతను గుర్తించటంలోగాని గుర్తింపకపోవటంలో గాని ఉన్న సాధక బాధకాలను విపులంగా వాటిలో పేర్కొవటం జరిగింది. అయితే యీ అంశాన్నే తీసుకొని **1989** మే నెల 'భారతి'లో శ్రీ తురగా కృష్ణమూర్తిగారు వారి అభిప్రాయాన్ని వెల్లడిస్తూ, కన్యక కథ యదార్థంగానే జరిగిందనీ, అందులోని విష్ణువర్ధనుడు విజయార్కుడి కుమారుడనీ తిరిగి యీ విషయాన్ని లేవనెత్తారు. ఇదివరలో దీనికి సంబంధించి చరిత్ర పరిశోధకులు చర్చించిన ఎన్నో విషయాల 'ఆధార రహితం' అని చెప్పటానికే ఆ వ్యాసం నిర్దేశింపబడింది. వారి చరిత్ర పరిశీలనా దీక్షకి, వాస్తవ విషయ నిరూపణ సంకల్పానికీ చాలా సంతోషమే అయినప్పటికీ వారు పేర్కొన్న చాల అంశాలు శాస్త్రీయ చరిత్ర పద్ధతులకి విరుద్ధమైనవి కావటం, ఒకరు ఎప్పుడూ ఎక్కడా పేర్కొనని అంశాల్ని వారు పేర్కొన్నట్లు నమ్మబలికి పాఠకుల్ని పెడదారి పట్టించటం, వేటికీ అధోజ్ఞాపికలను గాని, సూచికను గాని చెప్పక యావత్కథను 'యదార్థ గాథగా' చిత్రీకరించి చెప్పటం, యిత్యాది ఎన్నో ఎన్నో కారణాలవల్ల తిరిగి యీ అంశాన్ని చర్చకు తేక తప్పింది కాదు. ముందుగా ఆ వ్యాసకర్త అభిప్రాయాలు కొన్నింటిని పరిశీలించవలసి వుంది.

1. "గ్రంథములలో కథాకథనము వేరు వేరు విధములుగా యుండి, పరస్పర భిన్న పాఠములతో కథాంశమును గజిబిజి యొనర్చి గందరగోళ పరిస్థితిని కల్పించి, అసలు సంఘటన కల్పితమా? అన్న అనుమానమును కల్గించుచున్నవి."

—ఆధారంగా తీసుకోవలసిన చారిత్రక వస్తువు ఇంత నవ్యంగా ఉన్నదని పేర్కొనినప్పుడు, యీ ఆధారాలపై నిరూపింప బూనిన చరిత్ర శాస్త్రీయంగా ఉంటుందనుకోవటం అత్యాశే అవుతుంది.

2. "కన్యకను గూర్చిన కథా సంవిధానములో గీర్వాణభాషలో నున్న గ్రంథముల వ్రాతలాధారముగా మూలగ్రంథానుసారము సమన్వయించుట"........"సంస్కృత మూలగ్రంథములోని యుల్లేఖనములకే ప్రాధాన్యమిచ్చి చర్చించి, నిగ్గుతేల్చుటలగ్గు."

—ఎవ్వరూ కాదనలేని చరిత్ర రచనలోనున్న పద్ధతియే యిది. కాని ఎప్పుడు? "మూలగ్రంథము" అనునది ఏదియో తేలి, ఆపై అది సప్రమాణికమే అని అంగీకరింపబడ్డ తర్వాత. అసలు సంస్కృత కథనము ముందో, తెలుగు గ్రంథమే ముందో తేలని పరిస్థితులలో యీ పద్ధతికే తావులేదు. స్కాందపురాణాంతర్గతమో, మార్కండేయ పురాణోత్తర ఖండమో, అని పేర్కొనినంతలో దేనికీ ప్రాచీనత చేకూరదు. స్కాందపురా

ణాంతర్గతమని పేర్కొనబడ్డవాటిల్లో చాళుక్యభీముని కాలంలో నిర్మింపబడ్డ చాళుక్య భీమారామ నిర్మాణ విషయాలు[1], చాళుక్య చోళుల కాలంలో నిర్మింపబడ్డ సర్పవరపు భావనారాయణుని ఆలయపు విషయాలు[2] మొదలైన అర్వాచీన సంఘటనలు కోకొల్లలుగా వర్ణించబడ్డాయి. 'విశ్వకర్మ పురాణం'లాంటి మధ్యయుగాల్లో వెలువడ్డ కులపురాణాలకి కూడ స్కాందమే మూలమని ప్రకటించుకొన్నారు.[3] అలాగే 'మార్కండేయ పురాణం'లో పూసపాటిని జయించిన జయపురాధీశుడైన గజపతి ప్రశంస కన్పిస్తుంది![4] వీటన్నింటినిబట్టి యీ కథనాలు చాల వరకు అర్వాచీనాలని కాని, అర్వాచీనకాలంలో విపరీతమైన ప్రక్షిప్తాలకి గురైనట్లుగాని అర్థమౌతుంది. ఈ ఉల్లేఖనాలన్నింటికీ చరిత్ర రచనలో ప్రాధాన్యమిచ్చి చర్చిస్తే తేలే 'నిగ్గు' ఎలా వుంటుందో మరి! చరిత్రే కాదు, చరిత్ర రచనా పద్ధతులే క్రీస్తుపూర్వానికి తిరోగమిస్తాయి.

3. "కన్యక కథ క్రీస్తుపూర్వమే జరిగినదని ఘంటాపథముగా జెప్పగల ఆధారము మూలగ్రంథములోనే యున్నది."

—చరిత్ర పరిశోధన 'వడ్డించిన విస్తరి' అనుకొంటే, సరే. కాని ఆధారమని పట్టుకున్న మూలగ్రంథమే అసలు క్రీస్తుపూర్వం వ్రాయబడ్డదో, అర్వాచీనమైనదో తేలిన తర్వాత కదా ఘంటాపథంగా చెప్పగలగటం! ఆధారాల ప్రామాణికత, చారిత్రకత పరిశీలించకుండా 'కథల్ని' చరిత్రగా చిత్రించ బూనటం విజ్ఞుల పద్ధతి కాదు.

4. "ఈ విషయమును గమనింపక తొందరపాటుతో ముందు యేర్పరచుకొన్న నిర్ణయమును సమర్థించుకొను యత్నములో అకాండ తాండవమునకు దిగి తుదకు అపసిద్ధాంతము వెలువరించి తమ పని తీరినట్లు నిశ్వసించినారు."

— విషయంమీద పూర్తి అవగాహన గాని, కనీసం యీ అంశంలోని వాస్తవికతమీద జిజ్ఞాస కాని ఉండి యిప్పటి వరకు యీ అంశంపై వెలువరింపబడ్డ అభిప్రాయాలన్నింటినీ సమీకరించి, సమీక్షించి, సహేతుకంగా విమర్శకి దిగటం అభినందించదగ్గ పరిశోధక లక్షణం. ఆ కృషి లేకుండా బరిమీద దిగటం తొందరపాటే కాదు; పొరపాటు కూడ. "అపసిద్ధాంతం వెలువరించి" అని ఉత్సాహంతో అందామని ఉన్నప్పుడైనా యీ అంశంపైనున్న వివిధాలైన వ్యాసాల్ని, అందులోని అభిప్రాయాల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసితీరాలి. ఏవేవి పరిశీలింపబడ్డాయో అధోజ్ఞాపికల్లో అవసరాన్నిబట్టి విధిగా సూచించాలి. అసలా పద్ధతే లేని యిలాంటి సందర్భం చర్చలకే యోగ్యం కానిది.

ఈ అంశమై మొదటిగా **1983** ఫిబ్రవరి, 'భారతి'లో "కన్యకా పురాణమునందలి విష్ణువర్ధను డెవ్వరు?" అనే వ్యాసాన్ని వ్రాయటం జరిగింది. అదే నెలలో బెంగుళూరు 'జ్ఞాన భారతి'లో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రీసెర్చి వారేర్పాటుచేసిన "సోషియో కల్చరల్ కండిషన్స్ యిన్ సౌతిండియా" సెమినారుకి సమర్పించిన ఓ ఆంగ్ల వ్యాసానికి యీ విషయం ప్రాతిపదికగా తీసుకోవటం జరిగింది. ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు ఆరవ సమావేశంలో హైదరాబాదులోను,[5] "హిస్టరీ ఆఫ్ ది మైనరు చాళుక్య ఫేమిలీస్ ఇన్ మిడీవల్ ఆంధ్రదేశ" అనే నా సిద్ధాంత గ్రంథంలోను[6], "ఫ్యూడటరీస్ అండర్ ఈస్టరన్ చాళుక్యాస్" అనే మరో పుస్తకంలోను[7] సందర్భాను సారంగా వేర్వేరు కోణాల్లో పరిశీలిస్తూ యీ అంశాన్ని స్పృశించటం జరిగింది. ఇదంతా చెప్పుకోవలసి రావటానికి కారణం - చరిత్ర పరిశీలనలో తొందరపాటుగాని ముందే యేర్పరుచుకొన్న నిర్ణయాలుగాని వుండవసీ ప్రామాణికాధారాల వెలుగులో ఎలాంటి మార్పునైనా సంతోషంగా ఆహ్వానించి ఎదురుచూస్తామని తెలియజెప్పటానికే. అసలా వ్యాసాలన్నీ క్షుణ్ణంగా కాకపోయినా యథాలాపంగా చదివినా 'ముందే ఏర్పరచుకొన్న నిర్ణయా'లంటూ వున్నాయో లేదో, వుందేవుండి వుంటే, ఆ విష్ణువర్ధనుని గుర్తించటంలో పున్న అభ్యంతరాలు, గుర్తించకపోవటానికి ఉన్న సాధక బాధకాలు సవివరంగా ఎందుకు పరిశీలించామన్న ఆలోచన వచ్చేది. పై సందర్భాలన్నింటిలో వేర్వేరు అంశాలను ప్రస్తావించి సాధ్యాసాధ్యాలను సూచించటమే జరిగింది తప్ప, ఏదో నిర్ణయాన్ని(?) సమర్థించుకొనే(?!) ప్రయత్నం ఎప్పుడూ జరగలేదు. అందరికీ అన్నీ లభ్యం కావు కనుక వివిధాలైన వ్యాసాల్ని చూడలేకపోవటం తప్పు కాకపోవచ్చు; కాని చూసినట్టు మభ్యపెట్టడం మాత్రం తప్పు.

5. "పెద్ద చెరుకూరు శాసనాధారముగ కన్యకను పెండ్లాడగోరిన చాళుక్య విష్ణువర్ధనుడు (రెండవ విష్ణువర్ధనుడు)యై యుండవలెనని యూహచేసి ఆ నిర్ణయమును సమర్థించు మార్గమన్వేషణలో దృష్టిని కేంద్రీకరించి, ఇతర అనురోధముల జోలికి పోక, ప్రస్తావింపక ...."

—ఒకరొక అభిప్రాయాన్ని ఒకదగ్గర పేర్కొన్నారని చెబుతున్నప్పుడు అది అధోజ్ఞాపికల్లో పేర్కొవటం మంచి పద్ధతి. అందునా ముఖ్యంగా వాదానికి దిగేటప్పుడు మరొక్కసారి

సరిచూచుకోవటం మర్యాద. వ్యాసకర్త యీ అంశంలో విషయ సేకరణకి ఎంత శ్రద్ధ వహించారో, ఒక్కొక్కరి అభిప్రాయాన్ని ఎంత చక్కగా అర్థం చేసుకొన్నారో, చేసుకొన్నదాన్ని ఎంత బాగా తిరిగి వ్యక్తీకరించారో తెలుసుకోవటానికి యీ వాక్యమే మేలుబంతి. కన్యకను పెళ్ళాడగోరిన చాళుక్య విష్ణువర్ధనుడు రెండవ విష్ణువర్ధనుడని నేనెక్కడా చెప్పలేదు. చెప్పకపోవటంతో సరిపోలేదు. 1983, ఫిబ్రవరి, 'భారతి'లోని 'విష్ణువర్ధనుడి పెద చెఱుకూరు శిలాశాసనము'మీది ఓ వ్యాసంలో, అది రెండవ విష్ణువర్ధనుడి కాలానికి (క్రీ॥శ॥ 673-682) చెందుతుందని భావించిన ఖండవల్లి లక్ష్మీరంజనం, కొమండూరి వెంకటాచార్యుల అభిప్రాయాన్ని[8] కొన్ని బలమైన కారణాలవలన ఖండించటం జరిగింది. ఎప్పుడూ, ఎక్కడా ఆ విష్ణువర్ధనుడు రెండవ విష్ణువర్ధనుడని నేను పొరపడనైనాలేదు. చెప్పని విషయాన్ని (పైగా ఖండించిన విషయాన్ని) నేనే చెప్పినట్టు పేర్కోవటం వ్యాసకర్త విషయసేకరణ విధానాన్ని, వారి సునిశితమైన పరిశీలనని తేటతెల్లంగా తెలుపుతున్నాయి.

6. "సంస్కృత భాషలో రచింపబడిన 'శ్రీమత్కన్యకా పురాణములో' విష్ణువర్ధనుని పేరుగాని, వాని రాజధాని రాజమహేంద్రవరము విషయముగాని లేదు."...."కావున కన్యక నాశించిన విష్ణువర్ధన శబ్దవాచ్యుడు క్రీ॥పూ॥ చంద్ర వంశోద్భవుడై భూమిని పాలించుచున్న ప్రభువై యుండవలెను."

—సంస్కృత భాషలో వ్రాయబడ్డ 'శ్రీమత్కన్యకా పురాణము'లో విష్ణువర్ధనుని పేరు లేదనీ, అర్వాచీన కాలంలోని భాస్కరాచార్యుని తెలుగు వైశ్యపురాణంవంటి వాటిల్లో విష్ణువర్ధనుని విషయం వున్నా వాటిని లెక్కగొనాల్సిన అవసరం లేదనీ, సంస్కృత మూలగ్రంథంలోని ఉల్లేఖనాలకే ప్రాధాన్యమిచ్చి చర్చించాలని వ్యాసకర్త సెలవిచ్చారు. సంతోషం. అలాంటప్పుడు మరొక పేరాకి వచ్చేసరికి 'కన్యక నాశించిన విష్ణువర్ధన శబ్దవాచ్యుడు క్రీ॥పూ॥ చంద్ర వంశోద్భవుడై' ఎక్కణ్ణుంచి సంప్రాప్తమయ్యాడో! అభిప్రాయంలో స్పష్టత, సందిగ్ధావస్థనుంచి బయటపడటం, చాల అవసరం. విష్ణువర్ధనుడనేవాడు లేడని మూలగ్రంథం అని భావించినదాన్లో వున్నప్పుడు, దాని నాధారంగా మాట్లాడే వ్యాసకర్త మళ్ళీ విష్ణువర్ధనుణ్ణి ప్రస్తావించటం అనవసరం కదూ! గజం మిథ్య పలాయనం మిథ్య. అసలు సమస్యే లేదు.

7. "పెనుగొండ పురవరాధీశ్వరుడు కుసుమశ్రేష్ఠి జననకాలము శ్రీ వాసవ కన్యకాపురాణమ్ తృతీయాశ్వాసములో

'కలౌ వ్యోమాక్షి తర్క ద్విసంఖ్యే వర్ష గణే గతే
ఖ్యాతో వైశ్యకులాంభోదౌ కుసుమాఖ్యా వణిగ్వరః
ప్రభాత గోత్ర తిలకః క్షీరాబ్దౌ చంద్రమాయివ
సముత్పన్నోథ బాలో సౌ కళాపూర్ణః ప్రతాపవాన్॥'

అని చెప్పబడింది.

కన్యక అగ్ని ప్రవేశ కాలము

'కల్యాద్యబ్ద గణేష్ట నేత్ర రసదోస్సంఖ్యాన్వితే వత్సరే
ప్రాప్తేథ ప్రభవే తపస్యసితే పక్షే ద్వితీయే గురౌ
వైశ్యైర్భాస్కర పండితాది ధరణీ బృందారకేభ్యస్సహ
ప్రీత్యాష్టాదశ పట్టణాధి పతిభిః దత్తంశుభం శాసనమ్॥'

అను దానినిబట్టియు తెలియుచున్నది."

—ఇవి కుసుమశ్రేష్ఠి జనన కాలాన్ని, అతని పుత్రిక కన్యక అగ్ని ప్రవేశ కాలాన్ని పరిగణించటానికి వ్యాసకర్త తను ప్రామాణికంగా తీసుకొన్న 'మూల గ్రంథాల్నుం'చి ఏర్చి మన కందించిన ఆణిముత్యాల్లాంటి శ్లోకాలు. గమనించండి. కుసుమ శ్రేష్ఠి జననకాలం 'కలౌవ్యోమాక్షి తర్క ద్విసంఖ్యే....', అంటే కలి సంవత్సరం 2620 (క్రీ॥పూ॥ 482). వారి పుత్రిక కన్యక అగ్నిప్రవేశ కాలం 'కల్యాద్యబ్ద గణేష్ట నేత్రరస దోస్సంఖ్యాన్వితే', అంటే (కొద్దిగా అస్పష్టంగా ఉన్నా) కలి సంవత్సరం 2628 (క్రీ॥పూ॥ 474). కుసుమశ్రేష్ఠి క్రీ॥పూ॥ 482లో జన్మించటం, ఆయన వయస్సు ఎనిమిది సంవత్సరాలు కూడా నిండకుండానే యుక్తవయస్కురాలైన కన్యక జన్మించటం ఓ విష్ణువర్ధనుడి మోహం కారణంగా అగ్నిప్రవేశం చెయ్యటం వెంట వెంటనే జరిగిపోయాయంటే 'మూలగ్రంథం' ఎంతటి ప్రామాణికాంశాల్ని అందించిందో స్పష్టంగా తెలుస్తోంది. దేన్ని ఆధార గ్రంథంగా తీసుకోబోయేటప్పుడైనా అంతః, బహిః సాక్ష్యాల విచారణ చాల అవసరం.

8. "అప్పటికి చంద్రవంశపు రాజులలో విష్ణువర్ధన శబ్దవాచ్యుడు యెవరైన ఈ ప్రాంతముల నేలుచుండిన అతడే కన్యక అగ్ని ప్రవేశమునకు కారణభూతుడని నిర్ణయించుట సమంజసము."

—మంచిదే. కాని అలాంటి విష్ణువర్ధన శబ్దవాచ్యుడెవడైనా పెనుగొండ ప్రాంతాలను క్రీ॥పూ॥ పాలించినట్లు రూఢిగా తెలిసినప్పుడే యిలాంటి ప్రయత్నాల కర్థం. ప్రామాణికంగా యీ అంశం శాసనాలలో, ఇతర పురావస్తు సాక్ష్యాల్లో, సాహిత్యంలో తెలియకపోవటాన్నిబట్టి దీని చారిత్రకతని శంకించి విడిచిపెట్టడం మరింత సమంజసం. చరిత్ర చెప్పలేకపోవటం

నేరం కాదు; కాని ప్రామాణికాధారం లేని చరిత్రల్ని ప్రచారం చెయ్యబోవటం మాత్రం క్షమించరాని నేరం.

9. "కొమ్మనూతల శాసనమును చూచియుండిన ఇట్లు వ్రాయ సాహసించియుండరు.

—అది చూసినా ఇలానే వ్రాయటం జరుగుతుంది. అయినా, ఓ శాసనాన్ని, అందులోనూ ఓ పదో శతాబ్ది తామ్ర శాసనాన్ని వాదానికి ఆధారంగా అడ్డు పెట్టుకోబోయినప్పుడైనా అధోజ్ఞాపికల్లో అది ఎక్కడిదో పేర్కొనవలసిన కనీస బాధ్యత వ్యాసకర్తకి లేకపోవటం శోచనీయం. అది పేర్కొంటే పోయే దానికి శాసన సంక్షిప్త సారాంశం యివ్వటం చాల అనుమానాలకి దారితీస్తుంది. చూడనిదానిని చూసినట్టు పేర్కొనే అలవాటు వ్యాసకర్త కెంతవుందో వెనుక ప్రస్తావించిన అంశాల్ని బట్టి తెలుస్తోంది.

వారు పేర్కొన్న విషయాన్ని బట్టి, ఆ కొమ్మనూతల తామ్రశాసనమేదో 'మిన్ను విరిగి మీద పడ్డట్టు' చెయ్యటం లేదు. క్రీ॥శ॥ 1164నాటి ఘంటశాల శాసనంలో వైశ్యుల 102 గోత్రాలు పేర్కొనబడటాన్ని బట్టి[9], కన్యక - విష్ణువర్ధనుల ఉదంతం 14వ శతాబ్ది తొలిపాదం నాటిదనుకొందికి ఆస్కారం లేదని ఉన్న అభ్యంతరాన్ని కూడ నేనే పేర్కొవటం జరిగింది. ఈ కొమ్మనూతల శాసనమనబడేదానిలోని అంశం కూడ అంత కన్నా మరేం సాధించదు. కన్యక కథ క్రీస్తుపూర్వం నాటిదను కొనే వ్యాసకర్త అభిప్రాయానికిది ఏ రకంగానూ ఆలంబన కాదు.

10. "పెద్ద చెరుకూరు శాసనములోని ప్రథమార్థభాగమును, కన్యకా పురాణములోని అగ్నికుండ ప్రవేశకాలమును సూచించు శ్లోకములోని ప్రథమార్ధభాగమును, తులనాత్మకముగా సుదీర్ఘ విమర్శ గావించి క్రీ॥శ॥ 1420వ సంవత్సరముకంటె అనంతర మను యభిప్రాయపడిరి."

—మళ్ళీ పాత ధోరణే. పరిశోధనాంశాల్లో ఒకరు పేర్కొనని విషయాల్ని వాళ్ళు చెప్పినట్టు పదేపదే అనటం, పాఠకుల్ని పెడదారి పట్టించటం ఎంత హేయమైందో తెలియ చెప్పవలసి రావటం దురదృష్టం. అసలిలాంటి ప్రవృత్తులకు సమాధానం అనవసరమేమో కూడ!

నా వ్యాసాల్లో యిప్పటివరకు ఆ శాసనంలోని కలి సంవత్సరాన్ని ఏ ఏ పరిశీలకులెలా ఎలా అర్థం చేసుకొని పేర్కొన్నారో వివరంగా చెప్తూ, వాటి నంగీకరించటంలోనున్న అభ్యంతరాలు తెలుపుతూ, శాసనపు లిపినిబట్టి అది క్రీ॥శ॥ 13, 14 శతాబ్దులకు చెందినదవటంచేత ఆ రెండు శతాబ్దుల్లో ఏ సంవత్సరంలో శాసనంలో పేర్కొబడ్డ తిథి వార నక్షత్రాలు సరి పడునో యల్. డి. స్వామికణ్ణు పిళ్ళెగారి 'ఇండియన్ ఎఫిమరీస్' ననుసరించి, క్రీ॥శ॥ 1328 జనవరి, 14వ తారీఖునకు పై వివరం సరిపడ్డట్టు గుర్తించటం జరిగింది.[10] గవర్నమెంటు ఎపిగ్రఫిస్టు చేసిన పరిగణన కూడ[11] పూర్తిగా దీనితో సరిపోవటంతో దానిని ప్రామాణికంగా నిర్ణయించుకొని దానినే శాసనదత్త కాలంగా ప్రకటించడం జరిగింది. అంతేతప్ప, ఎక్కడా ఎప్పుడూ క్రీ॥శ॥ 1420వ సంవత్సరంకంటె అనంతరమని అననూ లేదు; అభిప్రాయపడనూ లేదు.

11. "చారిత్రకముగా నీ కథకు ప్రాధాన్యత ఘటించు యత్నములో స్థానిక చరిత్రలలో గల యొకానొక వృత్తాంతము నా దృష్టి లోనికి వచ్చినది."

—వ్యాసకర్తకా వృత్తాంతము ఎంత క్రొత్తగా దృష్టి లోనికి వచ్చినప్పటికీ, వారి అలవాటు ననుసరించి అది ఎక్కడిదో పేర్కొన నిచ్ఛగించనప్పటికీ, యిట్టిదే అయిన కథ ఏకామ్రనాథుని 'ప్రతాపరుద్ర చరిత్ర'లో నున్నది.[12] కాకతీయ రాజుల వంశ చరిత్ర వర్ణింపబడే సందర్భంలో పౌరాణిక వంశక్రమం కూడ పేర్కొనబడింది. జనమేజయునకు శతానీకుడు, అతనికి క్షేమంకరుడు, వానికి విజయార్క సోమేంద్రులనువారలు, విజయార్కునకు విష్ణువర్ధనుడు జన్మించినట్లందున్నది. (ఈ విష్ణు వర్ధనునికి రాజరాజనరేంద్రుడు, ఆతనికి సారంగధరుడు జన్మించినట్లు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో అధిక పాఠ మున్నది.[13] అలాగే సోమేంద్రుని మనుమడైన నందుని వర్ణించే సందర్భంలో అతడు చాళుక్యవంశ తిలకుడని ఉంది.[14])

ఇలాంటివన్నీ మధ్యయుగాల్లో అధికారం హస్తగతం చేసుకున్న రాచరికాలకి పౌరాణికతని, ప్రాచుర్యాన్ని తేవటానికి చేయబడ్డ ప్రయత్నాలు మాత్రమే. ఇవేవీ చారిత్రక దృష్టిలో పెద్దగా ఉపయోగకరం కావు. శాసనపరంగా, సాహిత్యపరంగా యిలాంటి ప్రయోగం ముందుగా చేసినవాళ్ళు చాళుక్యులే. పాల నాధిపత్యం సంప్రాప్తించిన కొన్ని వందల సంవత్సరాల తర్వాతి శాసనాల్లో, తాము చంద్రవంశీయులమనీ, అయోధ్యనుండి దక్షిణ దేశాలకి తరలి వచ్చామనీ చెప్పుకున్నారు.[15] అయోధ్య ఎప్పుడూ చంద్రవంశీయుల కేంద్రస్థానం కాకపోవటాన్ని బట్టి, పాలనాధికారం చేపట్టిన కొన్ని వందల సంవత్సరాల వరకు

యిచ్చిన అసంఖ్యాక శాసనాల్లో ఎక్కడా వారి విషయాన్ని ప్రస్తావించక ఒక్కసారిగా అర్వాచీన కాలంలో చెప్పుకోవటాన్ని బట్టి, చరిత్రకారులీ విషయాన్ని నిర్ద్వంద్వంగా ఖండించి, వారి పౌరాణిక వంశక్రమాన్ని ప్రక్కన పెట్టడం జరిగింది.[16] ఈ అంశం కూడ ఆ కోవకే చెందుతుంది. తన కథనంలో ఏకామ్రనాథుడు చరిత్ర ప్రసిద్ధి చెందిన కొందరిని పేర్కొని వారి ఘనకార్యాలని గురించి ఒప్పుగానో, తప్పుగానో తాను తెలుసుకొన్న విషయాన్ని మన కందించాడు. ఇందులో ఎన్నో విషయాలు నిర్ధారిత చారిత్ర కాంశాలకు విరుద్ధంగా, కాలవ్యతిరిక్తంగా, పూర్వ భవిష్య కథనాలుగా ఉన్నాయని దాని పీఠికలో సంపాదకులే పేర్కొన్నారు.[17] అంతర్గతమైన ఎన్నో సాక్ష్యాలాధారంగా చెప్తూ యీ కథనం క్రీ॥శ॥ పదహారవ శతాబ్దిలో వ్రాయబడిందని సోదాహరణంగా వివరణలిచ్చారు.[18] (వాటినన్నింటిని పేర్కొనటానికిది సందర్భం కాదు; జిజ్ఞాసువులు 'ప్రతాపరుద్ర చరిత్ర' పీఠిక పరిశీలింప ప్రార్థన.)

కనుక క్రీస్తుపూర్వంనాటివని దృష్టి సారించి వ్యాసకర్త మన కందించిన స్థానిక చరిత్రలోని అంశాలన్నీ మధ్యయుగాల్లోని కథనాలని స్పష్టంగా తెలుస్తోంది. అంతేకాదు, ఏ అనుమకొండ ప్రాంతం చంద్రవంశపు రాజులకు ముందు కిరాతకులు పాలించినట్లు వ్యాసకర్త పేర్కొన్న స్థానిక చరిత్రలో వుందో, అదే కథనం 'ప్రతాపరుద్ర చరిత్ర'లోనూ వుంది. ఇది దీని రచనాకాలంనాటికే జనశ్రుతిలో వున్న వృత్తాంతం. ఓరుగల్లు నిర్మాణానికి పూర్వం కాకతీయులకు రాజధానిగా ఉన్న అనుమకొండను, కాకతీయులు అధికారానికి రాకముందు, అనుమడు, కొండడు అనే యిద్దరు ఎఱుక (కిరాత) రాజులు పాలించినట్లు 'ప్రతాపరుద్ర చరిత్ర' చెప్తుంది. ఈ అనుమడు, కొండడు అనువారల పేరుమీదనే 'అనుమకొండ' అనే ఊరు పేరేర్పడినట్లు జనశ్రుతి. జనశ్రుతిరూపమైన యీ స్థానిక వృత్తాంతం కాకతీయ శాసనాల్లో కూడ పేర్కొనబడింది. గణపతిదేవుని సోదరి మైలాంబ వెయించిన బయ్యారం చెఱువు శాసనంలో కాకతీయ మొదటి (గరుడ) బేతరాజు అనుమడిని, కొండడిని జయించి అనుమకొండను రాజధానిగా చేసుకొన్నట్లు చెప్పబడి "గరుడాంక బేతనృపతిః.... హత్వాయోనుమ నామధేయ మహితం కొండమ్ప చక్రేపురం విఖ్యాతానుమకొండం ఊర్జిత యశః" అని పేర్కొంటుంది.[19] అనుమకొండకు సంబంధించిన స్థానిక చరిత్రలోని యీ జనశ్రుతిని వాస్తవంగా వ్యాసకర్తలాంటివారు గ్రహించదలిస్తే, మొదటి బేతరాజు క్రీ॥శ॥ 1000-1052 ప్రాంతాలవాడు కనుక అనుమడు, కొండడు కూడ యీ కాలంవాళ్ళేనని అంగీకరించాల్సి వుంటుంది. ఈ అనుమడు, కొండడు పాలన నెరపిన తర్వాత నాగడు, గార్గేయుడు అనేవాళ్ళు పాలించినట్లు మొత్తం వీళ్ళు నలుగురూ ఆ ప్రాంతాన్ని 186 సంవత్సరాలు పరిపాలన చేసినట్లు, వ్యాసకర్త ఉట్టంకించిన స్థానిక చరిత్రలోను, ఏకామ్రనాథుని కథనంలోనూ కూడ వుంది. కనుక "ఈ కిరాతకుల పిమ్మట చంద్రవంశపు రాజులీ యనుమకొండ రాజ్యమును పరిపాలించినట్లు"న్న కథని చరిత్రగా నమ్ముతున్న వ్యాసకర్త రూఢిగా వీరి పాలన (మొదటి బేతరాజు కాలానికి సుమారు శతాబ్దిన్నర అనంతరం) పన్నెండవ శతాబ్ది ప్రాంతంలో ఉన్నట్లు అంగీకరించాల్సి వస్తుంది!!

ఆ పద్ధతిలో వ్యాసకర్త ఏ స్థానిక చరిత్ర ఆధారంగా యీ కథకు చారిత్రక ప్రాధాన్యత ఘటించ యత్నించారో అదే గాథ యీ వంశీయులను క్రీ॥శ॥ పన్నెండవ శతాబ్ది తరువాతివారుగా నిరూపించుచున్నది. జనశ్రుతులను, తత్తుల్యమైన స్థానిక చరిత్రలను బట్టి ప్రస్తుతాంశాన్ని క్రీస్తుపూర్వపు శతాబ్దాల్లోని వాస్తవ చరిత్రగా భ్రమించటం సహేతుకం కాదని దీనినిబట్టి తెలుస్తోంది. తెలిసిన చరిత్రను నిర్ధారించటానికి జనశ్రుతి ఉపయోగపడుతుంది తప్ప, వస్తుతః దానికి చారిత్రక గౌరవం లభించదు. ఆ జనశ్రుతిలోని సూచన లేమేరకు పరిగణించాల్సి వుందో అన్నది యితరాధారాల వెలుగులో విజ్ఞతతో పరిశీలకులు తేల్చుకోవాలి. మనకున్న చాల గ్రామాలకి పౌరాణిక గాథల్తో సంబంధం చెప్పబడుతుంది.[20] చరిత్ర రచనలో వాటిని ప్రధానంగా తీసుకొని పరిశీలించబూనటం పద్ధతి కాదు. 'మూలగ్రంథం' అంటూ కాలం, కర్తృత్వం తెలీని ఓ గ్రంథాన్ని పట్టుకొని దానిలో యీ కథ క్రీస్తుపూర్వం జరిగినట్లున్నది కనుక, ఓ పుక్కిటి పురాణంలాంటి స్థానిక చరిత్రలో జనమేజయుడి మనుమడి మనుమడిగా ఓ విష్ణువర్ధన నామం లభ్యమైంది కనుక, ఆ రెండింటికీ లంకెగట్టి, చరిత్ర రచనలో ప్రామాణికంగా తప్పనిసరిగా నిర్ధారించి ఋజువు

వరచవలసిన కాల, ప్రాంతాల ఛాయలకు పోక, తాము నెత్తి కెత్తుకొన్న ఆధారాల చారిత్రకత, ప్రామాణికతలను నిర్ణయించు కొనే ప్రయత్నం కూడ చేయక, విమర్శలకు దిగేముందైనా ఇప్పటివరకు యీ అంశంలో ఏ పరిశీలకులు ఏ ఆధారం కార ణంగా ఏ నిర్ణయానికొచ్చారో తెలుసుకొనే ఓరిమి, శ్రద్ధ లేక, తాము వెనుక చెప్పినదానికి ముందు చెప్పిందే ప్రమాణమన్న రీతిలో వాదన సాగించి, పరిశోధకుల విలువైన కాలాన్ని, పాఠకుల ఆసక్తిని, 'భారతి'లో వుండే కొద్దిపాటి స్థలాన్ని హరించబూనటం హర్షణీయమైన పద్ధతి కాదు. ప్రామాణి కాధారాల్తో శాస్త్రీయ చరిత్ర రచన కుద్యమించవలసిన పరిస్థితు లలో ఆధారాల్లేని అర్వాచీన విషయాన్ని పట్టుకొని కథనాన్నే కాకుండా, చరిత్ర రచనాపద్ధతినే క్రీస్తుపూర్వపు శతాబ్దాలకి దిగ లాగటూనటం ఎవ్వరూ ఆమోదింపదగ్గది కాదు.

* * *

కన్యకా పురాణంలోని చారిత్రకాంశాల్ని ఎంతవరకు విశ్వసించవచ్చునో తెలుసుకోవటానికి చాళుక్యరాజైన విష్ణు వర్ధనుణ్ణి గుర్తించటం చాల ముఖ్యం. ఈ ఉదంతం చారిత్రకంగా సందేహాస్పదం కానిది కాదన్న విషయం జగద్విదితం. ఈ పురాణం కేవలం వైశ్యుల కులప్రాశస్త్యాన్ని ఉగ్గడించటానికి మధ్యయుగాల్లో వెలువరించబడ్డ కథనం. చాల కులాలు తమ తమ ఆత్మోన్నతిని ప్రదర్శించుకొందికి తద్వారా ప్రభావితం చెందటానికి ఎన్నో కుల పురాణాల్ని మధ్యయుగాల్లో పుట్టించు కొన్నాయి.[21] కోమటి, కంసాలి, సాలె, తెలుకలి, గొల్ల మొద లైన కులాలకి, కుల విభాగాలకి సంబంధించిన కుల పురాణాలన్నీ యీ కోవకే చెందుతాయి. ప్రతీ ఒక్కటీ, దానికి ప్రాచుర్యాన్ని ప్రామాణికతను కల్పించుకొనే మహాయత్నంలో వాటికింకా మూలాధారాలున్నాయనీ అంతో ఇంతో ఏదో పురాణాంతర్గతమనీ చాటుకొనే ప్రయత్నాలన్నీ నమ్మకంగానే చేసుకున్నాయి. కన్యకా పురాణానికి సంబంధించినంతవరకూ, కొన్ని విషయాల్లో ఈ గ్రంథం ఎంత అపూర్వమే అయినప్పటికీ చిలుకూరి వీరభద్ర రావు[22], జి. ఆర్. వర్మ[23]లాంటి చరిత్ర పరిశోధకులు వేర్వేరు కారణాల వలన దీనిలోని చారిత్రకతని శంకించారు. వివిధాలైన ప్రతుల్లో భిన్నంగా ఉన్న వివరాల్ని బట్టి విష్ణువర్ధనుణ్ణి గుర్తించటం సాధ్యమయ్యే విషయం కూడ కాదు. అయినప్పటికీ, వాసవీ కన్యకతో కలసి అగ్నిప్రవేశము చేసిన వైశ్యుల నూటరెండు గోత్రములు యీనాటికీ ఆ కులములో అతి పవిత్ర గోత్రములుగా భావింపబడటం, పెనుగొండలోని వాసవీ కన్యకయే నేటికీ వైశ్యు లందరి కులదైవంగా అర్చన లందటంలాంటి కారణాల వలన, యీ గాథను పూర్తిగా ఏ భాస్కరాచార్యుని కల్పనో అని త్రోసి పుచ్చక సాధ్యమైనంతలో చారిత్రకాధారాల వెలుగులో యీ అంశాన్ని అన్ని కోణాల్లోనూ పరిశీలించటం జరిగింది. కేవలం పొరపాటువల్లనో, లేక కథకు ప్రాంతీయత ఘటించే ఆసక్తి మేరకో భాస్కరాచార్యుడీ కథను రాజమహేంద్రవర చాళుక్య రాజులకు, పెనుగొండ వైశ్యులకు ముడిపెట్టడంతో సమస్య మరింత జటిలమైంది. దీనిలోని విష్ణువర్ధనుడు గుర్తింపబడనిదే యీ గ్రంథపు చారిత్రక ప్రామాణ్యాన్నే అంగీకరించటం కష్ట మౌతుంది. పురాణకర్త వైశ్యుల ప్రాయోపవేశ సమయంలోని ఓ దాన శాసనకాలాన్ని పేర్కొంటూ 'కల్యాద్యబ్ద గణేష్ట నేత్ర రసదృక్సంఖ్యే' అని సూచించారు. సూచన మొదట్లో స్పష్టత లేకపోయినా దీన్ని అష్ట, నేత్ర, రస, దృక్, సంఖ్యగా కలి సంవత్సరం 2628గా భావించి క్రీ॥పూ॥ 474గా అనుకోవలసి వస్తుంది. రాజమహేంద్రవర, పెనుగొండ ప్రాంతాల్లో ఆ కథ అంత ప్రాచీనకాలంలో జరిగిందనటానికి చారిత్రకంగా అవకాశం లేదు. మొదటి అమ్మరాజుకన్నా ముందు రాజమహేంద్రవర నిర్మాణమే లేకపోవటం[24], ఈ విషయాన్ని పేర్కొంటున్న కథనం సమకాలీనపుదిగాని సమీప కాలపుదిగాని కాక సుమారు రెండు సహస్రాబ్దుల తర్వాతది (క్రీ॥శ॥ పదహారవ శతాబ్ది) కావటం, ఈ గాథను 'చరిత్ర'గా కాక 'పురాణం'గానే భావించే పరిస్థితి కల్గిస్తున్నాయి. అయితే చాల ఆసక్తికరంగా దీనిలో పేర్కొనబడ్డట్లే "కల్యాద్యబ్ద గణేష్ట నేత్ర రసదృక్సంఖ్య" సంవత్సరంలో రాజమహేంద్రవరం రాజధానిగా ఓ విష్ణువర్ధనుడు పాలిస్తున్నట్టు, గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకాలోని పెద్ద చెఱుకూరు శిలాశాసనంలోను[25], ఇఱుగ్రామ తామ్ర శాసనం లోను[26] కానరావటంతో సమస్య మరింత క్లిష్టమైంది. శాసనపు లిపి కాలాన్ని బట్టి, అర్వాచీనమైన 'కేసరిపాటిగడ' మొదలైనవి పేర్కొన్న అంతఃసాక్ష్యాన్ని బట్టి, రూఢిగా ఆ శాసనం 13, 14

శతాబ్దాలకు చెందటంతో, ఆ రెండు శతాబ్దాలలో పై వివరాలున్న తిధి- వార, నక్షత్రాలను పరిశీలించి శిలాశాసనకాలాన్ని క్రీ॥శ॥ 1328, జనవరి, 14వ తారీఖుగా బుజువు చేయటం జరిగింది.[27] గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు ఇతుగ్రామ తామ్రశాసన కాలానికి చేసిన పరిగణన కూడ దీన్నే సూచించటంతో[28] యిది నిర్ధారిత మైంది. ఈ ఆధారాల్నిబట్టి ఆ సమయంలో రాజమహేంద్ర వరంలో ఓ చాళుక్య విష్ణువర్ధనుని ఉనికిని గుర్తించవలసి వస్తుంది. కాని చరిత్ర ననుసరించి చూస్తే ఆ సమయంలో ఏ చాళుక్య రాజూ రాజమహేంద్రవరాన్ని కాదు సరికదా, ఆ పరిసరాల్లోనే పాలించకపోవటం గమనించదగ్గది.[29]

అధవా, క్రీ॥శ॥ 1328లో ఓ విష్ణువర్ధనుడెవడైనా పెనుగొండలోని వైశ్యకన్యక బలిదానానికి కారణభూతమయ్యేడనుకొందికైనా, మరికొన్ని అభ్యంతరాలున్నాయి. క్రీ॥శ॥ 1164 నాటిదైన ఒక ఘంటశాల 'నూటరెండు గోత్రముల వైశ్యులని' వర్ణింపబడింది.[30] వైశ్యులలో యీ నూటరెండు గోత్రాల ప్రాముఖ్యత వాసవీ కన్యలేడి వారి అగ్నిప్రవేశకాలంనుండి మాత్రమే ఏర్పడింది. అందువల్ల దానికి అర్వాచీనమైన క్రీ॥శ॥ 1328 సం॥లోనిదనుకున్న విష్ణువర్ధన - కన్యకల ఉదంతాన్ని అంగీకరింపక త్రోసిపుచ్చవలసి వస్తోంది. కన్యకా పురాణము లోని చారిత్రకత పరిశీలించటానికి, అందులోని విష్ణువర్ధనుణ్ణి గుర్తించటానికి ఆధారాలు లేవు.

## అధోజ్ఞాపికలు :

(1) ఈస్టరన్ చాళుక్యన్ టెంపుల్స్ ఆఫ్ ఆంధ్రదేశ, యమ్. రామారావు, -పే.2, (2) ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు ప్రొసీడింగ్సు, 11వ సమావేశము(1987), -పే. 70, (3)భారతి, డిసెంబరు, 1951, -పే. 1140, (4) భారతి, జూన్, 1983, -పే. 65, (5) ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు ప్రొసీడింగ్సు, 6వ సమావేశము (1982), -పే. 69. (6) హిస్టరీ ఆఫ్ ది మైనరు చాళుక్య ఫేమిలీస్ ఇన్ మిడీవల్ ఆంధ్రదేశ, (బి.ఆర్. పి.పి. ఢిల్లీ, 1986), -పే. 184. (7) ఫ్యూడటరీస్ అండరు ఈస్టరన్ చాళుక్యాస్, (జ్ఞాన్ పబ్లిషింగ్ హౌస్, ఢిల్లీ, 1987), -పే. 87. (8) భారతి, సెప్టెంబరు, 1972, -పే. 13. (9) ఎ. ఆర్.ఇ. నెం. 851 ఆఫ్ 1917, -పేరా. 84. (10) భారతి, అక్టోబరు, 1980, -పే. 14. (11) ఎ.ఆర్.ఇ. పి.పి. నెం. 13 ఆఫ్ 1961-62. (12) ప్రతాపరుద్ర చరిత్ర, (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1984), -పే. 31. (13) పైవలె, -పే. 103. (14) పైవలె, పే. 104. (15) ది ఈస్టరన్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, యన్. వెంకటరమణయ్య, -పే. 7. (16) పైవలె. (17) ప్రతాపరుద్ర చరిత్ర, -పే. 14. (18) పైవలె. -పే. 11. (19) ఎపిగ్రాఫియా ఆంధ్రిక, 1, శ్లో. 10. (20) గ్రామకైఫియ్యత్తులు, (గుంటూరు తాలూకా); (ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్, హైదరాబాదు, 1984) (21) మధ్యాంధ్రయుగ చారిత్రక వ్యాసములు, కె. సూర్య నారాయణ, -పే. 71. (22) రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పే. 143. (23) భారతి, మే, 1964, -పే. 29. (24) భారతి, అక్టోబరు, 1980, -పే. 14. (25) యస్.ఐ.ఐ. సంపుటి. 6, నెం. 202. (26) ఎ.ఆర్.ఇ. పి. పి. నెం. 13 ఆఫ్ 1961-62. (27) భారతి, ఫిబ్రవరి, 1983, -పే. 42. (28) ఎ.ఆర్.ఇ. పి.పి. నెం. 13 ఆఫ్ 1961-62 (29) హిస్టరీ ఆఫ్ ది మైనరు చాళుక్య ఫేమిలీస్ ఇన్ మిడీవల్ ఆంధ్రదేశ (30) ఎ.ఆర్.ఇ. పి.పి. నెం. 851 ఆఫ్ 1917; పేరా.84.

# నల్ల సూరీడు

## శ్రీ దిలావర్

సూరీడా! ఓ సూరీడా!
తెల్లచీకటి అహం కాటేసిన నల్లసూరీడా!
జనాలను శవాలను చేసే ఆకలినీ
శవాలను కూడా ఆశించే రోగాలనూ
రోగంలా పీడించే దరిద్రాన్నీ
దరిద్రంగా కావిలించుకునే జాతీనత్వాన్నీ
వాటిని ప్రసాదించిన జాత్యహంకారాన్నీ
రూపుమాపాలని దీక్షబూనినవాడా!
రూపుకట్టిన రాక్షసాధికారాన్ని ధిక్కరించినవాడా!
నీ స్వేచ్ఛాభావ జ్వాలలతో
జనం రక్తాన్ని అగ్నిసరస్సులుగా మార్చినవాడా!
నీ మాటల కాగడాలతో
జాతి గుండెల్లో గంధకపు గనులు పేల్చినవాడా!
పీడితజన ముక్తగీత నాదానివై
ముక్తిమార్గ నిర్దేశ వాదానివై
నిప్పుల బాటలో నడచినవాడా।
నీ గుండెను అగ్నిగోళంగా చేసుకున్నవాడా!
మండే తొగనూడా! అళా దినకరుడా!
నీ సహస్ర కరాలను విరిచేయాలని
కారుమబ్బులు క్రమ్ముకున్నాయి

నీ మానవీయ తేజస్సును కబళించాలని
కారుచీకట్లు ముసురుకున్నాయి
కత్తులవంతెన కట్టిన రోబెన్ ద్వీపం[1]
ఆర్పలేకపోయింది మండే సూర్యుని రూపం!
ప్రాణభిక్ష పెట్టాలనుకున్న రివోనియా[2] మృత్యు
గహ్వరం-
వజ్రసంకల్పంముందు వంచుకున్నది శిరం!
మాతృదేశపు మట్టిలో-
శ్వేతజాతి రక్తదాహంలో
పూచిన ప్రతి రక్తపు బొట్టునూ శ్వాసించినవాడా!
రక్తదఘ్న ధ్యేయంతో విప్లవించినవాడా!
నీ నామ మరందాన్ని తన అణువు అణువులో నింపుకొని
నీ భావ సరసిలో తన రేకు రేకునూ విప్పుకొని
పల్లవిస్తున్నది ప్రపంచ ప్రసూనం!
వసుధైకమనే అమ్మ ఒడి చూపుతూ
దేశదేశాల పౌరసత్వం స్తన్యం చేపుతూ
నీ సమరశీల స్వాతంత్ర్య సందేశాన్ని
కోటి గొంతులతో రుతిస్తున్నది
తరుణారుణ స్వప్నాల పుష్పాలతో
పుడమితల్లి స్వాగతిస్తున్నది....

(శ్వేతజాత్యహంకార కబంధహస్తాల్లో జీవితకాలం మగ్గిన
నెల్సన్ మండేలా త్వరలో విడుదల కానున్నాడన్న వార్త చదివాక)

1. ఈ ద్వీపంలో ఉన్న చెరసాల భయంకర చిత్రహింసలకు ప్రఖ్యాతి చెందింది.

2. 'రివోనియా కేసు'లో విధించబడే మరణశిక్షకు భయపడి నెల్సన్ మండేలా క్షమాభిక్ష కోరుకుంటాడని తలచింది ప్రిటోరియా ప్రభుత్వం.



డాక్టర్ గుమ్మా సాంబశివరావు

# 'సుభద్రా కళ్యాణము'లో స్త్రీ స్వభావ చిత్రణం

పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యుని భార్య తాళ్లపాక తిమ్మక్క. కవి కుటుంబానికి చెందిన తిమ్మక్క 'సుభద్రా కళ్యాణము' ద్విపదలో రచించింది. 'సుభద్రా కళ్యాణము'ను ఒక పాటగా మాత్రమే తిమ్మక్క పేర్కొన్నది. నన్నయ భారతాన్నే ఈమె చాలావరకు అనుసరించింది. అయినా అక్కడక్కడ స్త్రీ సహజమైన స్వభావంతో కొన్ని కొన్ని వర్ణనల్ని, ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన అంశాల్ని రమణీయమైన రీతిలో వర్ణించింది. 'సుభద్రా కళ్యాణము'లో స్త్రీ స్వభావ చిత్రణను పరిశీలించడం ప్రస్తుత వ్యాసోద్దేశం. ఆయా స్త్రీ పాత్రలనుబట్టి స్త్రీ స్వభావ చిత్రణను ఈ విధంగా గమనించవచ్చు.

సుభద్ర :

తీర్థయాత్రలో భాగంగా పార్థుడు ప్రభాస తీర్థానికి చేరుకొన్నాడు. ఆ తీర్థానికి చేరువలో ద్వారకాపురిలో ఆలకాపరి శ్రీకృష్ణుడుంటాడని మునులు చెప్పారు. ఆజన్మ మిత్రుడైన ఆకంజదళాక్షుని సేవిస్తే కోరికలు తీరతాయనుకొన్నాడు. అంతే కాకుండా ఆ నీలలోచనుని అనుగు చెల్లెలు సుభద్రను చూడాలనుకొన్నాడు. ఆమెనుగూర్చి అంతకుముందే విన్నాడు. ఆమె మదిరాక్షి, మత్తేభగమన, సుకుమారి, గుణవతి కాబట్టి క్షణమైనా ఆమెను చూడాలనుకొన్నాడు. ఇక్కడ సుభద్రపట్ల తిమ్మక్క ప్రయోగించిన విశేషణాలు ప్రత్యక్షర సత్యాలు.

రైవత మహోత్సవానికి సకల జనులూ బయలుదేరారు. సుభద్ర బంగారుపల్లకిలో అక్కడకు చేరుకొన్నది. వాసవిసుతుడు తనకు వరుడు కావాలని మొక్కుకొన్నది. అర్జునుని తనకు వరునిగా ప్రసాదించమని కోరుకోవడంలో ఆమెకు అర్జునునిపట్ల ఉన్న గాఢానురాగం వ్యక్తమవుతుంది. అదే సమయంలో అర్జునుడు సుభద్ర రూపాన్ని తన మదిలో ఈ విధంగా తలపోస్తున్నాడు.

ఇంతి మోమునకు చంద్రుడీడైనసేమి
కుంతలాల కలిమి కొదమ తుమ్మెదలు
బాల కనుబొమ్మల ప్రతియౌను విల్లు
పాలించు ముత్యముల పణతి చిర్నగవు
సతినాస తిలపుష్ప సమమైనదేమి
అతివ మధ్యమ్ము సింహమునకు సరియె." (పుట-15)

—సాంప్రదాయికమైన ఉపమానాలతో చెప్పినా తిమ్మక్క సుభద్ర రూపాన్ని మనోహరంగా వర్ణించింది.

యతిరూపంలో ఉన్న అర్జునునికి సేవలు చెయ్యడానికి సుభద్ర నియమించబడింది. ఆమె వడ్డించిన పదార్థాల్ని మక్కువతో తిన్నాడు. అప్పుడు తెరవద్ద నిలబడి సరసాలాడాడు. శృంగారాన్ని రంగరించిన పలుకుల్ని పలికాడు. సుభద్ర నివ్వెరపోయింది. అవును! ఏ వ్యక్తి అయినా ఈ విషయానికి నివ్వెరపడక తప్పదు. ఇంతకాలం మునీంద్రుడని భావించి పూజిస్తూ ఉన్నది. ఇప్పుడీ విధంగా మాటలాడేటప్పటికి నివ్వెరపాటు కాదు వెగటు కూడా పుట్టిందామెకు. వెంటనే తనకు అత్యంతాప్తుడైన అన్నయ్య కన్నయ్య దగ్గరకు చేరింది. ఇతడు మోసగాడేకాని ముని కాదన్నది పలకరాని మాటలు పలికాడని చెప్పింది. ఈ సన్యాసిని అంతఃపురంలో ఉంచడం భావ్యం కాదన్నది. మునిజనానికి సేవ చేయడంలో ఆసక్తి ఉన్న సుభద్రకు వెగటు పుట్టించాడా మునీంద్రుడు. అనుకోని విధంగా, అకస్మాత్తుగా జరిగిన పరిణామానికి వణతులెలా ప్రతిస్పందిస్తారో తిమ్మక్క ఇక్కడ సుభద్ర పాత్రద్వారా వ్యక్తం చేసింది.

శ్రీకృష్ణుడు సుభద్రను శాంతింపజేశాడు. చిరునవ్వుతో ఇలా పలికాడు.

"సుదతి యీతని జూడ సురపతి సుతుడె
మనసు నీకనుమానమ్ము వద్దు" (పుట-24)

—అందువల్ల ఎప్పటిలాగే పూజించుమని చెప్పాడు. అప్పటి నుంచీ సుభద్ర మునిని చక్కగా ఆరాధిస్తున్నది. ఆ సమయంలో సుభద్ర ఇలా తలపోసింది.

"చూడగా నీతడు క్రీడియేకాని
వాలాయముగ యతీశ్వరుడు గాబోడు
కపట సన్యాసిగా కల్పించి యిచట
వుపమను శ్రీకృష్ణు డునిచినాడేమొ" (పుట-25)

—ఆ యతీశ్వరుడు అర్జునుడే అని సుభద్ర గ్రహించింది. అందుకే ఆనాటినుంచి సుభద్ర అందంగా తయారయింది. సుభద్ర అలంకరణల్ని, అలంకరించుకొని తిరుగుతున్న తీరును తిమ్మక్క హృద్యంగా వర్ణించింది.

"జాజి గొజ్జగినీట జలకమ్ములాడి
రీతిగా నొక వింతరేఖ చూపట్టి
ఉమ్మెత్త పువ్వునలె నుతికిన మడత
నఖముల గొసితెచ్చి నాతి యిచ్చినను
చెంగావి పావడ రంగు మీరంగ
చుంగు విడిచికట్టి సుదతి సుభద్ర
పాలిండ్ల వలను కన్పడగ నొ కవింత
లీల పయ్యెద కొంగు లేజాఱ విడిచె
నటనతో పైనము నడిచేటి మగువ" (పుట-25)

—ఇక్కడ యవ్వనంలో ఉన్న సుభద్ర అలంకరించుకొన్న తీరు, ఒయ్యారాన్ని ఒలికిస్తున్న విధమూ, పాలిండ్లు కనబడే విధంగా కొంగును కొద్దిగా జారవిడిచిన సుభద్ర రూపం పాఠకుల మనో నయనాల్లో చెరగని ముద్ర వేస్తుంది. ఇంకా సుభద్ర స్వరూపాన్ని ఈ విధంగా చెప్పింది. "దువ్విన కురులతో పాపట బాగా తీర్చి, కప్పు కొంచెం జారవిడిచి, సుల్లెలు మొల్లలు మొద లైన పుష్పాలు అలంకరించుకొని, గుమ్మడిగింజ నామం తీర్చి, అనేకాభరణాలతోపాటు మూడువేలు వెలచేసే ముక్కఱు పెట్టింది. గోవా కస్తూరి పూసింది. పెంపుడుచిలక తోడుగా ఉంది. స్తంభం చాటున ఉండి మునిని చూస్తున్నది. శృంగారోద్దీపితమైన అలంకరణల్ని గావించింది. తద్వారా తన మనోరథం నెరవేరు తుందని ఆశించింది. ముని దగ్గరకు వెళ్ళి ఒక మాట అడగాలను కొన్నది. మెల్లగా ఇలా అడుగుతున్నది.

"అయ్యా మీరే దేశ మరసి చూచితిరొ
యెయ్యది మీనామ మెచట నుండుదురొ
పరగ నింద్రప్రస్థ పట్టణమ్మనను
బహుళ సంపదలతో బరగుచున్నార
ధీర మానసుల్ కుంతీ సుతుల్ వారు
అరయ గడు సుఖులై యున్నవార
కో రి మా మేనత్త కొడుకు లైదుగురు
వారికి కుశలమా వరముని చంద్ర
ఆ రాజవరులలో నర్జునుండెలమి
ధారుణి తీర్థముల్ దరిసింపనేగె
తీర్థక్షేత్రముల్ తిరుగుచో మీరు
ఇంద్రనందను నెందు నే జూడలేద
................................
అని మున్న వింటి నేనతడు తానిటకు
సనుదెంచు టెఱిగితే సంయమినాథ
యీ ద్వారకాపురి యెంతొ దూరమని
తన పురమున కట్టె తానేగెనేమొ" (పుటలు-28,29)

—తిమ్మక్క ఇక్కడ స్త్రీస్వభావాన్ని సుభద్రలో మనో హరంగా చిత్రించింది. తాను వలచినవాడు అర్జునుడు. తనకు కావలసింది అర్జునుని సమాచారం. అందువల్ల మొదటనే అర్జునునిగూర్చి అడగవచ్చు కదా! కాని అలా అడగలేదు. అర్జునుడిమీదే తన కోరిక ఉన్నట్లు యతికి తెలియకూడదు. అందు వల్ల ముందుగా పాండవులందరిని గూర్చి అడిగింది. ఆ తర్వాత అర్జునునిగూర్చి విడిగా అడిగింది. ఆ అడగడం కూడా 'చిత్సౌఖ్య రసలత చిగురించగా, ఉత్సాహముతో మేను ఉప్పొంగి, పలుకు పలుకున తేనెలొలుకగా' అడిగింది. యతి రూపంలో ఉన్నది అర్జునుడే అని తనకు తెలిసినా అతడేం చెబుతాడోనని అడిగింది. అప్పుడు గుప్తరూపంలో ఉన్న మునీంద్రుడిలా పలికాడు

"వలపు గల్గకయుండ పలుక గల్గుదునె
పడుచుదనమున నె పలుక పక్కలను
మనసులో నుంచువా నను రాజఋషిని" (పుట-29)

—ఈ పలుకుల అంతరార్థాన్ని సుభద్ర అర్థం చేసుకొన్నది. లేతనవ్వు నవ్వింది. కామతంత్రము రహస్యాలు పుష్పించాయి. చిలుక రాయబారాన్ని పంపింది. ఆ చిలుక 'సుభద్ర నిన్నే కోరింది. ఇంద్రప్రస్థానికి తీసుకొని వెళ్ళవచ్చు' అని పలికింది.

సుభద్ర ఇంకా అర్జునుని గూర్చి 'ఆయన ఎక్కడ ఉన్నాడో ఏ తీర్థాలు తిరుగుతున్నాడో అని పలికింది. ముని 'అతనికీ నాకూ తేడా లేదన్నాడు. తనను పెళ్ళి చేసుకోమని ముని రూపంలో ఉన్న అర్జునుడు పలికి, గాంధర్వం రాజులకు సమ్మతమే 'నని చెయ్యి చాచాడు. సుభద్ర తల్లిదండ్రుల, బంధువుల, అన్నల

అంగీకారం కావాలంటూ నగరికి పోయింది. అర్జునుడంటే ఇష్టమైనా పెద్దవాళ్ళ అంగీకారం కావాలన్నది. దీన్నిబట్టి ఆమెకు పెద్దలపట్ల ఉండే గౌరవభావం ప్రస్ఫుటమవుతుంది. పెద్దల అనుమతి కావాలని చెప్పి వచ్చిన సుభద్ర చింతిస్తున్న విషయాన్ని తిమ్మక్క ఈ విధంగా వర్ణించింది.

"చింతించి చెక్కిట చెయిబూని యుండి
మదిలోన తలపోసె మగువ యిట్లనుచు
యింద్ర నందనుడు మహేంద్ర సుతుడు
చేరి వినయమ్మున చెట్టబట్టినను
విడిపించుకొని మరి వేగ బోయితిని
ఎలమి నాతని మనసెట్లుండునొక్కొ
కాకదానొడ బడితె కడు చుల్కదనము" (పుట-35)

—ఈ విధంగా భావిస్తూ సుభద్ర హంసతూలికా తల్పంపై పవ్వళించింది. ముత్యాల చెఱగుతో ముసుగు పెట్టింది. వెంటనే అంగీకరిస్తే చులకన అవుతానని భావించింది. అర్జునుడంటే ఇష్టం ఉన్నప్పటికీ, తన మనోభావాన్ని వెంటనే వ్యక్తం చెయ్యగలిగే స్వతంత్రం ఉన్నప్పటికీ సుభద్ర అలా చెయ్యలేదు. మగవారి దృష్టిలో చులకన కాకూడదనే భావం ఆమెకున్నది కాబట్టి అలా ప్రవర్తించింది.

వివాహానంతం సుభద్రార్జునులు ఇంద్రప్రస్థపురం ప్రవేశించారు. ధర్మరాజు పలుకుల కనుగుణంగా ద్రౌపది శోభనపు గదిని అలంకరించి, పడకటింటికి పొమ్మని సుభద్రతో పలికింది. అప్పుడు సుభద్ర 'అడుగు లోడక యుండి అటు కొంతసేపు' సిగ్గుపడింది. విజయుని పాన్పుదగ్గర సుభద్రనుంచి ద్రౌపది వెళ్ళిపోయింది. విజయుడు సుభద్ర చెయ్యి పట్టుకొన్నాడు. సుభద్ర సిగ్గుతో దివ్వెలమాటుకు పోయింది. ఇంతకుముందు పరిచయం ఉన్నవాడైనా ఆ సమయంలో సిగ్గుపడడం సహజం. అందునా ముద్దరాలైన సుభద్ర ఆ విధంగా ప్రవర్తించడం ఆమె స్వభావానుగుణమే.

రుక్మిణి :

ఈ కావ్యంలో శ్రీకృష్ణునికి అత్యంత ప్రీతిపాత్రురాలిగా రుక్మిణి చిత్రించబడింది. మరదల్ని మన్నించే మంచి వదినెగా రుక్మిణి గోచరిస్తుంది. సుభద్ర ముత్యాల చెఱగుతో ముసుగు పెట్టినపుడు మరదలి స్థితిని చూచి రుక్మిణి నవ్వి ఇలా పలికింది.

"కనులేల మూసేవే కలహంసగమన
శిరసేల వంచేవే సింహేంద్ర మధ్య
వాలుకన్నుల నీరు రాలనేమిటికె
వనిత సన్యాసిని వలపించుకొంటి
రామావతారాన రమణిరో నీవు
శాంత యను పేర సహజాతవైతి
వల వేసుకొంటివే వనితరో నీవు
దేవేంద్రసుతు దృష్టి తెగువతో తాకె
దృష్టి తీయింతుమే తెలివిరా నీకు
తెగ వాలు కన్నుల దృష్టించి చూడ
అతనిచేతనె కాని అది మానదనెను" (పుట-36)

—ఇక్కడ రుక్మిణి మరదల్ని పరిహాసమాడిన తీరు ప్రశంసనీయం. సుభద్ర పూర్వజన్మలో శాంత అని అప్పుడు సన్యాసి అయిన ఋష్యశృంగుని చేపట్టిందని 'ఈ జన్మలోనూ సన్యాసినే కోరుకొంటున్నావా?' అని గేలి చేసింది. అర్జునుని దృష్టి తగిలింది కాబట్టి దృష్టి తీయించాలన్నది. అయితే ఆ దృష్టివల్ల కలిగిన బాధ అతనివల్లనే తీరుతుందని రుక్మిణి భావం. ఇక్కడ స్త్రీ స్వభావ చిత్రణ మనోహరం. దృష్టి తగలడం, దృష్టి తీయడం ఇవన్నీ స్త్రీల అనుభవంలో ఉన్న విషయాలే. విరహతాపంతో వేగుతున్న మరదలికి పెళ్ళి చేయిస్తానని సాంత్వన వాక్యాలు పలికిన మంచి వదినెగా రుక్మిణి చిత్రించబడింది.

వివాహానంతరం తనకు నమస్కరించిన సుభద్రతో రుక్మిణి సుభద్రకు భయం వద్దని ఓదార్చుతూ

"అడలనేటికె మాయమ్మ సుభద్ర
అత్తయు నీకు మేనత్త గాన
వింత వారెవ్వరు వీరి లోపలను
బావమఱదులు చాల భక్తి గలవారు" (పుట 40-41)

అని పలికింది.

—మరదలిపట్ల ఆదరభావం ప్రకటించే ఆదర్శవంతమైన వదినెగా రుక్మిణి సాక్షాత్కరిస్తున్నది. ఈ విధంగా మరదల్ని ఆదరించే మగువలు చాలా తక్కువ అనడంలో అతిశయోక్తి లేదు.

రుక్మిణి సుభద్రతో ఇంకా ఇలా హితవు చెప్పింది.

"పొలతి నమ్మగరాదు పురుషుల నెపుడు
పలురీతి కృష్ణసర్పమ్ము లైయుంద్రు
కొంచక కృష్ణకు కూర్మితోనుండు
వంచన సేయక వనిత ఎప్పుడును
అనుచు బుద్ధులు చెప్పి"ంది (పుట-42)

—ఇక్కడ తిమ్మక్క రుక్మిణి పలుకుల్లో పురుష ద్వేషాన్ని వర్ణించింది. పురుషుల్ని ఎప్పుడూ నమ్మకూడదని, వాళ్లు కాల సర్పాలై ఉంటారని చెప్పింది. దీన్నిబట్టి పురుషుల విషయంలో స్త్రీలు చాలా జాగరూకతతో మెలగాలనే విషయాన్ని సుభద్ర గమనిస్తుందని రుక్మిణి భావం. భర్త చనువు ఇచ్చాడు కదా అని అధికంగా మాటాడవద్దని పలికింది. ఎన్నడూ మోసంతో కూడుకొన్న పనులకు పూనుకోవద్దని చెప్పింది. ద్రౌపదితో స్నేహంగా ఉండవలసిందని చెప్పింది. మంచి గృహిణికి ఉండ వలసిన లక్షణాల్ని రుక్మిణి మాటల్లో తిమ్మక్క చక్కగా తెలియ జేసింది.

ద్రౌపది :

సుభద్ర తనకు నమస్కరించినప్పుడు ద్రౌపది సంతో షించింది. తన భర్త తనకు సవతిని తెచ్చాడని ఈర్ష్యపడలేదు, ఈసడించలేదు. అర్జునుణ్ణి దూషించలేదు. తనకు మొక్కిన సుభద్రను సంతోషంతో ఆదరించింది. చక్కని కొడుకును కనమని ఆశీర్వదించింది. ధర్మరాజు పలుకుల ప్రకారం సుభద్రార్జునుల శోభనపు ఏర్పాట్లు గావించింది. అనేకమైన సుగంధద్రవ్యాల్ని అమర్చింది. నిలువుటద్దాలు చెక్కించి, బంగారు తరికోళ్ళ పట్టె మంచాన్ని వెలయించింది. మల్లెలు పరిచింది. పాలు, పన్నీరు, పళ్లరసాలు సిద్ధం చేసింది - ఇక్కడ శోభనపు ఏర్పాట్లను, తిమ్మక్క హృద్యంగా వర్ణించింది. సుభద్రను అలంకరిస్తున్న ద్రౌపది, అలంకరించబడుతున్న సుభద్ర ఆ సమయంలో జోడు చిలుకలవలె శోభించారని తిమ్మక్క వర్ణించింది.

ద్రౌపది సుభద్రను అర్జునుని దగ్గరకు పంపిస్తుంటే సుభద్ర సిగ్గుపడుతుంది. అప్పుడు ద్రౌపది ఇలా పలికింది.

> "కూరిమి గలవాడు కొమరాల నీకు
> మేలిమి గలవాడు మేనత్త కొడుకు
> నాల్గు నెలలు భిక్ష మేల్గల్గబెట్టి
> యిప్పుడిటువలె సిగ్గులేటికే సుదతి" (పుట-51)

—ఇంతవరకు ద్రౌపది ఉదాత్తంగానే ప్రవర్తించింది. తన ఆధ్వర్యంలోనే అన్ని ఏర్పాట్లు పూర్తిచేసింది. తన భర్త దగ్గరకు తన సవతిని పంపిస్తూ సంతోషించింది. చివరగా అర్జునుని దగ్గర విడిచిపెట్టింది కూడా తానే. ఇంత చేసిన తర్వాత చింత చేసింది. స్త్రీస్వభావం బయటపెట్టింది. తాళలేక మనసులో తలపోసింది.

> "ఏమి వస్తువులైన నియవచ్చుగాని
> ప్రాణేశునిచ్చి మఱి బ్రతుకంగరాదు
> అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుని
> చెల్లెలు గనుకనే నొల్లననరాదు......
> అని మఱి తలపోసి అతివమోదించె" (పుట-52)

—ప్రాణేశుని వేరొక స్త్రీకిచ్చి స్త్రీ బ్రతకలేదట. అయినా ఇక్కడ సుభద్ర శ్రీకృష్ణునికి అనుగు చెల్లెలు కాబట్టి ద్రౌపది సంతోషించింది. ఇక్కడ ద్రౌపది మానసిక సంఘర్షణ స్థితిని తిమ్మక్క హృద్యంగా వర్ణించింది. తాను చేసిన పనికి సంతో షించింది కాబట్టి ఇక్కడ ద్రౌపది స్వచ్ఛమైన మనసును గమ నించవచ్చు.

ఉలూచి :

తీర్థయాత్రలు చేస్తున్న అర్జునుడు అనేక ప్రాంతాలు సంచరించాడు. ఒకనాడు గంగాస్నానం గావించి మిక్కిలి నియమంతో జపతాపాలు గావిస్తున్నాడు. అప్పుడు ఒక నాగ కన్యక వచ్చింది. కనుమాయ గావించింది. అంతే! అర్జునుడు నాగలోకంలో ఉన్నాడు. అర్జునుడు మేల్కొన్న తర్వాత తాను నాగలోకం చేరిన విషయాన్ని గూర్చి ప్రశ్నించాడు. అప్పుడు ఉలూచి అర్జునుని వలచి తెచ్చుకొన్నానని చెప్పింది. ఇక్కడ ఉలూచి సాహసం ప్రశంసనీయం. అరివీర భయంకరుడు, అస్త్రశస్త్ర విద్యానిపుణుడు త్రైర్థికుడు అయిన అర్జునుని మోహించడంలో ఉలూచి అనురక్తి స్పష్టమవుతుంది. మోహించి ఊరుకోలేదు. వలచినవాణ్ణి తన వసతికి తెచ్చుకొన్నది. తన లోకంలో అయితే అర్జునుడు తన మాట వింటాడనుకొని తన లోకానికి తెచ్చుకొన్నది. తన కోరిక తీర్చవలసిందని ప్రాధేయ పడింది. తీర్థయాత్రలో ఉన్న తాను ఉలూచి మనోభీష్టాన్ని నెఱవేర్చడం భావ్యం కాదన్నాడు. అప్పుడు ఉలూచి

> "ధర్మమేదియును ప్రాణదానముతోను
> తులతూగదని మహాత్ములు పలుకుదురు
> చేకొని తన్ను రక్షించిన మీకు
> పాకశాసని! వ్రతభంగ మెక్కడిది." (పుట-5)

అని పలికింది.

—తన కోరిక తీర్చకపోతే తన ప్రాణాలు పోతాయని పలి కింది. ప్రాణదానం సర్వోత్తమ ధర్మమని చెప్పింది. తన కోరిక తీర్చుకోవడానికి ధర్మబోధ చేసింది. ఇక్కడ స్త్రీ తనకు కావల

పిన వ్యక్తిని సొంతం చేసుకోవడానికి చేసే ప్రయత్నాలు, పట్టుదలతో సాధించుకొన్న తీరు స్పష్టం చెయ్యబడింది.

వంద, సౌరభేయి, సమీచి, జయలతలు :

వంద అప్సరస. మిగిలినవారామె సఖులు వాళ్లు యవ్వన చాపల్యంతో ఒక తపోధనుని ధ్యానానికి భంగం కలిగించారు. ఆ ముని శాపప్రభావంవల్ల నక్రరూపాలు ధరించారు. అర్జునునివల్ల శాపవిముక్తులయ్యారు. ఈ పాత్రలద్వారా యవ్వనంలో కళ్లు మత్తెక్కి మునీంద్రులపట్ల అనుచితంగా ప్రవర్తిస్తే ఎదురొక్కనే దుష్పరిణామాలెలా ఉంటాయో తిమ్మక్క చక్కగా వర్ణించింది.

ఈ విధంగా 'సుభద్రా కళ్యాణము'లో ఉలూచి ప్రౌఢ నాయికగా, సుభద్ర సుకుమారిగా, రుక్మిణి ఉదాత్తమైన వదినెగా, ఆడపడుచును అమితంగా ఆదరించే ఆదర్శ గృహిణిగా, ద్రౌపది సవతిని సయితం సమాదరించే సాధ్విగా వంద అనే అప్సరస, ఆమె చెలికత్తెలు యవ్వన చాపల్యం ఉన్న జవరాళ్లుగా చిత్రించ బడ్డారు. చిత్రాంగద, సత్యభామల విషయాలు తక్కువగా వర్ణించబడ్డాయి. స్త్రీ హృదయాన్ని, స్వభావాల్ని చక్కగా అవగాహన చేసుకొని పై రీతిలో వర్ణించిన తిమ్మక్క పరిశీలనా నైపుణ్యం ప్రశంసనీయమనడంలో అతిశయోక్తి లేదు.

---

# పోదూ మరి!

## శ్రీ మంతెన సూర్యనారాయణరాజు

ఆంధ్రరాష్ట్రం నుండి
అన్నపూర్ణ నేడు వెళ్ళిపోనుంది
అయోగ్యులకు జడిసీ కాదు
అప్రయోజకులపై అలిగీ కాదు
అన్నానికి కూడా తన బిడ్డలు
ముఖం వాచిపోతున్నారని-
కాలే కడుపులతో నకనకలాడుతూ
కళ్ళల్లో ప్రాణాలు నిలుపుకున్నారని-
తెచ్చిపెట్టుకున్న తద్దినం తాలూకు
దెష్టాకోరుతనాన్ని ఎప్పుడు పారద్రోలాలా అని
అంతా వింతగా
చింతలే తమ బ్రతుకుగా చింతాక్రాంతులై

అన్నిరకాల కోతలూ భరిస్తూ
అరాచకత్వాన్ని దిగమింగుతూ
ఏ విషయాన్నీ బైటికి చెప్పుకోలేక
చెప్పాలన్నా గొంతు పెగలక
నానా అగచాట్లూ పడుతున్నారని-
ఆర్థిక మాంద్యం పేరుతో
తనని కూడా తాకట్టుపెట్టి
పరాభవింప జూస్తారేమోనని
ఇంకా యింకా చెప్పాలంటే
ఖరీదు కట్టి అమ్మేస్తారేమోనని-
భయ విహ్వలయై
ఆంధ్రరాష్ట్ర సరిహద్దులు దాటి
అన్నపూర్ణ నేడు వెళ్ళిపోనుంది.

శ్రీ సి. ఓబళేసు

# నిత్యజీవితంలో అలంకారాల వాడుక

భాష, అలంకారం లేకుండా ఉండనే ఉండదు. భాష అలంకారమయంగా ఉంటుందని స్థూలదృష్టికే కన్పిస్తుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే తప్ప ఇన్ని అలంకారాలు భాషలో ఉన్నాయా అని మనం అనుకోము. జయదేవుడు చెప్పిన అలంకారాలన్నీ, వ్యవహారిక భాషలో లేకపోయినా 60 శాతం పైగా ఉన్నాయి. కొన్ని కావ్యానికే పరిమితంగా ఉన్నా దాదాపు వ్యవహార భాషలో చాలా ఉన్నాయి. మరికొన్నిటిలో జయదేవుడు చెప్పిన అలంకార లక్షణాల ఛాయలు కన్పిస్తాయి.

కవులు వాళ్ళ భాషాశైలి అందంగా ఉండడం కోసం అలంకారాలు వాడతారు. ఈనాడు కొంతమంది అలంకారాలు కృత్రిమంగా ఉంటాయి నిరలంకారంగా చెప్పడమే సామాన్య ప్రజానీకానికి బావుంటుందని అపోహ పడుతున్నారు. కాని, మనం నిత్యజీవితంలో వాడుతున్న అలంకారాల్ని చూస్తే అలంకారాలు భాషకు సహజమే కాని కృత్రిమం కాదని తెలుస్తుంది. జానపదులు గాని, నాగరికులు గాని అంతో యింతో, ఎంతో కొంత అలంకారాలను చేర్చి భాషలో వ్యవహరించడం తెలుగుభాషలో సహజంగా వక్త-శ్రోతలకు తెలియకుండానే జరుగుతుంటుంది. ఈ అలంకారాల వాడే ప్రజానీకానికి అంటే వక్తకు అలంకారం పేరు తెలియకపోవచ్చు కాని అలంకారంగా మాట్లాడ్డం తెలుసు. అలంకారాల వాడుక ఒక్కోసారి తెలిసీ (కాన్షస్) జరుగుతుంది, ఒక్కోసారి తెలియకా (అన్ కాన్షస్) జరుగుతుంది. అలంకారమన్నది భాష అంతర్నిర్మాణంలో ఉంటుంది. సందర్భాన్నిబట్టి ఆయా అలంకారాలు వ్యక్తుల నుంచి అభివ్యక్తం అవుతుంటాయి. క్షేత్ర పర్యటనలో (ఫీల్డ్ వర్క్) ఒక వ్యవహర్త దగ్గరికి వెళ్ళి నీవు నిత్య జీవితంలో వాడుతున్న అలంకారాల్ని చెప్పు, నేను రాసుకుంటాను అంటే అతడు చెప్పడు - చెప్పజాలడు కూడా. ఎంచేత అంటే చెప్పాలని ప్రయత్నించినా సమయానికి జ్ఞాపకం రావు. సందర్భాన్నిబట్టి వస్తాయి. అలా వచ్చినపుడు సేకరించాలేగాని ఇలాంటి వాటికి మరో మార్గం లేదు. అందుచేత ఈ నిత్యజీవితంలో అలంకారాల వాడుక సేకరణ చాలా క్లిష్టమైనది. అందుకే హరికీరత్‌సింగ్ అన్నాడు - "అన్నిటికంటే వ్యావహారంలో ఉన్న వాడుక పదాలు సేకరించటం చాలా క్లిష్టమైన పని. ఏ భాషలోనైనా వాడుకలోని అన్ని పదాలు నిఘంటువులోకి ఎక్కుంటాయని నేను అనుకోవడంలేదు." (చూ. డా. ఎ. హాను మంతప్ప, తెలుగుమీద కన్నడ భాషాప్రభావం, పి.హెచ్.డి సిద్ధాంత గ్రంథం పుట. 179)

వ్యవహారంలోని అలంకారాలను అనంతపురం ప్రాంతంలో సేకరించి ఈ వ్యాసంలో పూర్చబడ్డాయి. వీటిలో కొన్ని ఆనుషంగికంగా ఆంధ్ర రాష్ట్రమంతా ఉండవచ్చు.

1) ఉల్లేఖం

ఎ) లక్షణం:— అనేక ధర్మాలతో కూడిన విషయాన్ని వేర్వేరువ్యక్తులు తమ కిష్టమైన ధర్మాన్నిబట్టి తద్ధర్మ విశిష్టమైన ఉపమానంతో పోల్చి చెప్పితే ఉల్లేఖాలంకారమౌతుంది.

లక్ష్యం:— వాడు మంచోళ్ళకు మంచోడు, చెడ్డోళ్ళకు చెడ్డోడు, పిచ్చోళ్ళకు పిచ్చోడు.

సమన్వయం:— వాడెట్లా వాళ్ళ కట్లా వాడని అర్థం. ఇక్కడ వ్యక్తి ఒక్కడే. కాని అనేకమందిచేత అనేక రకాలుగా పోల్చబడుతున్నాడు. ఎట్లాంటి గుణం కలవానికి అట్లాంటి గుణం కలవానిగానే కన్పిస్తున్నాడు.

బి) లక్షణం — ఒక్కడే వేర్వేరు గుణాలనుబట్టి, ఒక్కనిని వేర్వేరు వ్యక్తులతో అభిన్నునిగా వర్ణించితే కూడా ఉల్లేఖాలంకారమౌతుంది.

లక్ష్యం:— భీమలింగేశ్ చదివేటప్పుడు చదువుతాడు, పని చేసేటప్పుడు పనీ చేస్తాడు, సినెమాలూ ఎక్కువే చూస్తాడు, ఆటలు కూడా అట్లే ఆడతాడు. (ఇది నింబగల్లులో సేకరించినది)

సమన్వయం:— ఒకే వ్యక్తి అన్నిట్లోనూ నిపుణుడైనా డని అర్థం. చదువులో ఫస్టు, పని కూడా (సేద్యం పని) బాగా చేస్తాడని భావం. ఎంత బాగా చేస్తాడంటే స్థిరంగా అదే వృత్తిగా చేసేవాళ్ళకంటే కూడా బాగా చేస్తాడు. సినిమాలు కూడా తెగ చూస్తాడు. ఆటలు కూడా చాలా నేర్పుగా ఆడతాడు. మామూలుగా ఒక విషయంలో నిపుణుడు (ఎక్స్పర్ట్) కావడానికే ఎంతో కృషి చేయాలి. అంత కృషి చేసినా వాడు ఆ విషయంలో

మాత్రం నిపుణుడౌతాడు. అంతేకాని అన్నిట్లో నిపుణత్వమనేది ఒక్కరిలో ఉండడం సాధారణమైన విషయం కాదు. అలాంటిది అన్ని విషయాలలో ఆరితేరినవాడు అని చెప్పడానికి ఒక వ్యక్తి లోనే అన్ని విషయాలు ఉన్నాయి అని చెప్పడంవల్ల ఇది ఉల్లేఖాలంకారమయింది.

కాకపోతే కావ్యాల్లో ఉన్నట్లుగా సూటిగా ఉల్లేఖా లక్షణాలకు సరిపడ అతికినట్లుగా అతకక పోవచ్చుగాని చాలామటుకు దాని ఛాయలు మాత్రం వాడుకభాషలో కన్పిస్తుంటాయి.

## 2) స్మృతి

లక్షణం :— ఉపమాన ఉపమేయాలలో ఒకదానిని దర్శించడంచేత (ప్రసిద్ధ) సాదృశ్యాన్నిబట్టి రెండవది స్మరణకు తెచ్చుకున్నట్లు చెబితే స్మృత్యలంకారము.

లక్ష్యం:— నిన్ను చూసి నాకు నా కొడుకు గుర్తొచ్చినాడు.

సమన్వయం:— వాని వయసే వీనికీ ఉంది. వాని ఎత్తు, లావు వీడూ ఉన్నాడు. వాని పోలికలే వీనికున్నాయి. ఈ సాదృశ్యాన్నిబట్టి కొడుకు తన స్మృతిలోకి వచ్చాడు. కనుక ఇది స్మృత్యలంకారం.

## 3) సందేహం

లక్షణం :— నిశ్చయ జ్ఞానం లేకపోవటం సందేహం. సందేహంవల్ల ఏర్పడే అలంకారం సందేహాలంకారం.

లక్ష్యం:— చూసేకేమో మంచోడిమాదిరే కన్పిస్తున్నాడు. వాడు మంచోడో చెడ్డోడో ఎవరికి తెలుసు. మంచివాడో చెడ్డవాడో అన్న నిశ్చయజ్ఞానం కలుగలేదు. కనుక ఇది సందేహాలంకారం.

## 4) అపహ్నుతి

అపహ్నవము అంటే మరుగు పుచ్చడం. ఈ లక్షణాన్ని ఆధారం చేసుకొని ఏర్పడే అలంకారమే అపహ్నుతి. ఈ అలంకారాల్లో చాలా భేదాలున్నాయి. అవన్నీ ఇక్కడ అప్రస్తుతం. వ్యవహారంలో లభించే ఉదాహరణకు సంబంధించిన లక్షణం మాత్రమే ఇక్కడ చెప్పడమైనది.

లక్షణం:— ఇతర వస్తువేమోనన్న సందేహం కలిగినప్పుడు ఆ కలిగిన సందేహాన్ని పోగొట్టి నిశ్చయజ్ఞానాన్ని కలిగిస్తే భ్రాంతి అపహ్నుతి అన్న అలంకారమౌతుంది.

లక్ష్యం:— వానికి కండ్లు కనపడక కాదు, పొగరే తన్నుకుంటూ పోయేటట్లు చేసింది.

సమన్వయం:— పెద్దవాళ్ళు మాట్లాడుకుంటుండగా ఒక పన్నెండేళ్ళ అబ్బాయి దారిలోని సామాన్లు కాలితో తన్నుకుంటూ పోయినపుడు ఈడుండేది కూడా కనపళ్ళేదా వీనికి - అని ఒకరు అన్నపుడు, ఇంకొకరు - వానికి కండ్లు కనపడక కాదు వానికుండే పొగరే వాడినట్లా తన్నుకుంటూ పోయేటట్లు చేసిందని అనటం మనం చూస్తుంటాం. మొదటివ్యక్తి సామాన్లు చూడలేదేమో అన్న సందేహం వ్యక్తం చేస్తే, రెండవ వ్యక్తి - కాదు చూశాడు, కాని పొగరుబోతు కాబట్టి అలా చేశాడు అని నిశ్చయించి చెప్పటంవల్ల అది భ్రాంత్యపహ్నుతి అలంకారము.

## 5) హేతూత్ప్రేక్ష

లక్షణం:— హేతువు కానిదాన్ని హేతువుగా ఊహిస్తే హేతూత్ప్రేక్ష అవుతుంది.

ఎ) లక్ష్యం:— నేను డిపార్టుమెంటులో అందరికీ క్షమాపణ చెప్పేదానికోసమే ఉండాను.

సమన్వయం:— ఇతన్ని ప్రభుత్వం, డిపార్టుమెంటులో పని నెరవేరడం కోసం నియమించింది. క్షమాపణ చెప్పేదానికే జీతం ఇవ్వడంలేదు కదా! కాని అప్పటికే ఒకరిద్దరికి క్షమాపణ చెప్పడంవల్ల మరోసారి మూడోవ్యక్తి కూడా ఈ వ్యక్తిని పదే పదే తప్పు పడుతున్న సందర్భంలో పై వాక్యం అతని నోటి నుంచి వచ్చింది. క్షమాపణ చెప్పడమన్నది హేతువు కాదు ఇక్కడ హేతువు కానిదానిని హేతువుగా చెప్పుతున్నాడు. అందుచేత హేతూత్ప్రేక్ష అయి కూర్చుంది.

కోపం కలిగినప్పుడు కూడా వ్యవహర్త తనకు తెలియకుండా ఎంత అలంకారప్రాయంగా ఉపయోగించాడు! ఆ అలంకారం ఉపయోగించినందువల్ల తాను మాట్లాడుతున్నదానికి బరువు వచ్చింది. అందువల్లే అలంకారాలు నిత్య వ్యవహారంలో ఉంటాయనడానికి ఇది ప్రబలమైన నిదర్శనం.

బి) లక్ష్యం — మా యమ్మ నన్ను నీకోసమే కనిపెట్టి నీకిచ్చింది.

సందర్భం:— ఒక పెళ్ళాం కట్నం విషయంలో భర్త వేధింపులు పడలేక దెప్పిపొడుస్తూ చెప్పే మాట ఇది.

## 6) అతిశయోక్తి

దీనిలో 8 రకాలు ఉన్నాయి. లోక వ్యవహారంలో లభించే ఉదాహరణలకు సంబంధించిన అలంకార భేదాల్ని మాత్రం ఇక్కడ చూపడం జరుగుతుంది.

ఎ) భేదకాతిశయోక్తి

లక్షణం:— లోక సామాన్య విషయానికి అన్యత్వకల్పనం చేసి చెప్తే భేదకాతిశయోక్తి ఏర్పడుతుంది.

లక్ష్యం:— కృష్ణా ధైర్యమే ధైర్యం; ఆతని త్యాగమే వేరు.

సమన్వయం:— లోకంలో ఎందరో ధైర్యవంతు లుండొచ్చు. కాని ఆ ధైర్యం ఈ ధైర్యం ఒకటి కాదు. లోకం లోని మిగతావారికంటే ఇతని ధైర్యానికి విశిష్టత ఉంది. ఎవరూ పెట్టలేనంత డబ్బు వీలైతే లోన్సు తీసుకొని పెట్టుబడి పెట్టి సినిమాస్కోప్‌ను మొట్టమొదటిసారిగా తెలుగు సినెమారంగంలోకి తెచ్చాడు-సినీనటుడు కృష్ణ. (ఇది సినెమా టికెట్ల బుకింగువద్ద ప్రేక్షకులు మాట్లాడుతున్న సందర్భంలో సేకరించింది.)

బి) చపలాతిశయోక్తి

లక్షణం:— ఒక కారణంవల్ల కార్యం వెంటనే జరిగినట్లు చెబితే అది చపలాతిశయోక్తి అవుతుంది.

లక్ష్యం:— ఏమమ్మా! నీ మొగుడు నిన్నపోయేకి లేదు అప్పుడే మొగమంతా వాసిపోయింది.

సమన్వయం:— భర్త ఊరికి పోవడం కారణం. ముఖము వాయడం కార్యము. భర్త నిన్ననే ఊరికి వెళ్ళాడు. మరుసటి రోజే ఒక పెద్దాయనకు ఆమె దిగులుగా ఉన్నట్లు కన్పించింది. అప్పుడు ఈ పెద్దాయన తమాషాగా అలంకారప్రాయంగా పై మాట అన్నాడు. చాలారోజులు జరిగితే, నా భర్త యింకా రాలేదే అని ఆమె దిగులు పెట్టుకొని మొగం వాచింది అనుకో వచ్చు. కాని కారణం జరిగిన మరుసటిరోజే మొగం వాచినట్టు చెప్తున్నాడు. కాబట్టి ఇది చపలాతిశయోక్తి అయింది.

సి) అత్యంతాతిశయోక్తి

లక్షణం:— కారణ కార్యముల వరుసలో క్రమము మారి నట్లు చెబితే అత్యంతాతిశయోక్తి అవుతుంది.

లక్ష్యం:— 1) అత్త చచ్చిన ఆర్నెల్లకు కోడలు ఏడ్చిందట.

2) దొంగలు పోయినంక కుక్కలు మొరిగినాయంట.

సమన్వయము:— సాధారణంగా దొంగలు పడ్డపుడు కుక్కలు మొరిగితే దొంగలు పారిపోవాలి. అట్లు కాకుండ దొంగలు పోయిన తర్వాత కుక్కలు మొరిగినాయి, అనడంలో క్రమం పోయింది. అందుకే ఇక్కడ కారణ కార్యముల క్రమం మారిందని చెప్పడంద్వారా అత్యంతాతిశయోక్తి అయింది.

7) దీపకం

లక్షణం:— ప్రస్తుత వస్తువుకు, అప్రస్తుత వస్తువుకు ఒక్కమారే ఒక్క పదంచేతనే చెబితే దీపకమౌతుంది.

లక్ష్యం:— ఎద్దు దున్ని చావాలి, మనిషి పనిచేసి చావాలి.

సమన్వయం:— ఎద్దు కర్తవ్యం దున్నడం. మనిషి కర్తవ్యం పని చేయడం. రెండిటికీ 'చావాలి' అన్న పదంచేత సామ్యం సాధింపబడింది. కాబట్టి ఇది దీపకాలంకారము.

8) దృష్టాంతం

లక్షణం:— రెండు వాక్యాలకు బింబ ప్రతిబింబత్వం ఉంటుంది.

లక్ష్యం:— 1) వాడు తినేదాంట్లో మొనగాడు, వీడు పని చేసేదాంట్లో మొనగాడు.

2) నీ ఇద్దరు కొడుకుల్లో ఒకడు చదువులో దిట్ట ఒకడు సేద్యంలో దిట్ట – నువ్వే అదృష్టవంతుడవయా!

సమన్వయం:— కార్యాల్లో పోలిక లేదు. కాని వాక్యాల్లో పోలిక ఉంది. ఇద్దరూ దిట్టలే - కాని వేర్వేరు పనులలో దిట్టలు. ఒకడు చదువులో నైపుణ్యం సంపాదించాడు. ఇంకొకడు సేద్యం (వ్యవసాయం) చేయటంలో నైపుణ్యం సంపాదించాడు. మొత్తం మీద ఇద్దరిలోనూ నిపుణత్వమున్నది. కాబట్టి బింబ ప్రతిబింబత్వ ముందన్న మాట. అందుకే ఇది దృష్టాంత అలంకారము.

9) వ్యతిరేకం

లక్షణం:— ఉపమేయ ఉపమానాలకు పోలికతోపాటు భేదం కూడా చెప్తే వ్యతిరేకాలంకారం ఏర్పడుతుంది.

లక్ష్యం:— వాడెంత మంచివాడో అంత చెడ్డవాడు కూడా. ఊరుకున్నంతసేపు ఊరుకుంటాడు వానికి కోపమొస్తే ఇంక పిచ్చి కోపమే.

సమన్వయం:— సాధారణంగా మంచివానికి తొందరగా కోపం రాదు. అలాంటివానికి కోపంవస్తే వానిముందు ఎవ్వరూ ఆగరు. ఇక్కడ మంచి ఉంది. మంచివానిలో చెడ్డ కూడా ఉంది అని చెప్పటంలో రెండింటికీ భేదం కూడా చెప్పినట్లయింది. కాబట్టి ఇది వ్యతిరేకాలంకారం అనవచ్చు.

ఈ విధంగా వ్యవహారంలో, కావ్యంలో వర్ణించే వాటి కన్నా చాలా సహజంగా ఉంటాయి అలంకారాలు.

## 10) ఎ) వినోక్తి

లక్షణం:— ఒకానొక గుణం లేకపోవడంవల్ల వర్ణించాల్సిన వస్తువుకు హైన్యము చెప్పినట్లయితే వినోక్తి అలంకారము.

లక్ష్యం:— 1) వాడెంత చదువుకుంటే మాత్రమేమి చేస్తావ్ నోరు శుద్ధం లేనోడు.

2) వాడెంత చదువుకుంటే మాత్రమేమి చేస్తావ్ కడుక్కు తాగళావా (వినయం లేనోడని భావము.)

సమన్వయం:— విద్యవల్ల వినయం, ఉన్నత స్వభావం అలవడుతుంది. అట్లా కాకుండ ఉన్నత స్వభావము ఉండకపోగా వాని బుద్ధి బురదలో పొర్లాడినట్లుంటే ఆ సందర్భంలో పై మాట మనకు వినిపిస్తుంది. 1) నోరు శుద్ధం లేదు 2) వినయం లేదు. ఇవి లేకపోవడంవల్ల వర్ణించాల్సిన వస్తువు (చదువుకున్న ఆ వ్యక్తికి) కు హైన్యం కలుగుతోంది. కాబట్టి ఇది వినోక్తి అలంకారమే.

## బి) రమ్యస్వరూప వినోక్తి

లక్షణం:— ఒకానొక గుణం గాని, ఒక వస్తువు గాని లేకపోవడం (గైరుహాజరు కావడం) వల్ల చెప్పే విషయానికి రమ్యత్వం వస్తే అది రమ్యస్వరూప వినోక్తి అలంకారము.

లక్ష్యం :— అబ్బా! ఆయమ్మ లేనివానికి ఇల్లంతా ప్రశాంతంగా ఉంది.

సమన్వయము:— అంటే ఇక్కడ ఫలానా ఆమె లేనందు వల్ల ఇంట్లో జగడాలు లేవు. ఆమె ఏ వూరికో యాత్రకో వెళ్లుకొన్నాళ్ళు ఇంట్లో లేదు. అప్పుడు ఆ ఇంట్లోవాళ్ళు అనుకున్న సందర్భమిది. ఆ గయ్యాళి ఉన్నప్పుడు ఎప్పుడూ చిరుకొట్లాటలు ఒకరికొకరు కోపతాపాలు తెచ్చుకోవడాలు, దానివల్ల మనసులు కలత చెందడం - ఇలాంటివి ఉండేవి. ఇప్పుడు ఆమె లేనందువల్ల పై అనర్థాలు లేవు కాబట్టి ప్రశాంతంగా ఉంది. దానివల్ల రమ్యత్వం వచ్చింది. ఎందుకు వచ్చింది - ఒక వస్తువు (ఆమె) లేకపోవడంవల్లనే కదా! కాబట్టి ఇది రమ్యస్వరూప వినోక్తి అన్న అలంకారము. అందుకే ఒక్కోసారి వస్తువుగాని గుణం కాని లోపించడం కూడా మంచికే అవుతుంది.

ఇటువంటివే లోకంలో చాలా కనిపిస్తుంటాయి. కోస్తా ప్రాంతంలో ఈ క్రింది జాతీయం వినిపిస్తుంది. ఒక అల్లరి వెధవ గాని లేదా చీటికి మాటికి కోప్పడేవారు అక్కడనుండి ఎక్కడికో పోయినపుడు అక్కడున్నవారు ఈ విధంగా అంటుంటారు "అమ్మయ్య! వాన వెలిసిందయ్యా!"

## 11) వ్యాజనింద

లక్షణం:— నిందచేత వేరొక నింద వెల్లడి అయితే అది వ్యాజనింద అన్న అలంకారం అవుతుంది.

లక్ష్యం:— 1) ఎవడ్రా నీకు డిగ్రీ ఇచ్చింది? నిన్నేమీ అనకూడదు గాని నీకు డిగ్రీ యిచ్చినోణ్ణి తిట్టాల.

సమన్వయము:— నిన్ను తిట్టి ఏం లాభం? నీవు చేసిన తప్పుకు నీకు డిగ్రీ యిచ్చినవాణ్ని తిట్టాలని భావం. అసలు విద్యలో ఏదో దోషం జరిగింది. ప్రస్తుత వ్యక్తిని నిందించడం సందర్భం. డిగ్రీ ఇచ్చినవాడిని అంటే యూనివర్శిటీని నిందించడం ఇక్కడ జరిగింది. ఒక నిందకు బదులు వేరొక నింద జరిగింది." నిందవల్ల అన్యనింద వెల్లడైంది కనుక ఇది వ్యాజనింద అయి కూర్చుంది.

ఇలాంటి వాక్యమే లోక వ్యవహారంలో మనకు ఇంకొకటి వినిపిస్తుంటుంది.

2) ఎవడ్రా నీకు చదువు చెప్పింది. (చెప్పినవాడు బుద్ధి లేనివాడని భావం)

3) నిన్ను కాదు అనవలసింది నీ ముఖంమీద నీళ్ళు చల్లినదాన్ని కొట్టాల.

సందర్భం:— కాన్పు సమయంలో ప్రసవం జరిగిన తర్వాత బిడ్డ మొహంమీద నీళ్ళు చల్లుతారు. ఇది ఆచారమూ కావచ్చు - బిడ్డ మొహంపై ఉన్న పదార్థాన్ని తొలగించడానికీ కావచ్చు. ఏది ఏమైనా నీళ్ళు చల్లడం (అనంతపురం ప్రాంతంలో) ఉంది. ఆ చల్లేవాళ్ళ బుద్ధే బిడ్డకు వస్తుందని ఒక నమ్మకముంది. ఈ నమ్మకంతోనే ఈ నుడికారం పుట్టింది. బిడ్డ పుట్టి పెద్దయింతర్వాత ఏదైనా తప్పు చేస్తే, కుంచిత స్వభావం గల బుద్ధి ఉంటేకాని అటువంటివారిని చూసి ఈ నుడికారాన్ని అంటుంటారు. అందుకే బిడ్డ పుట్టినపుడు బిడ్డ మొగంమీద నీళ్ళు చల్లడానికి కొంతమంది భయపడతారు. (ఇది మిగతా ప్రాంతాల్లో ఉందో లేదో తెలియదు. ఉంటే వారు దీనితో సరిపోల్చుకోవచ్చు)

## 12) అర్థాంతరన్యాసం

లక్షణం:— విశేషాన్ని చెప్పి దాన్ని సమర్థించడానికి సామాన్య వాక్యాన్ని చెప్పినట్లయితే అర్థాంతరన్యాసాలంకారమౌతుంది.

లక్ష్యం:— వాడు ఇల్లు భలే కట్టిచ్చినాడు. నేనెక్కడా చూల్లేదు. షావుకార్ల కేమప్పా ఎట్లయినా కడతారు. కొప్పుండే ఆయమ్మ ఎట్లయినా తిప్పుతుంది.

సమన్వయం:— ఇల్లు భలే కట్టించినాడు అన్నది విశేష వాక్యం. వాళ్ళకేంలే షావుకార్లు అనడంలో విశేష వాక్యం సామాన్యమై పోయింది. కనుక విశేషాన్ని సమర్థించడానికి సామాన్య వాక్యం ఇక్కడ ఉంది. అందుకే ఇది అర్థాంతరన్యాసాలంకారమయింది.

కాబట్టి ఇలాంటి వాడుకలు కావ్యంలోనే కాదు మనకు నిత్య వ్యవహారంలో కూడా జాగ్రత్తగా పరిశీలిస్తే కనిపిస్తాయి.

ముగింపు :-

నాగరిక ప్రజల్లోకంటే జానపదుల్లో ఈ అలంకారాల వాడుక ఎక్కువగా కన్పిస్తుంది. ఇలాంటి అలంకారాలను పోల్చుకుంటూ ఆయా ప్రాంతాలవాళ్ళు వాటిని సేకరించి అక్కడుండే సందర్భాన్ని విపులీకరిస్తూ విశ్లేషిస్తే ఏ ప్రాంతంలో ఏ అలంకారపు వాడుక ఎలా ఉన్నదో అన్ని ప్రాంతాలవాళ్ళకు తెలియడానికి అవకాశం ఉంది. అంతేకాకుండ వ్యవహారంలోని అలంకారాలు, నుడికారాలు నష్టం (ల్యాంగ్వేజి లాస్) కాకుండ అన్నింటిని ఒకచోట భద్రపరచిన వారమవుతాము. మిగతా ప్రాంతాల్లో కూడా ఇలాంటి అలంకారాలు, నుడికారాల సేకరణ జరగాలని వ్యాసకర్త ఆశిస్తున్నాడు.

[ఈ వ్యాసంలో వ్యవహారంలోని కొన్ని అలంకారాలను సేకరించి ఇవ్వడమే కాకుండా వాటిని ఎలా విశ్లేషించాలో చెప్పి ఈ వ్యాసం తయారుకావటంలో సహాయపడిన డా॥ ఎ. హనుమంతప్పగారికి ప్రత్యేకమైన కృతజ్ఞతలు ఈ వ్యాసకర్త తెలియజేసుకుంటున్నాడు.]

---

# కలం కాగడా

## శ్రీపైల కృష్ణారావు

గుండె కొండ చరియల్లోంచి
ఆనందరస జలపాతాలై దూకాల్సిన భావ ప్రవాహాలు-
కనుల కొనసీమల్లోంచి
స్నేహ జాహ్నవులై ప్రవహించాల్సిన ఆలోచనా
స్రవంతులు-
తనువు మంజుకుంజములోంచి
శాంతి కుసుమాలై విరబూయాల్సిన కణజాలాలు-
దారిద్ర్యరేఖక్రింద ఆక్రందించే ఆకలి చావుకేకలలో,
రాజకీయ వలల్లో చిక్కుకున్న ఓటర్ల గావుకేకలలో,
ఆడపడుచుల్ని బలిగొంటున్న కట్నాల కిరోసిన్
మంటలలో,
కత్తి విశ్వరూప దర్శనంలో, కాలుష్య హాలాహల
దహనంలో
అవినీతి సర్ప ఫూత్కారాలలో, యువశక్తి అసంతృప్త
జ్వాలల్లో
పిచ్చిగాలి దావానలమై శ్వాసనాళాల్లోకి వ్యాపిస్తూ వుంటే,
త్రాగే నీరు బడబానలమై కళ్ళల్లో సుళ్ళు తిరుగుతూ
వుంటే,
కాలూనిన ప్రతిచోటూ కాలాగ్ని గోళమై రగులుతూ
వుంటే,
పరాజయ వజ్రఘాతానికి మేరు గంభీరుడైన మనిషి
ఆశల రెక్కలు తెగినపుడు,
ఐరావతంలాంటి ఆశయం లోకపు కుటిలనీతి
తృణావృతకూపపు అడుసులోకి దిగినపుడు
ఈ సామాజిక అశాంతి కొలిమిలో
రాపాడే నా అంతరంగంలోంచి రూపాంతరం పొంది
భావాలు ఆవిరి శకలాలై సమీకరిస్తున్నాయి
అణువణువూ నిప్పుకణాలై రాజుకుంటున్నాయి
ఆలోచనలు అగ్నినదులై ఉద్గమిస్తున్నాయి
కలం కాగడాయై జ్వలిస్తూ వుంది.

శ్రీ కోటి సూర్యనారాయణమూర్తి   ఆచార్య యస్వీ జోగారావు

# గ్రామ దేవతలు

"మదర్ గాడ్‌నెస్" అను ఆంగ్ల పదమునకు సమానార్థకముగా తెలుగునందు గ్రామదేవతలు అని పిలుచుచున్నారు. దేవత అనే పదము మతమునకు, సంఘమునకు సంబంధించినది. మతము ఆచారము, సంప్రదాయము సంఘమునకు, సంఘమునందలి మనుష్యులకు వర్తించేవి అని అర్థము. సంఘము అంటే ప్రజలయందలి ఐకమత్యమునకు ప్రతీక. దేవత సంఘమునకు సంబంధించినది అయితే ఆ సంఘమునందలి ఐకమత్యమును సాధించుటకు కనిపించని దేవతను ఆలంబనముగ చేసుకొని తమ తమ జాతి ఎడల అభివృద్ధిని సాధించే మానవ ప్రయత్నములో ఒక భాగమే గ్రామదేవత ఆవిర్భావము. దేవతల ఉత్సవములను ఆడంబరముగా చేసుకుంటూ తమలో ఐక్యమత్యమును సాధించుకొని, తద్వారా విదేశీయుల దండయాత్రలను త్రిప్పికొట్టిన సంఘటనలు చరిత్ర పుటలలో కోకొల్లలు.

అతి ప్రాచీనకాలమునుండి గ్రామదేవతలు మనకున్నట్లుగా పురాణములు చెప్పుచున్నవి. పురాణములయందు కవులు దేవతను శక్తిస్వరూపిణిగా భయంకరముగా వర్ణించియున్నారు. గ్రామదేవత శక్తిస్వరూపమును గురించి ఆమెయొక్క విగ్రహమును వర్ణించు ఘట్టములు మార్కండేయ పురాణమునందు గాననగును.

"విచిత్ర ఖట్వాంగధరా నరమాలా విభూషణా
ద్వీపిచర్మ పరీధానా శుష్క మాంసాతిభైరవా
అతివిస్తారవదనా జిహ్వాలలన భీషణా
నిమగ్న రక్తనయనా నాదా పూరితాదిఙ్ముఖా"

[మార్కండేయ పురాణము, 7వ అధ్యాయం, శ్లోకము 7, 8]

ఆ వర్ణన మన కలకత్తా కాళీమాతకు బాగుగా సరిపోవుచున్నది. అట్లే గ్రామదేవతలకు గూడా ఆ వర్ణన పట్టుచున్నది. గ్రామదేవత జనపదమున మిక్కిలి శక్తివంతమై, అందరి హృదయములందును భక్తిభావముతో నిండియున్నది. అదియునుగాక జానపదులు దేవతను భక్తి అనేకంటే భయము వలన మాత్రమే ఆమెను ఆరాధించుచున్నారు. జానపదులు ఆ దేవత తన్ను, తన గ్రామమును రక్షించుచున్నదని తమందరు ఆమె రక్షణలోనున్నట్లు భావించుచు, ఆమెయే గ్రామరక్షణ దైవమని ఆరాధించుచున్నారు.

గ్రామదేవత ఆవిర్భావము సరిగ్గా ఎపుడు జరిగినది మనము చెప్పలేముగాని జానపదులు తమ భుక్తికోసము కాయకష్టము చేసుకొనే వయస్సులో అంతర్గతముగా తమ్ము రక్షించుచున్నారని భావించి తాము పండించిన ఫల తృణ ధాన్యములను ఒకచోటగ పోసి నమస్కరించిన నాటినుండి గ్రామదేవత ఆవిర్భావము చెందినదని తెలియుచున్నది. గ్రామదేవత ఆదికాలమున కేవలము ఒక వృక్షము, గట్టునయున్న రాయి లేదా మృగము. కాలక్రమేణా మానవుడు నాగరికత నేర్చిననాటినుండి పురాణములయందు శక్తిస్వరూపిణిగ వర్ణించిన నాటినుండి ఆ భావన ఆధారముగా కవుల కల్పన ఫలితముగ నిర్దిష్టమగు విగ్రహముగ ఆవిర్భవించి, ఆరాధనా విధానము ఏర్పడినది. హిందూ దైవములైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు భిన్నమైన ఆరాధనా విధానము ఈ దేవతలకు ఏర్పడినది.

ఆదికాలమున కుటుంబమునకు ప్రధాన అధికారిణి స్త్రీ. ఆర్యుల నాగరికతనాటి విషయము మనకు తెలుసు. కుటుంబమునకు కావలసిన సేద్యము, కుటుంబ రక్షణ, బాధ్యత స్త్రీదయితే పురుషులు యుద్ధకార్యములయందు నిమగ్నులై యుండేవారు. అందువలననే గ్రామ దేవతలుగా స్త్రీలే తప్ప పురుషులు ఉండుట లేదు. పురుష దేవాలయములుగ కొన్నిచోట్ల పోతురాజు, అడవి రాజు ఆలయములున్నను, అవి జన వ్యవహారమున చెప్పబడుతున్న 101 దేవతలకు సోదరుడుగా, లేదా సంరక్షకుడిగా ఉంటూ, తామూ వారితోబాటు పూజలందుకొనుచున్నారు. ఆర్యుల నాగరికత కాలమునుండి స్త్రీ దేవతగా పూజింపబడుచూ గ్రామదేవతలుగా ఆవిర్భవించిరి.

జానపదులు పౌరాణిక దేవతలకంటే స్త్రీ దేవతలైన గ్రామ దేవతలకు అధిక ప్రాముఖ్యత నొసంగి ఆ ఉత్సవములను జరుపుదురు. తత్సంబంధమైన దేవతల ప్రాచీన గాధలను జనులు పరంపరగా చెప్పుకొందురు. ప్రపంచ పర్యాప్తముగా స్త్రీ దేవతలను సస్యదేవతలుగా పరిగణించుచున్నారు. మెక్సికో, గ్రీకు, రోమను, ఆసియా, ఈజిప్టు దేశములయందు స్త్రీమూర్తియే దేవత.

గ్రామ దేవతలను గురించి అనేకమంది పాశ్చాత్యులు, మన దేశీయులుగాని అనేక విధములుగ నిర్వచనములు ఇచ్చియున్నారు. హెన్రీ వైట్‌హెడ్ గ్రామ దేవతను గురించి తెలియజెప్పుచు "ప్రాబబ్లీ దీస్ విలేజ్ డైటీస్ కేమ్ ఇన్‌టు బీయింగ్ అట్ ది పీరియడ్ వెన్ ది పీపుల్ బిగాన్ టు సెటిల్ డవున్ అగ్రికల్చరల్ కమ్యూనిటీస్". డా॥ పుష్పేంద్రకుమార్ సెడ్ "ది టెర్మ్ శక్తి రిప్రసెంట్స్ ఫిమేల్ డివినిటి ఇన్ జనరల్ అండ్ స్టాండ్స్ ఫర్ ది ఎనెర్జింగ్ పవర్ ఆఫ్ సమ్ డివినిటి ఇన్ పర్టికులర్." ఇక నాయని కృష్ణకుమారిగారు "మనుష్యులను పీడించు ప్రేతాత్మలనుండి రక్షణకై ఆ మనుష్యుడే భగవద్రూపము కల్పించుకొని తనకు సంరక్షకుడిగా నిలబెట్టుకొనెను. ఆ సంరక్షకురాలే గ్రామదేవత" అని చెప్పారు. అది అంత హేతుబద్ధముగా లేదు. అందువల్లన అందరి గ్రామ దేవతలకు, అన్ని ప్రాంతములవారికి వర్తించునట్లుగా "చరాచర సృష్టి జగత్తునకు మూలకారకుడగు పరమేశ్వరుని సృష్టించిన శక్తే గ్రామదేవతగా ఆవిర్భవించినదని చక్కటి నిర్వచనముగా చెప్పుకోవచ్చును.

భగవదనుగ్రహము కొరకు, కోరికలు తీరుటకు, ఉత్సవ సమయములయందును జానపద సాహిత్యమున గ్రామ దేవతలను గురించి వెలువడిన, వెలువడుచున్న కథలు కోకొల్లలు. మన సాహిత్యమున శ్రీనాథుడు రచించిన హరవిలాసమున, క్రీడాభిరామమున గ్రామ దేవతల కథలు ఆచార వ్యవహారములు మనకు తెలియుచున్నవి. అట్లా ఏర్పడిన గ్రామ దేవతలు నేడు ప్రతీ గ్రామమున పల్లె పల్లెయందును గ్రామ దేవతల ఆలయములు ఏర్పడడమేగాదు, వాటికి ఉత్సవములు, ఆ ఉత్సవముల సందర్భమున ఆలయములయందు వ్యవహరించు ఆచార వ్యవహారములు, సంప్రదాయములు మనము తెలుసుకొందము.

ప్రస్తుతము ఈ వ్యాసపరిధి తూర్పు గోదావరి జిల్లాకు పరిమితము చేసుకొనుట జరిగినది. సువిశాలమైన ఈ జిల్లాయందు ఎంతోమంది గ్రామ దేవతలు గలరు. అనేకమైనటువంటి, విభిన్నమైనటువంటి ఆచార వ్యవహారములు, నమ్మకములు, మూఢ విశ్వాసములును సూక్ష్మముగా వివరించెదము.

జనవ్యవహారమున గ్రామ దేవతలు 101 మంది. వీరికి రక్షకుడు పోతురాజు అందురు. ఈ గ్రామ దేవతలు ఆయా ప్రాంతములనుబట్టి అచ్చటి సంప్రదాయములనుబట్టి మనుష్యుల, భౌగోళిక నైసర్గిక స్వభావము ననుసరించి గ్రామ దేవతలుగ ఆవిర్భవించిరి. తూర్పు గోదావరి జిల్లానందున్నటువంటి గ్రామ దేవతల పేర్లను ఈ దిగువున ఉదహరించుచున్నాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మరిడమ్మ | పసుపులమ్మ | మాచలమ్మ | నీలమ్మ | మారెమ్మ | పైడితల్లి |
| నూకాలమ్మ | గంగాలమ్మ | రూపులమ్మ | కోర్లమ్మ | దుర్గమ్మ | నోమాలమ్మ |
| పల్లాలమ్మ | వేగులమ్మ | మావుళ్ళమ్మ | చింతాలమ్మ | జమ్మాలమ్మ | వేపాలమ్మ |
| దోపాలమ్మ | ములగాలమ్మ | బూరుగులమ్మ | మైశమ్మ | మశానమ్మ | ఓడలమ్మ |
| గజ్జాలమ్మ | కడియాలమ్మ | భూలోకశక్తి | బాపనమ్మ | గడిబాపనమ్మ | బంగారమ్మ |
| గొంపమ్మ | సుంకులమ్మ | కాగితమ్మ | అడివమ్మ | తోటలమ్మ | పెద్దింటమ్మ |
| బంగారుపాప | మొండిజగ్గప్ప | సత్యమ్మ | సిరిపల్లెమ్మ | లొల్లాలమ్మ | మహాలక్ష్మమ్మ |
| నేరేళ్లమ్మ | గండాలమ్మ | గంటెమ్మ | ఉండ్రాళ్లమ్మ | వాక్కులమ్మ | కాసులమ్మ |
| గుబ్బాలమ్మ | సీతమ్మ | చిన్నెలమ్మ | తాళ్లమ్మ | మాలకొండమ్మ | శింగరమ్మ |
| కొత్తమ్మ | తల్లెమ్మ | పోలేరమ్మ | వసంతాలమ్మ | పాదాలమ్మ | బులుసులమ్మ |
| రావులమ్మ | పట్టిగడ్డాలమ్మ | పరదేశమ్మ | ఎనుములమ్మ | దొక్కాలమ్మ | మాలమ్మ |
| కోటమ్మ | పోచమ్మ | అంకమ్మ | కామమ్మ | మసులమ్మ | మహంకాళి |
| చిన్నింటమ్మ | ఎల్లమ్మ | ఘంటాలమ్మ | పెద్దమ్మ | చౌడమ్మ | కల్లులమ్మ |
| తలుపులమ్మ | నక్కళ్లమ్మ | చెలుపులమ్మ | ఆటలమ్మ | కట్టమ్మ | అసిరితల్లెమ్మ |

వీళ్లేగాక ఇంకను ఎంతోమంది గ్రామ దేవతలున్నట్లుగ తెలియుచున్నది. స్థూలముగ గ్రామ దేవతలను ఒక పర్యాయము పరిశీలిస్తే, అందులో కొన్ని వృక్ష వాచకములుగ, జంతు వాచకములుగ, ఆహారవాచకములుగ, వస్త్ర, ఆభరణ, నామపరముగ నున్నట్లు మనకు తెలియుచున్నది. కొన్ని ప్రాంతముల యందు గ్రామ దేవతలు గాకుండా వీరితో సమానముగ

పేరంట్రాండ్రు, కులదైవములు ఉండి ప్రజలచేత జానపదుల చేత పూజలందుకొంటున్నారు. కాలక్రమమున పేరంట్రాండ్రు కులదైవముల ఆలయములు కాలక్రమేణా అభివృద్ధి చెంది గ్రామ దేవతలుగా మారుచున్నవి. అందుకు నిదర్శనముగ అకాల మృత్యువు చెందిన భర్తతో గూడ సహగమనము చేసిన కామమ్మ [సామర్లకోట] పాపమ్మ [చందపేట] మొదట్లో వారివారి కుటుంబీకులు వారిచే పూజలందుకొనెడివారు. తరువాత వారే గ్రామ ప్రజలందరిచేత పూజలందుకుంటూ, గుళ్ళు, గోపురములు వెలసి దివిటీలు ఏటేటా ఉత్సవములు, తిరునాళ్లు జరుగుచున్నవి.

లక్షణములు :

భయంకర స్వరూపిణిగ అవతరించిన గ్రామ దేవతలకు కొన్ని నిర్దిష్టమైన లక్షణములను జానపద పరిశోధకులు సూచించినారు. గాని ఈ లక్షణములు అన్ని గ్రామ దేవతలకు వర్తించక పోవచ్చును. ఎందువలెనంటే ప్రాంతీయతా భేదమునుబట్టి దేవత ఆకారములో మార్పుయుండును. గాని చాలా దేవతల విషయములో ఈ లక్షణములు వర్తించును. కావున వీటిని గ్రామ దేవతల లక్షణముగ పరిగణించుచున్నారు.

1. గుళ్ళు గోపురములు వెలసియున్న గ్రామ దేవతల ఆలయములనందు నల్లవిరాతితో చెక్కబడిన విగ్రహముండును. [అదియే మూలవిరాట్టు అందురు] అదియునుగాక గర్భగుడి నిండునట్లుగా అమ్మవారిని భయంకరమైన శక్తిగా విగ్రహములను నిర్మించుదురు.

2. నాగరికత వాసనా సంపర్కము అంతగా పొందని గ్రామదేవత ఆలయమునందు దేవత కేవలము చిన్న రాయిగనో, కొమ్మ చెక్కగనో, బోర్లించిన కుండనో పెట్టి పసుపు, కుంకుమలతో ఆరాధించుచున్నారు.

3. గ్రామ దేవతల ఆలయములు ఊరి పొలిమేర్లయందును, చెరువుగట్లయందును, చెట్లక్రిందను, వ్యవసాయ భూములయందును నిర్మించెదరు. వాటికి ఆర్భాటముగ పెద్ద పెద్ద గుడులుండవు. కాని కాలక్రమేణా మానవుడు నాగరికత అభివృద్ధి చెందిన తరువాత పెద్ద పెద్ద ఆలయములు నిర్మించి ఊరు పెరిగినందువల్లన ఊరి మధ్యన ఉండుట జరుగుచున్నది. పెద్దాపురం మరిడమ్మ, కాంద్రకోట నూకాలమ్మ వీరి ఆలయములు పెద్ద గోపురములతో ఊరి మధ్యన నున్నవి.

4. గ్రామ దేవతల ఆలయములనందు వైధవ్యమును పొందిన నడివయసు స్త్రీలనుగాని, బ్రాహ్మణేతరులను గాని పూజారులుగ నుంచుదురు. బ్రాహ్మణులు పూజారులుగా నుండరు. ఎందువలెనంటే ప్రతీ అమ్మవారి ఆలయములందును బలి యిచ్చే సంప్రదాయము నున్నందువలన పూజారిణులు గూడ బ్రాహ్మణేతరులుందురు.

5. నైవేద్యములో భాగముగ బలిని యిచ్చే సంప్రదాయము తప్పకుండా యుంటుంది. ఇంతకుపూర్వము ఎనుబోతును బలిని యిచ్చేవారు. అంతేగాక భక్తులు తమ తమ కోర్కెలను నెరవేరుటకు మ్రొక్కులు మ్రొక్కుకొని పక్షులను, జంతువులను బలులుగ సమర్పించెదరు.

6. భయంకరమైన స్వరూపము గలిగియుండును. చేతియందు శూలము, లేదా ఖడ్గము, గదను ధరించి, దంతములను కోరలను బయటకు కనిపించునట్లుగ తన నాలుకను చూపించి పెద్ద పెద్ద కన్నులతో చూచుటతోనే భయమును పొందేటట్లుగా రూపమును కలిగియుండును.

7. బలిని గ్రహించుట, రక్తపానము, గ్రామములయందు అంటువ్యాధులు వ్యాపించునపుడు మ్రొక్కులు తీర్చుకొనేటపుడు, ఉత్సవ సమయములయందును దున్నపోతులను, గొఱ్ఱెలను, మేకలను, పక్షులను బలిగా దేవతలకు సమర్పించెదరు.

8. కొన్నిచోట్ల వృక్షములకు పసుపు, కుంకుమలను అద్ది, నాగ ప్రతిమలను రంగులతో అలంకరించియున్న కుండలను, త్రికోణముగ రాయినో, రప్పనో, పాతిపెట్టిన పొడవాటి కర్రను గాని గ్రామ దేవతగ పరిగణించి పూజ చేయుదురు. కొన్ని ప్రాంతములయందు గుండ్రని రాగి చెంబునకు పసుపు కుంకుమలను అద్ది వాటిచుట్టూ గవ్వలను అమర్చి పూజింతురు.

ఈ లక్షణములన్నియును అన్ని దేవతలకు వర్తించక పోవచ్చును. ప్రధాన లక్షణములు అన్నింటికి వర్తించును. గావున వీటిని గ్రామ దేవతల లక్షణములుగా అంగీకరించక తప్పదు.

పోతురాజు :

గ్రామ దేవతల రక్షకుడిగా, సోదరుడుగా వివిధ కథలయందు చిత్రింపబడినవాడు పోతురాజు. గాని ఆతని గురించి ప్రత్యేకమైన కథలుగాని, స్థల పురాణములుగాని ప్రత్యేకముగా ఎక్కడను లేవు. గుడులు, సంబరములు, జాతరలును లేవు. గాని నెల్లూరు జిల్లాయందు, ఆదిలాబాదునందు, తూర్పు గోదావరి జిల్లా మారేడిమిల్లినందు పోతురాజు పండుగ జేయుచున్నట్లు మనకు తెలియుచున్నది.

పోతురాజుది కొయ్యతో చెయ్యబడిన విగ్రహముగాని, లేదా 2-3 అడుగుల రాతితో చేసిన విగ్రహముండును. ఈ విగ్రహము ప్రతీ గ్రామ దేవత ఆలయమందును ఉండును. విగ్రహమునందు ఒక చేతితో కత్తి, మరొక చేతితో నిమ్మకాయ ఉండును. చేతిలో ఉన్న కత్తినకు గాజులుండును. పాదముల వద్ద కోడిపుంజు బొమ్మలుండును. కొన్ని కొన్ని ఆలయముల నందు విగ్రహమునకు బదులుగ సన్నటి పొడవైన కర్రను పాతుదురు. అదియే పోతురాజు అందురు. అమ్మవార్ల ఉత్సవము నందు ముందు పోతురాజు విగ్రహమే ముందుగా బయలుదేరును.

పోతురాజు గురించి జానపద పురాణములయందు చిత్ర, విచిత్రమైన కథలున్నవి. పోలేరమ్మ, పోచమ్మ, ఎల్లమ్మ, మరిడమ్మ, నూకాలమ్మ, రేణుక, అంకమ్మ మొదలగు కథల యందు పోతురాజు వారికి సోదరుడుగ, సహాయకునిగ వ్యవహరింపబడుచున్నాడు. మఱియొక జానపద పురాణమునందు పార్వతీదేవినకు వరుసగా నూటొక్కమంది కుమార్తెలు జన్మించగ, చివరగ మగ సంతానము కొరకు ఆమె పరమేశ్వరుని ప్రార్థించెను. అంత అతడు ప్రసన్నుడై ఆమెకు మగ సంతానము ప్రసాదించెనని, అతడే పోతురాజు అని తెలియజేయు చున్నారు. మరొక్క కథయందు పాండవులు అరణ్యవాసము చేయుచున్నపుడు తమ కోటలను రక్షించుటకు ఒక మనిషి కావలసి వచ్చెను. అంత అతడు కొండ అంతటి అన్నపురాశిని, తాటిచెట్టంత పోతును కోరెను. పాండవులు అరణ్యవాసము పూర్తియైన తరువాత అన్నపురాశిని, తాటిచెట్టంత పోతును యిచ్చిరి. పోతును, రాశిని పొందినవాడు గావున పోతురాజుగ పిలచిరి.

నెల్లూరు నగరమున ధర్మరాజునకు, ద్రౌపదికిని గుళ్లు కలవు. ఆ గుడిని పంచములు ఆరాధించెదరు. ఆ గుడియందు పోతురాజు విగ్రహము కలదు. ఆ విగ్రహము ఒక చేతిలో కత్తిని ధరించి, మరొక చేతిలో ఖండించిన స్త్రీ శిరస్సు జుత్తును పట్టుకొని వ్రేలాడదీస్తూ యుండును. దీనికి ప్రత్యేకమైన గాథ కలదు. అవన్నియును మనకు అప్రస్తుతము. మొత్తముమీద గ్రామ దేవతలతోబాటు అతడు గూడ ఉంటూ వారితో సమానముగా పూజలందుకొనుచున్నాడు పోతురాజు.

వివిధ గ్రామములయందు వివిధ విధములైన గ్రామ దేవతల ఆలయములున్నవి. ఆ గ్రామ దేవతల విగ్రహములు గూడ ఒకేవిధముగా చిత్రించియుండవు. భిన్న భిన్న ధర్మములను అనుసరించియుండును. కొన్ని ఆలయములను బ్రాహ్మణేతరులు పూజిస్తే మరికొన్ని ఆలయములను బ్రాహ్మణులు పూజించెదరు. మరికొన్ని ఆలయములను పంచములు, పంబలివాళ్లు ఆరాధించు చున్నారు. అంకమ్మ, అంకాలమ్మ, అంజమ్మ, అక్కమ్మగా పిలువబడుచున్న దేవతలే ఉత్సవములయందు అంకమ్మ విగ్రహము రాతితోగాని, కర్రతోగాని చేయబడియుండును. చతుర్భుజియైన అంకమ్మ చేతులలో పాము, ఢమరకము, పుర్రె, కొరడా, యుండి విగ్రహము భయంకరముగా నుండును. ఉత్సవముల యందు ఆసాదులు, గొల్లలు, పూజారులుగా నుందురు. వీరు పంబజోళ్ళను వాయించుచు, అంకమ్మ వీరగాథలను కథలుగా ఉత్సవములయందు చెబుదురు. పశువులమ్మ, పల్లె ప్రజలను, రోగములనుండి రక్షించెడి దేవతగా అంకమ్మను పల్లీయులందరు పూజింతురు.

తెలుగుదేశమున ప్రతీ గ్రామమునందును పూజలందు కొంటున్న ప్రతీ గ్రామ దేవతనకు ఒక ప్రత్యేకమైన పురాణము, స్థల గాధలు అసంఖ్యాకముగా కలవు. అన్ని కథలయందును ఆమె ఒక శక్తిస్వరూపిణిగ, జానపదులను గాచి రక్షించు దేవతగానో చిత్రించిరి.

## పేరంటాండ్రు – కుల దేవతలు :

గ్రామ దేవతలతోబాటు పేరంటాండ్రుకుకూడా ఘనమైన ఉత్సవములను జరుపుచున్నారు. కులదేవతలు ఆయా కులములకే పరిమితము కాగా, పేరంటాండ్రు ఆయా కుటుంబముల వారికే పరిమితము. గాని ఉత్సవములయందు గ్రామ ప్రజలందరును ఉత్సాహముతో, భక్తిప్రపత్తులతో పాల్గొనెదరు. ఉత్సవ సమయమున ఆయా కులములు, కుటుంబములవారే ముందుగా పాల్గొందురు. వైశ్యులకు కన్యకా పరమేశ్వరి, దేవాంగులకు చౌడేశ్వరిదేవి, బీరప్ప, మల్లన్నలు కురుమ, గొల్ల, కాపులకు, గంగాదేవి పల్లీయులకు కులదైవముగ పరిగణించుచున్నారు. కులదైవములకు పూజా విధానము అంతా సాత్వికమే. ఆమెకు చీర, జాకెట్టు, చలిమిడి, వడపప్పు బూరెలు, అన్నము, పాలు, పిండివంటలు ఉపాహారముగ నైవేద్యమును చెల్లింతురు. ఇందు బలి నిషిద్ధము. మాంసాహారమును ముట్టరు. పూజారిగా కులపెద్దలు ఉందురు.

పురాణములయందు పతివ్రతలు తమ మానసిక అతీత శక్తులచే దేవతలను, రాక్షసులను, మానవులను గూడా పరాజితులను గావించిరి. అనసూయ, అరుంధతి ఈ కోవకు చెందినవారు. జానపద సాహిత్యమునందు పేరంటాండ్రు పురాణ పతివ్రతలతో బాటు సమానమైన ప్రతిపత్తిని గలిగి తమ జీవితకాలములోనే తమ పాతివ్రత్య మహాత్యమును ప్రదర్శించి పురాణస్థాయినకు

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ ఛర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు అదర్శమైన నివారిణి. నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

757-TG

ఎదిగారు. వీరు తమ మరణమునకు కారణభూతులైనవారిని సర్వనాశనము గావించి దేవతలుగ వెలసి ప్రజలచేత పూజింపబడుచున్నారు. అత్తల ఆరళ్లను భరించలేనివారు, తోడికోడళ్ళ ఈర్ష్యాసూయలకు బలి అయినవారు, భర్తలచే సహగమనము చేసినవారు, కాముకులచేత బలాత్కరింపబడినవారు వారి మరణానంతరము పేరంటాండ్రుగ వెలసినారు. మరణానంతరము వీరి విగ్రహములు శిలలుగా, వృక్షములుగా, ఫల పుష్పములుగా భూమిపైన నిలిచిపోయినట్లు కథలయందు వర్ణింపబడినాయి.

మరణానంతరము పేరంటాండ్రు తమ కిష్టమైన సన్నిహితులైనవారి స్వప్నములో కనబడి గుడులు కావలయునని, పూజలు జరిపించుమని ఆదేశించెదరు. కొందరు పేరంటాండ్రు మరణాంతరమునకు పూర్వము, అనంతరము సన్నిహితులకు సంతు కలుగునట్లుగా ఆశీర్వదించెదరు. వారి ఆశీర్వాద ప్రభావము చేత సంతానము కలిగిన ఎడల తమ బిడ్డలకు పేరంటాండ్రు పేర్లనే పెట్టుకొందురు. పేరంటాండ్రుల అభిమతము కూడా అదే.

గ్రామ దేవతలవలే పేరంటాండ్రు గూడా శక్తి స్వరూపిణులు. వీరు ఆగ్రహించినచో పశునాశనము, ప్రాణనష్టమును సంభవించునను భీతిచేత అత్యంత భక్తిశ్రద్ధలతో వీరికి ఉత్సవములను జరిపించెదరు. మండపేటనందున్న పాపమ్మ పేరంటాల ఉత్సవము, పాయకరావుపేట నందున్న పేరంటాలమ్మ ఉత్సవములు ఈ కోవకు చెందినవి.

మానవునకు మరణము సహజము. అయినప్పటికిని కొంతమంది ప్రత్యేక వ్యక్తులే దేవతలుగా, పేరంటాండ్రుగా వెలయుటకు పరిస్థితులే కారణము. వీరు మరణించగనే పశు నష్టము, ప్రాణనష్టము అద్భుత సంఘటనలు గాని సంభవించిన, అవి మరణించినవారి ఆగ్రహము, అనుగ్రహమువల్లనే సంభవించినవి అని నమ్మి వారికి పూజలు చేయుదురు.

1. పరుల దౌర్జన్యమునకు, ఈర్ష్యాసూయలకు మరణించిన పేరంటాండ్రు వారి కథలు మనకు గలవు. వీరమ్మ, బేతుకేమ్మ, తిరుపతమ్మ మొదలగువారు.

2. పర పురుషులచేత బలాత్కరించబడి మరణించిన వారు. -బయ్యమ్మ

3. భర్తల సంశయ స్వభావముచేతను, సాటి స్త్రీల అసూయవలనను, లోకులచేత నిందింపబడి, శీలమును శంకించబడుట వలనను మరణించి, మరణానంతరము పేరంటాండ్రుగా పూజలందుకొనినవారు. ఉదా: నాగమ్మ, లక్ష్మమ్మ, రాములమ్మ.

4. మరణించిన భర్తతో సహగమనము చేసినవారు—కామమ్మ, పాపమ్మ.

5. బలిగా నొసంగబడినవారు, సంఘ సంక్షేమమునకు ఆత్మార్పణము చేసుకొన్నవారు నాంచారమ్మ, మునలమ్మ, నలదూరమ్మ.

పేరంటాండ్రు లేదా కులదేవత లందరికి తలోక ప్రత్యేకమైన ఇతివృత్తముతో గూడిన కథలు గలవు. ఇవి ఎంతవరకు వాస్తవము అన్నది మనకు అక్కరలేని విషయము గాదు. ఒకవేళ పరిశోధించి ఇది అంతా అభూతకల్పన అన్నా మనలను జానపదులు నమ్మరు. సరిగదా తగు రీతిలో దేహశుద్ధి గూడ చేయవచ్చును. ఆయా ఇతివృత్తములు ఆయా ప్రాంతములను బట్టి మారుచుండును. కాని మౌలికమైన అంశములు మాత్రము ఒక్కటే.

### గ్రామ దేవతల పండుగలు – ఆచారములు :

ప్రతి జాతికిని, దేశమునకును అనూచానముగా వచ్చు కొన్ని ప్రత్యేక ఆచారములు, సంప్రదాయములు కలవు. అవి ఆయా ప్రజల దృక్పథము ననుసరించి, వారి వారి జీవిత పరిధిల ననుసరించి ఆచారములుగా రూపొందును. అన్ని దేశముల యందును అన్నింట ఒక్కలాగా ఉండవు. ఒక్కొక్క ప్రాంతమున ఆయా ప్రాంత భేదములను అనుసరించియుండును. తెలుగు వారిలోనే జానపదుల ఆచారములు నాగరికుల ఆచారములకంటే భిన్నమై తమ ప్రత్యేకతను ఆదినుండి నిలబెట్టుకొనుచున్నవి. అగ్రవర్ణములచేత క్షుద్రదేవతలుగా పరిగణింపబడి నిరాదరించబడెను. ఆపదలు కలిగినపుడు, అంటువ్యాధులు ప్రబలినపుడు వారు గూడా ఆ గ్రామ దేవతలకు మ్రొక్కులను మ్రొక్కుచున్నారు. తీర్చుచున్నారు.

గ్రామ దేవతల పండుగలు, ఉత్సవములు, జాతరలలో అగ్రవర్ణములవారు అగ్రస్థానము వహించకపోయినను, ధన, దాన సహాయము చేయుదురు. వారు గూడా ఆ ఉత్సవముల యందు పాల్గొనెదరు. శైవ, వైష్ణవ, జైన, బౌద్ధమత ప్రభావము మన దేశమున ప్రబలినప్పటికిని అనేక వేల సంవత్సరముల నాటి గ్రామ దేవతలమీద భక్తి, వాటి ఆరాధనా విధానము మీద ఏ మాత్రము తమ తమ ప్రభావములను చూపలేకపోయినవి.

గ్రామ దేవతల పండుగలు, సంబరములు నిర్ణీత దినమున జరుగవలెనని నియమము లేదు. ప్రతి సంవత్సరమును జరుపుదురు. కొన్ని దేవతల ఉత్సవము 2, 3 సంవత్సరముల కొక

పర్యాయము జరుపుదురు. మరికొన్ని గ్రామ దేవతలకు ప్రతీ సంవత్సరము ఉత్సవములు గ్రామస్థులు తమ తీరిక వేళలయందు జరుపుదురు. మరికొన్ని గ్రామ దేవతలకు ప్రతీ సంవత్సరమున నిర్ణీత కాలమున ఉత్సవములు జరుపుదురు. ప్రతీ సంవత్సరము నిర్ణీత దినమున జరిగే ఉత్సవములయందు అన్ని ఆచారములు, సంప్రదాయములు పాటించుచు జరుపుదురు. ఆషాఢమాసమున అమావాస్య రోజున మరిడమ్మ (పెద్దాపురం) జాతరను నెల రోజులు, చైత్రమాస అమావాస్యరోజున నూకాలమ్మ (కాంద్రకోట) జాతరను నెలరోజులు జరుపుదురు.

సాధారణముగా గ్రామస్థులు తమ పంటలు పండినపుడు తర్వాత విశ్రాంతి సమయములో వర్షాకాలమందును ఉత్సవములు జరుపుదురు. అంటురోగములు, పశువులకు వ్యాధులు ప్రబలినపుడు, కరువు కాటకము లేర్పడినపుడును గ్రామ దేవతలకు ఆగ్రహము కలిగినదని భీతి చెంది జానపదులు దేవతలకు బలి నొసంగి, పండుగలు గావించెదరు. జాతర, జాగారము, ఉత్సవము, తిరునాళ్ళు, సంబరములు మొదలగునవి గావించెదరు.

గ్రామ దేవతల ఆలయమున, జాతరన ప్రధానముగా సంప్రదాయము బలి. బలి విధానమును దున్నపోతును గాని, మేకను గాని, గొఱ్ఱె, కోడి ఇతర పక్షులను సమర్పించెదరు. బలులకు ఏయేవాటిని బలిని యివ్వాలో శ్రీనాథుడు తన భీమ ఖండమున తెలిపినాడు.

బలిని యిచ్చే నిషేధము ఉన్నప్పటికిని జానపదులు బలిని యిచ్చుచునే యున్నారు. బలిని ఇచ్చుట యిష్టము లేనివారు కొబ్బరికాయను, గుమ్మడికాయను గుడిముందు బద్దలు గొట్టెదరు. దున్నపోతును బలిని యిచ్చే ఆచారమునకు పూర్వదశ నరబలిని దేవతకు సమర్పించేవారు. ఇప్పటికిని ఈ ఆచారము మరీ ఆటవిక జనులయందున్నట్లుగ మనకు నిదర్శనములు దొరుకుచున్నవి.

దేవతలకు బలిని యిచ్చే ఆచారము నేడు కాదు గదా ఎప్పటినుండి పుట్టబడినదో మనకు తెలియదు. గాని ఆధారములు సింధు నాగరికతనుండి మనకు తెలియుచున్నవి. శిథిలయములందు లభించిన ఫలకమునందు ఒక పురుషుడు కత్తిని ధరించియుండగా, స్త్రీ వంగి తన చేతులను పైకి చూపుతున్నట్లుగ ఉన్న చిత్రమును మనము ఆధారముగా గ్రహించవచ్చును. భాగవతమునందు శునశ్శేఫుడు అంబరీషుని యాగ పశువుగా తండ్రిచేత అమ్మబడెను. యాగ పశువుగ యూప స్తంభమునకు కట్టివేయబడిన శునశ్శేఫుడు అశ్వినీ దేవతలను మెప్పించి విముక్తుడయ్యెను.

దేవతల అనుగ్రహమును పొందుటకు, విజయమును పొందుటకు, యాగ ఫలమునకు నరబలి నొసంగే సంప్రదాయము మనకు గనబడుచున్నది. మహాభారత యుద్ధమునకు ముందు కురు పాండవులలో ఎవరు ముందుగ బ్రహ్మచారిని, అమిత నిష్ఠావరుని కురుక్షేత్రమునకు బలి యిచ్చెదరో వారే విజయమును పొందుదురు అని సహదేవుడు ముహూర్తమును నిర్ణయించెను. అంత పాండవులు శ్రీకృష్ణుని సలహామీద "ఇలావంతుని" కురుక్షేత్రమునకు బలి యిచ్చినారు. "ఇలావంతుడు" అర్జునునకు, ఉలూచికి జన్మించినవాడు. కురుక్షేత్ర యుద్ధము చూడవలయునన్న కోరికను శ్రీకృష్ణుడు అతనికి తీర్చినాడు. కురుక్షేత్ర రణరంగమున ఖండించబడిన శిరస్సును యూప స్తంభమున వ్రేలాడదీయగా ఆ శిరస్సు రణరంగమును కన్నులు విప్పి అంతయును చూచెను. చివరగా గదా యుద్ధమున భీముడు దుర్యోధనుని చంపినపుడు తృప్తిగా కన్నులు మూసెను. పురాణునందు గూడ నరబలి ప్రసక్తి కలదు. ఆత్మ నివేదనము వలన భగవంతుని అనుగ్రహమును పొందెదమన్న విశ్వాసము ప్రబలియుండెను. కాలక్రమేణా తనకు తాను భగవంతుని అర్పించుటకు మారుగా మరియొక ప్రాణిని బలిగా నిచ్చిన కోరికలు నెరవేరునను భావము మానవునకు కలుగగా, ముందుగా జంతువులను, పక్షులను, తరువాత తృణ ధాన్యములను అర్పించేవారు. బైబిలునందు గూడ మానవునికి బదులుగ ఈ గొఱ్ఱె ప్రాణమును నీకు సమర్పించుచున్నాను - అని కలదు. జనపద సాహిత్యమునందు నరబలి నిషేధించబడినది.

బలిని గురించి పాశ్చాత్యులు గూడా అంగీకరించిరి. ప్రాఙ్మానవుడు చనిపోయినవారి సమాధుల ముందు నీరు ఆహారమును పెట్టెడి ఆచారముయే దేవతలకు బలి యివ్వడమను ఆచారముగా రూపొందినదని భావించెను.

బలికి యివ్వబడే జంతువు గణ దేవతకు ప్రతీకగా ఎంచబడుతుందనేదను అంశము బలపడుచున్నది. బలికి ముందు జంతువును పసుపు, కుంకుమలతో అలంకరించుదురు. ఊరేగింపుదురు. ఊరేగింపునపుడు ప్రతీ యింటిముందు దాని కాళ్ళపైన నీరు పోయుదురు. జంతువును బలి యిచ్చిన తరువాత బలిగా దేవతకు సమర్పించు సమయమున రక్తమును నైవేద్యపు టన్నములోనికి పట్టి దానిలో వేపాకు, పసుపు కలిపి, ఆ రక్త మిశ్రమమును ఊళ్ళపైన, పొలములలోను చల్లుదురు. ఈ నైవేద్యపు అన్నమును రైతులు, గొల్లలు, తమ సంపదపైన, గొఱ్ఱెలమందల పైనను, వ్యవసాయ భూముల పైనను చల్లుదురు.

రక్తమును జల్లు సమయమున నోటిలో బలియైన జంతువు యొక్క కాలేయమును, నిమ్మకాయను పెట్టుకొని ఊరేగించుదురు. గుండె, మెదడు, కాలేయము, మొదలగువానిలో ఆత్మ ఉందన్న భావనయే బలి పశువు చంపబడినపుడు ఆ అంగములే ప్రత్యేకముగా దేవతకు ఆహారము అగుటకు కారణము అగుచున్నది. బలి జంతువు యొక్క రక్తముతో మిశ్రమమైన అన్నమును బలి అన్నము అని అందురు. దీనిని ఇళ్ళపైన, పొలములపైన జల్లినచో దేవత వానిని రక్షించునని గ్రామస్థుల విశ్వాసము. గణ దేవతకు ప్రతీకగా భావించబడు జంతువు శక్తి కాలేయము ద్వారా తమకు సంక్రమించునను భావన జానపదుల యందు గలదు. కాలేయమును ,నూనెలో వేయించుట, ఆ ముక్కను ప్రసాదముగా పిచ్చెదరు. దీనినే రన్ను అందురు.

ఉత్సవములయందు కల్లును దేవతముందు సాకగా పోయుట ఒక ఆచారము. గృహసంబంధి, మతసంబంధి ఆచారములో కల్లును త్రాగుట, దేవతకు సమర్పించుట జానపదులకు సామాన్యమైన విషయము.

ఉత్సవ సమయములందును, దేవతకు బలినొసంగు జంతువులపైనను కల్లును వాటిమీద పోయుదురు. అన్నవరము గ్రామము దగ్గర తమ్మయ్యపేటనందు కల్లులమ్మ ఆలయము కలదు. ఆ అమ్మవారి చుట్టుప్రక్కల ప్రాంతముల యందు కార్మికులు తాటిచెట్లనుండి కల్లును తీసుకొని, ఆ తొలికల్లును అమ్మవారునకు నైవేద్యముగా చెల్లించెదరు. అమ్మవారి ఉత్సవమునందు జంతువుల మీద కల్లుతో తడిపి బలిని యిచ్చెదరు. బహుశః అందులకేనేమో ఆ తల్లిని కల్లులమ్మ అని పిలుచుచున్నారు.

గ్రామ దేవతల పండుగలలో బోనాలను చెల్లించెదరు. రంగులతో అలంకృతమైన కుండనందు అన్నమును వండుదురు. దీనిని "కడుముంత" అందురు. కడుముంత మీద చిన్ని మూకుడును మూతగ పెట్టి అందులో నూనె పోసి, వత్తి చేసి, జ్యోతిని వెలిగించెదరు. దీనినే "కంచుడు" అని అందురు. స్త్రీలు ఈ దొంతిని పదిలముగా నెత్తిపైన నిలుపుకొని గుడి కడకు వెడలి గుడిచుట్టూ ప్రదక్షిణము చేసి ఆ బోనములను దేవికి నివేదించుదురు. ఉత్సవమునకు రెండురోజులు ముందు అమ్మవారి ప్రతిమ గల పటమును ఊరియందు ఊరేగించి ఉత్సవానంతరము దానిని నీటిలో వదలివేయుదురు. పండుగకు ముందు కలశ స్థాపన చేయుదురు.

దేవతకు బలి నొసంగబడిన పిదప "పరంగ మెక్కుట" అను కార్యక్రమము గ్రామ దేవతల ఉత్సవములలో కనబడును. కుమ్మరి ఆవములో కాలని పచ్చి కుండను మెడ వరకు భూమిలో పాతిపెట్టి మీద కొత్తచేటను పెట్టి దానిమీద ఎక్కి పూనకము పొందిన వేల్పులోడు జనుల భవిష్యత్తును, ఊరి బాగోగులను వివరించును. దీనినే "శివమెక్కుట" అని అందురు.

గ్రామ దేవతల ఉత్సవ, ఊరేగింపులలో వేప కొమ్మలను పట్టుకొని ఊరేగుదురు. పందిళ్లకు వేప తోరణములు ఉపయోగించుదురు. శాస్త్రరీత్యా వేపగాలి చలువను, ఆరోగ్యమును నొసంగును. దీని వాడకము ఆచారముగా గాననగును. ఉత్సవ సమయములలో దేవతలు శక్తిరూపమున పురుషులను స్త్రీలను ఆవేశించుదురనియు విశ్వసించుదురు. దీనినే "పూనకము" అందురు. శక్తి ఆవహించినవారికి "శివశక్తులు" అని అందురు. ఆ శక్తి ఆవహించుట ఎక్కువగా స్త్రీలలో కనబడును.

గ్రామ దేవతల ఉత్సవములో మరికొందరు భక్తులు అగ్నిగుండమునందున నడుచుదురు. ఒక గజము లోతులో వెడల్పుగానున్న గోతిని త్రవ్వి అందు రెండు, మూడు బళ్ళ కట్టెలను వేసి అయిదారు గంటలు వాటిని ఎర్రగా కాల్చుదురు. కణకణమనుచున్న నిప్పులపై ప్రధాన అర్చకుడు, ఇతర భక్తులు నడుచుదురు. ఈ కార్యక్రమములు అంతా చాలా ఉద్రేకముగా జరుగును.

గ్రామ దేవతల ఉత్సవ సమయములందు మొక్కు చెల్లించుకొనేవారు ఉదయమునుండి ఉపవాసముతో మంగళహారతులను పట్టుకొని నైవేద్యములతో ప్రతిమలతో డప్పులను వాయించుచు గుడికి వెళ్ళెదరు. గుడికి పోవునపుడు మార్గమున తెల్లని దుస్తులను పరచి దానిపైన నడచునట్లు పోవుదురు. దీనినే "పాన్పు పరచుట" అందురు.

గుడి ముందు బోనపు దొంతరలను దించిన తరువాత ఆవు పేడతో అలికి పసుపు, పిండితో ముగ్గులను వేసి తాము తీసుకొని వచ్చిన విగ్రహములను పసుపుపచ్చని బట్టలను లేదా తెల్లటి బట్టలను ధరింపజేసెదరు. ప్రతిమలను పసుపు, కుంకుమలతో అలంకరించెదరు. వెండి, బంగారముతో చేసిన కన్నులను వీనికి పెట్టెదరు. విగ్రహములయందు కుమ్మరింటినుండి తెచ్చిన కుంపట్లు పెట్టి అందు గుగ్గిలము వేయుదురు. గుడి వెలుపల బలి కొరకు తెచ్చిన తల్లి గొఱ్ఱె, పిల్లగొఱ్ఱెలపై పసుపు, కుంకుమలను జల్లి, వాటికి గుగ్గిలము పొగ చూపెట్టెదరు. వాటికి వీపు

పైన, ముక్కులోను, చెవులలో నీరు పోయుదురు. డప్పులను ఎక్కువ వేగముతో వాయించి, బలి పశువులను వణుకునట్లుగా చేయుదురు. ఈ కార్యక్రమమును వారు "జడిపించుట" అందురు. ఒకవేళ జంతువులు వణకనిచో మా తప్పులను క్షమించమని దండములను పెట్టుదురు. బలి పశువులు వణికిన పిదప వానిని నేలపై పరుండబెట్టెదరు. బోనపు కుండలయందలి అన్నమును బలి పశువుల తలపై నైవేద్యముగ తీర్చిపెడుదురు, చాకలి బలి పశువుల తలలను ఖండించిన పిదప ముందు కాలు నరికి బలి జంతువు నోటిలో పెట్టుదురు. రక్తముతో గూడిన అన్నమును గుడి వెలుపల నాలుగువైపులా జల్లుదురు. బలి జరిగిన తరువాత మ్రొక్కుకున్నవారి పుట్టువెంట్రుకలను గుడి ఆవరణ నందున్న వేపచెట్టు క్రిందగాని, రేగిచెట్టు క్రిందగాని తీయుదురు. ఈ కార్యక్రమము అంతయును ముగిసిన పిదప పండుగ చేసినవారు బలి పశువుల చర్మమును తలను చాకలికిచ్చి మిగిలినదానిని ఇంటికి తీసుకొనిపోయెదరు.

"ఊరడిపండుగ" అని మరొక సంప్రదాయము కలదు. ఆ గ్రామ దేవత పండుగ సమయమున బలి పశువైన దున్నపోతును ఎనిమిది రోజులవరకు మేత వేయక దానిని శక్తిహీనముగా ఉంచుదురు. మాలవాడు పండుగనాటి సాయంత్రము దున్నపోతుపై బండారిని చల్లి డప్పు చప్పుళ్ళచేత దానిని వణికించును. గ్రామ కరణము తన చేతికి దున్నపోతు తోకను కట్టుకొనును. దున్నపోతు పారిపోకుండుటకై నాలుగువైపుల త్రాళ్ళతో దానిని పట్టుకొనెదరు. కరణము చేతినుండి బలిపశువు తోక జారిపోయినచో అతనికి శిరచ్ఛేదనము జరుగును. గుడిని సమీపించువరకు కరణమునకు మనస్సునందు భయము కలుగుచునే యుండును. కనుకనే దున్నపోతు శక్తిహీనమగుటకు మేత వేయకుండా ఊరేగించు సమయమున పరిగెత్తకుండా త్రాళ్ళచేత బంధించెదరు. ఒకవేళ దున్నపోతు పారిపోవుటకు ప్రయత్నించిన కరణము దాని తోకను నరికివేయును. బలి పశువుతో ఊరి పెద్దలు ప్రజలు ఊరేగింపుతో అమ్మవారి గుడికి పోవుదురు. దున్నపోతు కదలనిచో భూతము పట్టినదని దానిముందు కోడి గ్రుడ్లు పగులకొట్టి, కోడిపిల్లలను గొంతు నులిమి చంపుదురు. ఊరేగింపు సమయమున మాదిగవాడు కోడిగ్రుడ్లను చిదిమి వేయును. కోడిపిల్లలను నులిమివేయును. ఊరేగింపు గుడిని సమీపించిన తరువాత రెండు కిలోల జొన్నలతో కుంభమును పోయుదురు. ఆ కుంభముమీద జ్యోతిని పెట్టెదరు. దున్నపోతు తోకను కరణము చేతినుండి విడదీయుదురు. మాలవాడు దున్నపోతును నేలపై పరుండబెట్టి గొడ్డలితో తలను నరికివేయును. తరువాత తెల్లవారుఝామున మాలవాడు చిన్న మేకను గావుపట్టి గుడి చుట్టూ 7, 5, 9 సార్లు ప్రదక్షిణము చేయును. గావు అనగా జంతువును బలి యిచ్చిన తరువాత ఆ జంతువు తాలూకు కాలేయము, ఊపిరితిత్తులు మొదలగునవి శరీరమునుండి వేరు చేసి ఆ భాగములను నోటినందు పట్టుకొని, వానితోబాటు నిమ్మకాయను పళ్ళయందు బిగించి, ఊరంతయు తిరుగును. దీనినే గావు పట్టుట అందురు. ఊరివారందరు మేకను వండి అచ్చటనే భోజనము చేసి ఇంటికి వెళ్ళిపోవుదురు. ప్రసాదము గ్రామపెద్ద తీసుకొనిపోవును. మాదిగ దున్నపోతును తీసుకొనును. ఈ విధానమును ఊరడిపండుగ అందురు. ఈ బలి విధానము ఇంతకు పూర్వము ఎక్కువగా వుండేదిగాని ఇప్పుడు మాత్రము తెరమరుగయినది కాని తుని తలుపులమ్మ లోవ నందు మాత్రము ఈ ఆచారము ఇంకను జీవించియున్నదని తెలియుచున్నది.

మరొక ప్రాంతమున మరొక సంప్రదాయము గలదు. పెద్ద అన్నపురాశిని కుంభముగ దేవతకు నైవేద్యము పెట్టుదురు. దున్నపోతును బలిగా యిచ్చెదరు. బలిగా యిచ్చిన జంతువు రక్తమును అన్నముతో మిశ్రమము చేసి దానిని చేటలలో పెట్టుకొని గ్రామము చుట్టూ జల్లుదురు. ఆ సమయమున పొరుగూరి వ్యక్తులను ఎవ్వరినీ అచ్చట ఉండనీయరు. పొరుగూరు వారు ఆ మిశ్రమమును తీసుకొనిపోయినచో ఆ ఉత్సవపు ఫలమంతయు వారికే సంక్రమించునను విశ్వాసము వారికి కలదు. కనుకనే బలి అన్నమును నెత్తిన పెట్టుకొన్న వ్యక్తి అందరినీ జాగ్రత్తగా గమనించుచుండును. ఇతరులు అతని తలపైన కత్తులను ఆడించుదురు. మ్రొక్కులను తీర్చుటకు జంతువులను, కోళ్ళను బలులుగా యిచ్చెదరు. కొన్ని గ్రామ దేవతల ఆలయములందు దున్నపోతును బలిని యిచ్చెదరు. బలి యిచ్చిన తరువాత బలి నుండి వచ్చిన రక్తమును మూకుళ్లనందు పట్టి ఆ రక్తములో నవ ధాన్యములను జల్లెదరు. వాటిని ఆలయమునందుంచి తలుపులను మూయుదురు. 3 రోజుల అనంతరము తలుపులు తీసిన తరువాత మూకుళ్లనందు ఉంచబడిన విత్తనములలో ఏ విత్తనము బాగుగా మొలకెత్తునో ఆ రకము పంటలు బాగుగా పండునను విశ్వాసము కలదు. తరువాత ఆలయమును శుభ్రపరచెదరు.

గుడిముందు ప్రధాన ద్వారము గడపకు ముందర చిన్న పిల్లలు దాటుటకు ముందుగా వారి కాళ్ళదగ్గిర ముమ్మారుసార్లు కల్లును ధారపోయుదురు. కొన్ని ఆలయములందు ధాన్యపు కుంచెలను భక్తులు సమర్పించెదరు. కావిడి కోళ్లను, గండదీపమును సమర్పించెదరు. కావిడికోళ్లు అనగా ఒక పొడవాటి కర్రకు

రెండువైపులా రెండు కోళ్లను కట్టుదురు. అంత ఆ కర్రను కావిడికర్రగా భుజముమీద నుంచుకొని మ్రొక్కుకొన్న భక్తుడు గుడిచుట్టూ ముమ్మారుసార్లు తిరిగి ఆ కావిడిని గుడినందు అమ్మవారికి యిచ్చెదరు. గండదీపము అనగా ఒక క్రొత్త మూకుడును తీసుకొని దానినిండా నూనెను పోయుదురు. ఆ నూనెయందు వత్తిని వెలిగించి ఆ దీపమును నెత్తిమీద పెట్టుకొని గుడిచుట్టూ ముమ్మారుసార్లు తిరిగి ఆ దీపమును అమ్మవారి కిచ్చెదరు. అమ్మవారి ఉత్సవమునకు ముందుగ గరగలను నెత్తిమీద పెట్టుకొని ఊరంతయు తిరుగుదురు. అంత జానపదులు గరగలు నెత్తిన పెట్టుకొని నృత్యము చేయుచున్న వ్యక్తి తమ యింటి గుమ్మము ముందునకు వచ్చినప్పుడు దేవత వచ్చినట్లుగా భావించి కాళ్ళమీద నీళ్లుపోసి గరగనకు పసుపును అద్దెదరు. అంత నృత్యము చేయువాడు ఆ పసుపునుండి కొంత భాగమును, వేపాకులను ప్రసాదములుగా యిచ్చును. అవి దైవప్రసాదములుగా భావించి స్వీకరింతురు. దీనినే గరగలు తీయుట అందురు.

భగవదనుగ్రహము కొరకు, కోరికలు తీరుటకు ఉత్సవ సమయములలో బలి లొసంగుట, తనకు తానే ఆత్మార్పణము గావించుకొనుట యించుమించు ప్రపంచమందలి అన్ని దేశముల యందును, అన్ని జాతులయందును బలిని యిచ్చు సాంప్రదాయము ఆచారముగా కలదు. ఇట్లా అనేక ఆచారములు, మూఢ విశ్వాసములు జానపదులలో గ్రామ దేవతల (అమ్మవార్ల) విషయములలో గలవు. ప్రతీ ఆచారమునకు ఒక ప్రత్యేకత కలిగి యుండును.

ఈ ఆచారములు, పుట్టుపూర్వోత్తరములు వాటి అంతరార్థము జానపదునికి అవగతము గాకపోయినను, తమ పూర్వీకుల చేత జరుపబడిన ఈ ఆచారములను ఆక్షేపించిన, ఉపేక్షించిన అరిష్టములు ప్రాప్తించునని ప్రగాఢ విశ్వాసము. కొన్నివేల సంవత్సరములనాటి మానవుల నమ్మకములను, తమ ఆచారములలో, గాథలలో ప్రతిపాదించిన జానపదులు ప్రాచీన మానవుని మత విశ్వాసపు నిధులు, గాథలు భిలము గాకముందే గతకాలపు మత విశ్వాసములకు నిదర్శనములుగా వాటిని అక్షర రూపములో పదిలపరచుట పరిశోధకుల తక్షణ కర్తవ్యము

### ఆధార గ్రంథములు :


1. జానపద సాహిత్యము - పురాణ గాథలు, -రావి ప్రేమలత.
2. జానపద విజ్ఞాన వ్యాసావళి -జి. ఎస్. మోహన్
3. ది విలేజ్ గాడ్స్ ఆఫ్ సవుత్ ఇండియా -1922.
4. ఫెయిర్స్ అండ్ ఫెస్టివల్స్ ఆఫ్ ఈస్ట్ గోదావరి డిస్ట్రిక్ట్.


# అవలోకనం

## ఎం. వి. లక్ష్మి

ఆలోచన!
అవిరామ కడలితరంగ విన్యాసంలా
నాలో నిరంతరం సడి చేస్తూనే ఉంటుంది

ఒక్కోసారి
మధురస్వప్నంలా మల్లెల పరిమళంలా
మనసును క్రమ్ముకుంటుంది

మరోసారి
జీవితపు కఠోర వాస్తవాల కరాళ ధ్వనులు
విన్పిస్తూ నిద్రను తరిమేస్తుంది

ఇంకోసారి
గతకాలపు శిథిలాల్ని త్రవ్వి
జ్ఞాపకాల నిధుల్ని తీస్తూ ఉంటుంది

అలసటూ లేదు — విశ్రాంతీ లేదు
ఊహల రెక్కల్ని చాటుకుని స్వేచ్ఛా విహంగంలా
ఏ సుదూర తీరానికైనా ఎగిరిపోతుంది

ఆలోచిస్తే అన్పిస్తుంది—
నేను లేకపోయినా ఆలోచన ఉంది!
కాని ఆలోచన లేక, నేను లేను!!

# కాలప్రవాహంలో...

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

ఆ రోజుల్లో
అగ్రహారంలో
శ్రీ ప్రసన్నాంజనేయస్వామి ఉత్సవంలో
ఠీవిగా క్రొత్త గుడ్డలు తొడుక్కొని
అమ్మ ఇచ్చిన బొట్టు జేబులో పెట్టుకొని
ఎంతో మురిపెంగా బత్తాసు కొనుక్కొని
గోళీకాయలు లెక్కపెట్టుకొని
బద్దీగిచి రాముడుగాణ్ణి పిలిచినప్పుడు
సోడాగుండుతో ఆటలో గెలిచి వాణ్ణి కుంటించినప్పుడు
ఎంత హాయి!
తియ్యందనాల ఈ మనస్సు ఓలలాడేది.

తెలతెల్లారుతునే
జట్లు జట్లుగా చెయ్యేటికి బయలుదేరి
తానమాడేటప్పుడు ఎన్ని కేరింతలో!
ఎండ్రకాయను పట్టి
శీనుగాడి వీపుమీద కరిపించి
గోల చేసేటప్పుడు ఏమి పులకరింతలో!
ఆడవాళ్లు మడిస్నానం చేస్తుంటే
వాళ్ళ చీరల్ని నీళ్ళలో జారవిడచి
గమ్మత్తు చూస్తున్నప్పుడు
అవధాన్లు ముక్కు మూసుకొని కొంగజపం చేస్తుంటే
కొపీనం లాగి పరిగెత్తగా
ఆయన బాధను కళ్లారా చూచినప్పుడు
అంటుమామిడి చెట్టెక్కి
పొడు కట్టె చీమచేత కుట్టించుకొని
లబోమంటూ ఏడ్చినప్పుడు
తోటకాపు పెంచలు రాగానే ఒక్క ఉదుటున ఉరికినప్పుడు
ఎంత వేడుక!
మధుమాకంద రస ఘుమఘుమల ఎద పరవశించేది.

ఇసుక తీరంలో
బలిగుడు ఆడి ఆడి బాగా అలసిపోయినప్పుడు
దిగుడు బావిలో
దాగుడుమూతలాడి బడలిక పొందినప్పుడు
సీతతో సరసాలాడినప్పుడు
కావేరితో కబుర్లు చెప్పుకొన్నప్పుడు
వేణుగోపాలస్వామి గుడిలో
బారాకట్ట ఆడుకొన్నప్పుడు
మట్టి అరుగుమీద
పులీ మేకా నడుపుతున్నప్పుడు
పెరట్లో చింతచెట్టుమీద
దెయ్యం కోసం చూస్తున్నప్పుడు
దెబ్బతిని తప్పించుకొన్న నాగుపాము కోసం
గుడ్డి వెలుగులో వెతుకుతున్నప్పుడు
పిస్సి కర్రతుకొనిరాగా
తుర్రుమని పారిపోయినప్పుడు
తాత కన్నెర్రచేసి
ఒరేయ్! లండికే! అంటూ తరిమినప్పుడు
కాశీమజిలీ కథల్లోని
రాజకుమారుని నేనై
మంత్రికుమారుడు నా నేస్తమై
మహాభారతంలోని
అభిమన్యు కుమారుని నేనై
సైంధవుడు నన్ను పట్టుకొనే చిన్నానై
ఒకటే పరుగు!
నోరూరించే గడ్డ పెరుగు.

టెంకాయ మండమీద నే కూర్చొన్నప్పుడు
లాగుతానని చెప్పి బోర్ల పడేసేవాడు దొంగవెధవ
సాయిబాబా!
కస్సుమన్న నేను వాణ్ణి బురదగుంటలో తోసేవరకు
పచ్చి మంచినీళ్ళయినా ముట్టుకోలేదు అప్పట్లో అంత
రోషం!
రోజా మేరీకి చాకొలెట్లు ఇచ్చేవాడిని

తను నాకు రోజూ బిస్కట్లు పెట్టేది!
ఏరా! మీరు మొగుడూ పెళ్ళాలా అని షఫీ అల్లరిగా
అంటే
అనసూయ పెళ్లి సంగతి గుర్తుకొచ్చి కలలు కనేవాడిని!
సాయిగాడి పనిపై ఆవేశం, ఉక్రోషం!
షఫీ మాటలు వింటే ఏదో ఆనందం, అనుభూతి!
ఆ రోజులు ఎలా దొర్లిపోయాయో....
తెలియకుండానే?
పొర్లిపోయాక చేతికందవు పాలు నిజమేనేమో....
ఆ మురిపాలన్నీ అంతేనా?

అదే గడ్డమీద
మూడుముళ్లు వేసి
మేనమరదలు మనోరమను చేపట్టి
కాపురం పెట్టినప్పుడు
ఆ పెంకుటింట
తొలి బారసాలనాడు
రాధాకృష్ణా అని పేరు పెట్టుకొని
ఎంతో ఆనందంతో
పొంగిపోయినప్పుడు
మమత చెమ్మగిల్లేది!
ఏదో ఆప్యాయం ముసురుకొనేది.

నా అనుకొన్న వాళ్ళంతా
ఒక్కొక్కళ్ళే వెళ్ళిపోతూ ఉంటే
తిరిగిరాని తీరాలకు చేరుకొంటూ ఉంటే
రోజులు గడుస్తూ
వయస్సును పెంచేస్తూ ఉంటే
నెరిసిన భావాలకు మరుపులు వస్తూ ఉంటే
గత స్మృతులు కబుర్లు చెబుతుంటే
అలనాటి స్మృతులు ఆత్మీయతను పంచుతుంటే
అలరిస్తుంటే
అదరిస్తుంటే
అమ్మ ఒడిలా అదుముకొంటుంటే
అవగతం కాని స్వాంతన చేకూరుస్తుంటే
అర్థంకాని ఆర్తి!
కళ్ళల్లో ఆర్ద్రత!
గుండె తడి అయ్యేది
గొంతులో పొరపడేది
ఈ నేలంతా అరిగిపోయెనే....అప్పుడు!
ఈ బ్రతుకంతా ఆవిరాయెనే....ఇప్పుడు!

బిడ్డలు పెద్దవాళ్లై
వాళ్ళ దారి వాళ్ళు చూచుకొన్నప్పుడు
భార్య ఒంటరివాణ్ణి చేసి
తన దారిన తాను వెళ్ళిపోయినప్పుడు
ఎవరూ తోడులేక
నీడ కూడా వెంట రాక
మధనపడుతుంటే
మనశ్శాంతి కోసం
ఎంతో ఆత్రంగా
ఎంతో ఎంతో అపురూపంగా
అగ్రహారానికెళితే
ఏదీ శ్రీ ప్రసన్నాంజనేయస్వామి?
ఎక్కడా ఆ ఉత్సవం?
ఏటిగట్టూ లేదు
మామిడి తోటా లేదు
అంతా మారిపోయింది!
తారుమారయిపోయింది!
గుడి బీడు పడిందని
దాన్ని ధర్మసత్రం చేసారు!
ఉత్సవాలు మానేసి
ఎన్నో సంవత్సరాలు గడచాయి!
ఏరు ఊరయిపోయింది
మామిడితోట పాఠశాలయిపోయింది
అంతా కాల మహిమ!
అంతుబట్టని ప్రకృతి మహిమ!

అవును....
తల్లి కడుపులోనుంచి
పసికందులా బయటికొచ్చి
మరో బిడ్డకు జన్మనిచ్చిన తండ్రినై
ఈనాడిలా ముదివగ్గునై నిలబడలేదా?
అంతే....
మార్పు సహజమే
నిబ్బరంగా సహిస్తూ ఉండాలి
చరమగీతి పాడేవరకు!
విశ్రాంతి దొరికేవరకు!!

శ్రీ కాలువ శ్రీ

# "యోగభ్రష్టుడు" గురజాడ గిరీశం

ప్రతి రచనలోనూ రచయితకు అభిమానపాత్రమైన పాత్ర(లు) వుంటుంది. తాను చెప్పదలుచుకున్న విషయాల నా పాత్ర(లు) ద్వారా చెబుతాడు రచయిత. అప్పటి సాంఘిక పరిస్థితులకు దర్పణమైన విశ్వజనీన నాటకము కన్యాశుల్కం. ఈ నాటకంలో సౌజన్యారావు పంతులు పాత్రద్వారా తన భావాలను వెల్లడిస్తాడు గురజాడ. కాని, ఈ నాటకంలో నాయకుడితనే అనిపించే పాత్ర ఒకటుంది. ఆ పాత్ర గిరీశం. ఈతడు నాయకుడు కాదు ... ప్రతి నాయకుడూ కాదు...ఈతన్ని నకిలీ నాయకుడని చెప్పడం బాగుంటుంది. అయినా ఈ పాత్ర లేని కన్యాశుల్కం నాటకాన్ని ఎవరైనా ఊహించగలరా....? గిరీశం లేని నాటకం ఉప్పులేని పప్పులాంటిదే. ఈ పాత్ర జ్ఞాపకమున్నంతగా పాఠకులకు (ప్రేక్షకులకు) సకల సద్గుణ గుణాభిరాముడైన సౌజన్యారావు పంతులు పాత్ర కూడా జ్ఞాపకం వుండదు. గిరీశం పాత్రవల్లనే కన్యాశుల్క నాటకానికంత ప్రఖ్యాతి వచ్చిందన్నా అతిశయోక్తి కాదు. నాయకుడూ కాని, ప్రతి నాయకుడూ కాని ఈ పాత్ర ప్రవేశంతో మొదలైన నాటకం "డామిట్ కథ అడ్డం తిరిగింది" అంటూ ఈతడు వెళ్ళిపోవడంతో ముగుస్తుంది. ఈతడు నాటకమంతా సర్వాంతర్యామిలా దర్శనమిస్తూ మనల్ని నవ్విస్తాడు, కవ్విస్తాడు, ఏడిపిస్తాడు కూడా.

గిరీశం నాటకమంతా రకరకాల అవమానాల నెదుర్కొంటాడు. పూటకూళ్ళమ్మచే చీపురు దెబ్బలు తినాల్సింది తప్పించుకొని రామప్పంతులుకు తగిలేలా చేస్తాడు. అగ్నిహోత్రావధానితో తురక అని పిలువబడతాడు. మధురవాణితో కుక్కతో పోల్చబడతాడు. సౌజన్యారావు పంతులీతన్ని ఆషాఢభూతి, డెవిల్ అంటాడు. నెపోలియన్ ఆఫ్ ది ఆంటీనాచ్ అని ఇంట్లోంచి తరిమేస్తాడు. ఇన్ని అవమానాల నెదుర్కొంటూ ఆద్యంతం నాటకంలో దర్శనమిచ్చే ఈ పాత్ర నాటకంలో చేసిన పనులేంటి....?

కన్యాశుల్క నాటకంయొక్క ముఖ్యోద్దేశ్యము కన్యాశుల్క వివాహాలు స్త్రీల పాలిటి శాపాలని చెప్పడం. శుల్కం తీసుకొని ముక్కుపచ్చలారని కన్నెపిల్లలను ముసలివాళ్ళకిచ్చి పెళ్ళి చెయ్యడం అనర్థదాయకమని వివరించడం. అలాంటి వివాహాలపై ఏహ్యాభావం కల్గించడం. పై ప్రయోజనాలను సాధించడానికై కన్యాశుల్క దురాచారానికి బలి కాబోతున్న సుబ్బి పెళ్ళి తప్పించడమనే ప్రధానాంశం కథగా ఈ నాటకం నడుస్తుంది.

సుబ్బి పెళ్ళి తప్పించడానికై తనవంతు ప్రయత్నంగా రెండు పనులు చేస్తాడు గిరీశం. ఒకటి గ్రాంధికం, వ్యావహారికం, బొట్లేరు ఇంగ్లీషు మిశ్రితమైన భాషలో అగ్నిహోత్రావధాని రాసినట్టుగా లుబ్ధావధానికి ఓ ఆకాశరామన్న లేఖ రాయడం. ఈ లేఖ సుబ్బి పెళ్ళి తప్పించడంలో పెద్దగా పని చేయలేదనే చెప్పొచ్చు. సుబ్బి పెళ్ళి తప్పించడానికే లేఖ ఉపయోగపడ్డా అది అతి స్వల్పంగా మాత్రమే. కరటకశాస్త్రి అభ్యర్థనపై మధురవాణి పన్నిన పన్నాగం, రామప్పంతులు మాటల చాతుర్యంవల్లనే లుబ్ధావధాని సుబ్బికి బదులు గుంటూరు శాస్త్రులు కూతుర్ని పెళ్ళి చేసుకోవడాని కొప్పుకుంటాడు కాని ఈ లేఖవల్ల కాదు. కాకపోతే మధురవాణి, రామప్పంతులు ఆ లేఖను తమ ప్రయత్నానికి కొంత ఉపయోగపడేట్టు చేసుకున్నారు.

సుబ్బి పెళ్ళి తప్పించడానికి గిరీశం చేసిన రెండో ప్రయత్నం బుచ్చమ్మను లేవదీసుకుపోవడం. కాని ఈ ప్రయత్నం కూడా ప్రయోజనకారి కాలేదు. ఎందుకంటే పెళ్ళికి తరలిపోతూ మార్గమధ్యంలో గిరీశం, బుచ్చమ్మ బండిని దారి మళ్ళించి లేవదీసుకుపోయే సమయంవరకే లుబ్ధావధాని పెళ్ళి గుంటూరు శాస్త్రులు కూతురు (కరటకశాస్త్రి శిష్యుడు)తో అయిపోతుంది.

బుచ్చమ్మను లేవదీసుకుపోవడం తన స్వార్థం కొరకే అయినా లుబ్ధావధానికి లేఖ రాయడం మాత్రం సుబ్బి పెళ్ళి తప్పించాలన్న ఉద్దేశంతోనే చేస్తాడు గిరీశం. అయినా దానివల్ల కలిగిన ప్రయోజనం స్వల్పం. అయితే బుచ్చమ్మను లేవదీసుకు పోవడంవల్ల ఎవరూ ఊహించని ఓ ప్రయోజనం సిద్ధించిందని చెప్పవచ్చు. గిరీశం చెడ్డవాడని మధురవాణి ద్వారా తెలుసుకున్న సౌజన్యారావు పంతులుగారు బుచ్చమ్మ నాతని పాలబడకుండా చేస్తాడు. బుచ్చమ్మను పూనాలోని విడోస్ హోమ్‌కు పంపమని గురువుగారికి (వీరేశలింగంగారికి) టెలిగ్రాం యిస్తానని, ఆమె చదువుకుని ప్రాజ్ఞురాలైన తన యిష్టము వచ్చిన

వారివి పెళ్ళి చేసుకుంటుందని లేకుంటే మానుకుంటుందని చెబుతాడు.

బుచ్చమ్మ తండ్రిగారైన అగ్నిహోత్రావధాని సౌజన్యారావు పంతులు యిచ్చిన మంచి సలహాను పెడచెవిని పెట్టి వెధవ ముండలకి పెళ్ళి చేయడుపు పోయేకాలం పట్టుకుందేం పెద్దలకు అంటూ ఎంత చెప్పినా వినకుండా నీ యింట కోడిగాల్చ అనుకుంటూ తిరిగొస్తాడు.

గిరీశం బుచ్చమ్మను లేవదీసుకపోవబోయేంటే బుచ్చమ్మ అగ్గిరాముడులాంటి అగ్నిహోత్రావధాని ఇంట్లోనే వుండేది. అప్పుడు సౌజన్యారావు పంతులు అగ్నిహోత్రావధానితో బుచ్చమ్మను విడోస్ హోంకు పంపమని లేదా పెళ్ళి చేయమని సలహా యిచ్చివుంటే దానికి ఘటాశ్రాద్ధం పెడతాను కాని చచ్చినా వెధవముండకి పెళ్ళి చేయను అని వుండేవాడు. గిరీశం పుణ్యమా అని బుచ్చమ్మ అప్పటికే రాజమహేంద్రవరం చేరుకుంది కాబట్టి సౌజన్యారావు పంతులుగారి పని సులభమయ్యింది.

ఈ విధంగా సుబ్బి పెళ్ళి తప్పించడంలో గిరీశం చేసిన రెండు ప్రయత్నాలు పెద్దగా ప్రయోజనకారి కాలేదన్నది స్పష్టం. ఈ నాటకంలో గిరీశం పాత్ర లేకున్నా సుబ్బి పెళ్ళి తప్పించడమనే ఫలాగమం సిద్ధించేదనడంలో సందేహం లేదు. మరి యింత స్వల్ప ప్రయోజనాన్నాశించి గురజాడ గిరీశంకి నాటకంలో స్థానం కల్పించాడా?

ఈ నాటకంలో గిరీశం చేసే పనులు ఆషాఢభూతి పనుల్లా అనిపించినా అతడొక విజ్ఞాన సర్వస్వంలాంటివాడు. అతనికి తెలియని విషయం లేదు. ఏ విషయాన్నయినా తన కనుకూలంగా మార్చుకునే తెలివితేటలున్నాయి. ఒకే విషయాన్ని మంచిగా, చెడ్డగా కూడా అన్వయించే మాటనేర్పరితనముంది. చెడ్డను మంచిగా, మంచిని చెడ్డగా నిరూపించే నైపుణ్యముంది. అతడికి సందర్భోచితంగా మాట్లాడటం తెలుసు. అవసరమయితే ప్లేటు ఫిరాయించడం అతనికి వెన్నతో పెట్టిన విద్య. మొదట బాల్య వివాహాలు వద్దని వాదించిన గిరీశం అగ్నిహోత్రావధాని అగ్గిరాముడి స్వభావం చూసిన తర్వాత ఇన్ఫాంట్ మ్యారేజెస్ మంచివేయని వెంకటేశంతో అడ్డదిడ్డ వ్యాఖ్యానాలు చేస్తుంటాడు.

గిరీశంకు ఈ నాటకానికి పరోక్ష నాయకుడు, సంఘ సంస్కర్తయైన వీరేశలింగం పంతులుగూర్చి కూడా తెలుసు. వెంకటేశంతో అతడు "మై డియర్ షేక్స్పియర్! మీ తండ్రి అగ్గిరాముడోయ్.... వీరేశలింగం కన్యాశుల్క విషయమై రాసిన ఉపన్యాసం పైకి తీయ్. మామగారికి లెక్చరివ్వడానికి కత్తీ కటారి నూరాలి" అంటాడు. కాని, ఆ పాచిక అగ్నిహోత్రావధాని దగ్గర పారదని తెలుసుకొని "కుంచం నిలువునా కొలవడం సాధ్యం కానపుడు తిరగేసి కొలిచినా నాలుగు విత్తులు రాలుతాయి...." అంటూ బాల్య వివాహాలే మంచియని తన మాటకారితనంతో వాదిస్తాడు. గిరీశం పెద్దగా చదువుకున్నవాడు కాకున్నా అతనికి వీరేశలింగం పంతులు రాసిన రాజశేఖర చరిత్ర పుస్తకం సంగతి తెలుసు. వెంకటేశం కొనుక్కోవాల్సిన పుస్తకాల పేర్లలో రాజశేఖర చరిత్రుంటుంది.

ఆ కాలంలో ఆంధ్రదేశంపై బెంగాలీల ప్రభావం విపరీతంగా వుండేది. ఆంధ్రులు బెంగాలీల పేర్లు పెట్టుకోవడంలాంటి విషయాల్లో అంధానుకరణం చేసేవారు. ఆంధ్రుల భావదాస్యాన్ని, మౌలికా రాహిత్యాన్ని గురజాడ ఈ నాటకంలో గిరీశం పాత్ర ద్వారా నిశితంగా విమర్శించాడు. గిరీశం మాటిమాటికి బెంగాలీల ప్రసక్తి తీసుకొస్తాడు. మొన్న బెంగాలీవాడు లెక్చరిచ్చినప్పుడు ఒక్కడికూడా నోరు పెగలలేదంటాడు శిష్యుడు వెంకటేశంతో. తాను పాసు కాలేదని తెలిస్తే తండ్రి తన ఎముకలు విరగ్గొడుతాడంటాడు వెంకటేశం. అప్పుడు గిరీశం అతనితో.... "డటీజ్ టిరనీ! ఇదే బెంగాలీ కుర్రవాడయితే ఏం జేస్తాడో తెలిసిందా? తాత యేది, తండ్రయేది కర్ర పట్టుకొని చమ్డాలెక్కగొడుతాడు" అంటాడు. బుద్ధిగా తాను చెప్పిన మాటల్లా వింటే సురేంద్రనాథ బెనర్జీ అంతటివాన్ని చేస్తానంటాడు.

గిరీశం గొప్ప సమయస్ఫూర్తి గలవాడు. తన గురుత్వం వల్ల చుట్ట కాల్చడమొక్కటే వచ్చిందన్న వెంకటేశంతో తనతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్ అని, ఇంగ్లీషువాడు చుట్ట పంపిణీ మీదనే సీమయంత్రం కనుగొన్నాడని, చుట్ట తాగడంవల్లనే ఇంగ్లీషువాళ్ళంత గొప్పవాళ్ళయ్యారని వాదిస్తాడు. తుదకు చుట్ట తాగనివాడు దున్నపోతై పుడతాడని ఓ పద్యం చదువుతాడు.

గిరీశంకు వేదాంతం గురించి కూడా తెలుసు. బాకీ చెల్లించమని వచ్చిన బంట్రోతును చుట్ట యిచ్చి వలలో వేసుకుంటాడు. బాకీ తప్పకుండా చెల్లిస్తానని గాయత్రిపై ప్రమాణం చేస్తాడు. బంట్రోతు పోయింతర్వాత "ఇన్నాళ్ళకు జంయపోప్పిన వినియోగంలోకి వచ్చింది. ఆత్మానుభవం అయితే కాని తత్వం బోధపడదు...." అనుకుంటాడు తనలో తాను.

గిరీశంకు సమకాలీన సమాజంలోని పార్టీలగూర్చి, రాజకీయాల గూర్చి కొంత తెలుసన్నది సత్యం. అతడు తన మాటల్లో మాటిమాటికి జాతీయ కాంగ్రెస్ ప్రసక్తి తెస్తాడు. గిరీశం పెద్దగా విద్యావంతుడు కాకున్నా అతనికి షేక్స్పియర్

గురించి తెలుసు. అతని పుస్తకాలగూర్చి కొంతైనా తెలుసు. అతడు వాటిగురించి ఎవరి ప్రసంగాల్లోనైనా వినివుంటాడు. లేదా చదివి వుంటాడు. బుచ్చమ్మను చూసిన తర్వాత విధవా వివాహం చేసుకోవడంలోని లాభనష్టాలను బేరీజు వేసుకుంటూ షేక్స్పియర్ పడ్డ అవస్థలో పడ్డాం అని తనను తానే షేక్స్పియర్‌తో పోల్చుకుంటాడు. తన శిష్యుడు వెంకటేశంను మై డియర్ షేక్స్పియర్ అని సంబోధిస్తాడు. మారువేషంలో వచ్చిన మధురవాణి సౌజన్యారావు పంతులుతో నా పేరుతో ఏనేముంటుంది అప్పుడు గిరీశం వాట్సినేమ్? అవి షేక్స్పియర్ అన్నాడని అతని డ్రామాలోని మాటలను చెబుతాడు. దాన్నే తాను పేరులో యేమి పెన్నిధి వున్నది? అని అనువదించానంటాడు.

ఈతనికి కోర్టుల గురించి కూడా తెలుసు. కోర్టుల ప్రసక్తి తెచ్చిన అగ్నిహోత్రావధానితో వాటిని గురించి తనకు తెలిసిందీ తెలియందంతా చమత్కారంగా చెప్పి ఇంట్లో తిష్ట వేస్తాడు. బుచ్చమ్మకు మనోవర్తి దావా తెస్తానని ఇంట్లో స్థానాన్ని పదిల పరుచుకుంటాడు. లుబ్ధావధాని కేసులో ఇరుక్కుంటే అతని దగ్గరకెళ్ళి "మీ బంధువుల్లోకెల్లా వ్యవహారజ్ఞానం తెలిసినవాన్ని, ఇంగ్లీషు వచ్చినవాన్ని నేనొక్కన్నే...అంటాడు. అతనికి సహాయం చేస్తానంటాడు. ఆస్తిగురించి తనకో పవరాఫ్ టర్నీమా గెలికియ్యమంటాడు. మాటిమాటికీ కోర్టుల ప్రస్తావన తెస్తూ "ఈ కేసు గెలుస్తామా?" అన్న అగ్నిహోత్రావధానితో "యథోః ధర్మః స్తతో జయః" అని జబల్పూరు హైకోర్టు తీర్పొకటి బలంగా వుందని అతనికి ఆశలు కల్పిస్తాడు గిరీశం.

గిరీశం కంట్రీలైఫ్ గురించి, బుబాకోపనిషత్తు గురించి వెంకటేశంతో చెప్పిన మాటలు నవ్వు తెప్పించినా అతనికి చాలా చిన్న విషయాల గూర్చి కూడా విజ్ఞానం వుందనడానికి మంచి ఉదాహరణలు పొట్టకూటికోసం, ఆత్మారాముడి ఘోషను చల్లార్చడం కోసం దేశంమీదపడి తిరిగే గిరీశంకు హైద్రాబాద్ నవాబు గూర్చి కూడా తెలుసు. నిజాం నవాబు తన కుద్యోగమిస్తానన్నాడని, తాను దేశసేవ కోసమే ఆ ఉద్యోగం చేయనన్నానని కోతలు కోస్తాడు. అతడు పొలిటీషియన్స్ గురించి, స్వాతంత్ర్యం గూర్చి చమత్కారంగా చెబుతాడు. తాను పరీక్ష ఫెయిలయినా గిరీశంవల్లనే దెబ్బలు తప్పాయన్న వెంకటేశంతో "ఏదైనా డిఫికల్టు లొచ్చినప్పుడు ఒక రస్సా వేసానంటే అది బ్రహ్మభేద్యంగా వుండాలి. పొలిటీషనంటే మరేమనుకున్నావు" అంటాడు. మన కంట్రీయే ఇండిపెండెంట్ అయితే గ్లాడ్స్టన్‌లాగ దివాన్గిరీ చలాయిస్తును అంటాడు.

గిరీశం మంచి హాస్యప్రియుడు. తన హాస్య సంభాషణలతో, చేష్టలతో మనల్ని నవ్విస్తాడు. అతడు విడోల గురించి, విడో మ్యారేజెస్ గురించి చేసే వాదన నవ్వు తెప్పిస్తుంది. వెంకటేశంతో విడో గురించి షీ లీవ్స్ ఎట్ బెడ్ ఎట్ 4.ఎ.ఎమ్ అని పద్యం చెప్పిస్తాడు. దమయంతి పెళ్ళికి ధరనున్న రాజులెల్ల దడదడ వచ్చిరని చెప్పి బుచ్చమ్మను నవ్విస్తాడు. వెంకటేశం చెట్టెక్కి జామకాయలు కోస్తూ వుంటే అగ్నిహోత్రావధాని అక్కడికొస్తాడు. అప్పుడు గిరీశం శిష్యున్ని చెట్టుకొమ్మల చాటున దాక్కోపెట్టి తాను నీళ్ళు తోడుతుంటాడు. ఇంగ్లీషు చదువుకున్న మీకెందుకండీ శ్రమ అన్న అగ్నిహోత్రావధానితో పనివంటి వస్తువు లోకంలో లేదండి. షేక్స్పియర్ ఏమన్నాడో తెలుసా? డిగ్నిటీ ఆఫ్ లేబర్ అని ఇంగ్లీషువాళ్ళ గూర్చి చెబుతాడు. సమయస్ఫూర్తితో ఇంగ్లీషువాళ్ళ సంగతి తెచ్చి గొప్పవాన్ని చేయడానికే వెంకటేశంను చెట్టెక్కించానని చెబుతాడు. అతని బొట్లేరు యింగ్లీషు మనల్ని గిలిగింతలు పెడుతుంది.

ఎన్ని తెలిసినా అన్నిట్నీ తనకోసమే ఉపయోగించుకునే ఈ యోగభ్రష్టుడికి వేదాల గురించి కూడా తెలుసు. మన పుస్తకాల్లో మర్మం తెలుసుకొని దొర్లు బాగుపడుతున్నారని, మన పుస్తకాలను బూజెక్కించి మనం చెడుతున్నామని అగ్నిహోత్రావధానితో అంటాడు. భాష్యం అయ్యవారి ప్రసక్తి కూడా తెస్తాడు. గిరీశంకు మన దేశం సంగతే కాక ప్రపంచంలోని కొన్ని విషయాల గురించి కూడా తెలుసు. సందర్భోచితంగా వాటి ప్రసక్తి తెస్తాడు. బుచ్చమ్మతో అతడు ఆఫ్రికా గురించిలా చెబుతాడు. "ఆఫ్రికా దేశంలో స్లేవరీ ఉంది - అనగా మనుషుల్ని పట్టి పశువుల్లాగా అమ్ముతారు. యవరు కొనుక్కుంటే వాళ్ళ యింట్లో ఆయా మనిషి బతికినన్నాళ్ళు చాకిరీ చెయ్యాలి..." ఈ మాటలాతడు బుచ్చమ్మ నాకర్షించుకోవడానికన్నా, మరే ప్రయోజనమాశించి అన్నా అతనికున్న ప్రపంచజ్ఞానం గూర్చి తెలియజేస్తాయి.

బుచ్చమ్మ పెళ్ళి తప్పించడానికి అతడు లుబ్ధావధానికి రాసిన లేఖ అతని వ్యంగ్య వైభవానికి, ప్రతిభకు నిదర్శన మనడంలో సందేహం లేదు. గిరీశం మతం ప్రసక్తి, బకధ్యానం గూర్చి తన ప్రసంగాల్లో తీసుకొస్తాడు. అతడు వెంకటేశంతో "అన్ని మతాలు పరిశీలించి వాటి తాలూకు యఫెన్సు, విగ్గు తీసి ఓ క్రొత్త మతం యేర్పరచాను. అది అమెరికా వెళ్ళి ప్రజ్వలింపజేస్తాను." అంటాడు. చమకం గూర్చి వక్రభాష్యాలు చెబుతాడు. చుట్ట కాలిస్తే కోవిట్లోనే కాల్చాలంటాడు.

గిరీశం సంఘ సంస్కరణల గూర్చి, హిస్టరీ గురించి కూడా మాట్లాడుతుంటాడు. తన వాక్చాతుర్యంతో, విజ్ఞానంతో గొప్ప లాయరు, సంస్కారి, సౌజన్యమూర్తియైన సౌజన్యారావు పంతులునే బోల్తా కొట్టిస్తాడు. ఆంటినాచ్ ఉద్యమం గురించి, నెపోలియన్ గురించి పంతులుగారితో మాట్లాడి ఆతన్ని నమ్మిస్తాడు. తాను అన్నీ అసత్యాలే మాట్లాడుతూ కూడా సౌజన్యారావు పంతులుతో "అందరూ తమలాంటి పకీళ్ళే అయితే అసత్యమన్నది వుండనే వుండదండీ. నేను అసత్యం సహించను ..." అని తాను సత్యహరిశ్చంద్రుడి ఫోజు పెడతాడు. ఈతని తెలివితేటలు, విజ్ఞానం పంతులుగారి దగ్గర పరాకాష్ఠకు చేరుకుంటాయి. తాను వేశ్య నుంచుకొని నానా తిరుగుళ్ళు తిరిగినవాడయినా తనకు 'నెపోలియన్ అఫ్ ది ఆంటీనాచ్' బిరుదుందని పంతులు నమ్మేలా చెబుతాడు. జీవితకాలమంతా సోషియల్ రిఫార్మర్‌గా ఉందామనుకున్న తాను గురువు (వీరేశలింగం) గారి మాటలవల్ల బుచ్చమ్మను పెళ్ళి చేసుకుంటానికి ఒప్పుకున్నానంటాడు. మధురవాణి వల్ల గిరీశం బండారం బయటపడుతుంది. అప్పుడు పంతులుగారు గిరీశంతో "నెపోలియన్ అఫ్ ది ఆంటినాచ్ మీరేమె నెరుగుదురా?" అంటాడు వ్యంగ్యంగా.

'ఐ టర్న్డ్ ఆల్ టుగెదర్' అని 'ట్రూరింపెట్స్‌కి ట్వంటీ ఫోర్ అవర్స్ చాలు' అని బుకాయించ చూస్తాడు గిరీశం.

ఈ మాటలయినా ఆతని హృదయపు లోతుల్లోంచి వచ్చి వుంటే ఆతడు మారినట్టే. కాని తానిన్నాళ్ళుగా మాట్లాడుతున్న సహజరీతిలోనే అంటాడు. ఇంకా పంతులుగార్ని మభ్యపెట్టి పబ్బం గడుపుకోవాలనే చూస్తాడు. గిరీశం గూర్చి అసలు విషయం తెలుసుకున్న పంతులుగారు ఆతన్ని ఆషాఢభూతి, డెవిల్ అని తిడుతాడు. "పై పరీక్షలకు చదువుకో. నీ ప్రవర్తన బాగున్నంతవరకు ద్రవ్య సహాయం చేస్తాను. బుద్ధి తెచ్చుకొని బ్రతుకు" అంటాడు.

కాని గిరీశంకు బుద్ధొచ్చిందా? వచ్చి వుంటే, ఆతడు నిజంగానే పశ్చాత్తాపం చెంది వుంటే పంతులుగారి కాళ్ళపై బడి తనను క్షమించి బుచ్చమ్మతో పెళ్ళి జరిపించుమనేవాడు. కాని అలా అనకుండా గుమ్మం దిగి వెళ్ళిపోతూ తన పథకం పారలేదని "డామిట్ కథ అడ్డం తిరిగింది..." అని అనుకుంటూ లోకంలో పడుతాడు. ఆతడేమాత్రం మారడు.

ఇంత విజ్ఞానం, ఇన్ని తెలివితేటలు, వాక్చాతుర్యం, లోకజ్ఞానం, సమయస్ఫూర్తి ఉన్న గిరీశం వీటన్నిటినీ మంచి కోసం ఉపయోగించి వుంటే ఈ నాటకంలో ఆతడు తిరుగులేని నాయకుడు అయ్యుండెవాడు. బుచ్చమ్మతో పెళ్ళయి ఆతడు మళ్ళీ లోకంపై పడాల్సిన అవసరముండేది కాదు. కాని తనకున్న విజ్ఞానాన్నంతా గిరీశం తన స్వప్రయోజనాల కొరకే ఉపయోగిస్తాడు. పూట గడవడం కోసమే మందిని మోసం చేస్తాడు. తనలోని ఆత్మారాముణ్ని సంతోషపరచడానికే వినియోగిస్తాడు. అందువల్ల ఆతడు నాయకుడు కాలేదు. విషాద నాయకుడయ్యాడు - నకిలీ నాయకుడయ్యాడు. ఇంత విజ్ఞానఖనియైన గిరీశం ఇలా ప్రవర్తించడానికి కారణం ఆతడో శాపగ్రస్తుడై వుంటాడు.... యోగభ్రష్టుడై యుంటాడు. ఇదే గురజాడ అభిప్రాయమై వుంటుంది. అందువల్లనే గిరీశం ఇన్ని చెడ్డపనులు చేసినా ఆ పాత్రపై గురజాడకు సానుభూతుంది. అందుకే ఈ పాత్రవింత అద్భుతంగా చిత్రించాడు. ఇన్ని పనులు చేసినట్టు కనబడిన గిరీశం అందరితో తిట్లు తింటాడు. తుదకు బుచ్చమ్మను పెళ్ళి చేసుకోవడంలోనూ సఫలీకృతుడు కాడు. పాఠకులను (ప్రేక్షకులను) కడుపుబ్బ నవ్వించే ఈ యోగభ్రష్టునిపై కోపం కాక జాలి కలిగేట్టు చిత్రించాడు గురజాడ. తెలియక తప్పులు చేసిన లుబ్ధావధాని, వేశ్యయైన మధురవాణికి విముక్తిని ప్రసాదించాడు కాని యోగభ్రష్టుడైన గిరీశంకు (తెలిసి తప్పులు చేసాడు కాబట్టి) విముక్తిని ప్రసాదించలేదు గురజాడ. గిరీశం మారినట్టు అవాస్తవిక ముగింపు ఇచ్చివుంటే ఆ పాత్రపై అంత సానుభూతి వుండేది కాదు. తెలిసీ తప్పులు చేసిన గిరీశంకు నిష్కృతి లేకుండా చేసి ఆ పాత్రపై జాలి కలిగేట్టు చేసి ఆ పాత్ర పాఠకుల మనస్సుల్లో కలకాలం నిలిచిపోయేట్టు చేసాడు గురజాడ. నాటకమంతా తానే అయ్యి మనల్ని నవ్వించి, కవ్వించి మన సానుభూతి సంపాదించుకున్న గిరీశం యోగభ్రష్టుడు కాబట్టే పాపం బ్రతుకనివ్వండి అని మధురవాణితో అనిపించి వదలిపెడతాడు గురజాడ.

నాటక ప్రధాన ప్రయోజనానికి అంతగా ఉపయోగపడకున్నా, ఇంత ప్రాముఖ్యత గల పాత్రగా గిరీశంను చిత్రించడంలో గురజాడ ఉద్దేశ్యం ఇలాంటి గిరీశంల గూర్చి జాగ్రత్తగా ఉండమని పాఠకులను హెచ్చరించడానికే. ప్రపంచ నాటక రంగంలో అన్ని పాత్రలకూ స్థానమున్నట్టే నాటకంలో ఈ పాత్రకూ స్థానముంది. విజ్ఞాన సర్వస్వంలాంటివాడైన ఈ యోగభ్రష్టున్ని "పాపం బ్రతుకనిద్దాం...."

## ఉపయుక్త గ్రంథాలు :


1. కన్యాశుల్కం -గురజాడ, జయంతి పబ్లికేషన్స్.
2. దశరూపక సందర్శనం -యువభారతి ప్రచురణ
3. కన్యాశుల్క నాటక కళ -సర్దేశాయి తిరుమలరావు.

# తొట్ల ఊగింది

కన్నడ మూలం :

**కీ. శే. త. రా. సు.**

తెలుగు అనువాదం :

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

బయల్దేరేందుకు ముందు రఖుమా కడసారిగా తొట్లను ఒకసారి ఊచి, బడలిపోయి గాఢమైన నిద్రలో మైమరచి పడుకొని వున్న కొడుకును ఒకసారి తదేకంగా చూసింది.

రెండేళ్ళ పిల్లవాడు పట్టి ఎముకలగూడులా వున్నాడు. ఒకప్పుడు కండలు నిండుకుని వుండిన ఒంట్లో, ఉన్న కండలన్నీ కరగిపోయి, చర్మమంతా ముడుతలు పడి రెండేళ్ళకే డెబ్బై యేళ్ళ ముసలితనం వచ్చివుంది. కళ్ళు మూసుకుని పడుకున్న ఆ పసికందు బ్రదికిందని ఎవరూ చెప్పడానికి వీలులేని విధంగా వుంది. ఆ కళ్ళు రెండూ తెరచివుంటే మాత్రం ఒంట్లోని ప్రాణమంతా ఆ రెంటిలోనూ మినుకు మినుకుమంటూ వుంటుంది. కళ్ళు మూస్తే జ్వలిస్తూన్న దీపం ఆరిపోయినట్లే. బ్రదికినా కూడా చచ్చినట్లున్న, అలసి సొలసి పడుకున్న కొడుకును చూసి బరువుగా నిట్టూర్చింది రఖుమా.

బయట, ఆకులన్నీ రాలి, మోడువారిన అవిసెచెట్టు కొమ్మ మీద కూర్చున్న కాకి 'కావు, కావు' మంటూ కర్కశంగా, జీవనపు భయంకర సమరానికి మానవుడిని మేల్కొలుపుతున్న రణతూర్యంలా అరిచింది. దాని అరపు విని ముందున్న కర్తవ్యం జ్ఞప్తికి వచ్చినదానిలా రఖుమా బయలుదేరి తలుపు దాకా వచ్చింది.

తొట్ల కదలినట్లు తోచింది. మరొకసారి వెళ్ళి తొట్లనల్లాడించి, చింపిరిగుడ్డను పసివాడి శరీరం మూసుకునేటట్లు కప్పి, నాలుగు రక్షావచనాలు గొణిగి బయటికి వచ్చింది.

ఆమె బయటికి వస్తూన్నట్లే పూరిపాకమీద ఏమో ధ్యానం చేస్తూ కూర్చున్న నల్లపిల్లి చెంగున కిందికి దూకి, అంతదూరం పరుగెత్తి, వెనుదిరిగి మీసాలను నాక్కుంటూ ఆమెను తదేకంగా చూసి, 'మ్యావ్' అంటూ పరుగెత్తిపోయింది.

అది నేలకు దూకిన వేగానికి రఖుమా అదిరిపడి శపించింది, ఖరాబ్ రాండ్!'

ఆమె మాటలే ఆమెకు ఎవరో మాట్లాడినట్లు వినిపించింది. అంత నిశ్శబ్దంగా వుంది గూడెం. ఉన్న పది గుడిసెల్లోనూ, ఎక్కువభాగం గుడిసెల్లో వున్న పెద్దవాళ్ళందరూ రెండు మైళ్ళవతల సాగుతూన్న చెరువు మరమ్మతు పనిలో కూలీలుగా వెళ్ళివున్నారు. చేతనయ్యే పిల్లవాళ్ళూ వాళ్ళను వెంబడించి వెళ్ళారు. మిగిలినవాళ్ళు లోపలనే.

చడీ చప్పుడూ వినబడటం ఆగిపోయి ఆరు నెలలయింది. ఎప్పుడైనా, ఏమైనా చప్పుడు వినిపించిందంటే - అది ఏడ్పుదో, లేక తిట్లదో. ఆకలి మంటల్లో మాడిపోయిన ఆ ముఖాల్లో మానవత్వం కూడా మాసిపోయి వుంది. వాళ్ళలో మిగిలిందొకటే- ఆకలి బలాత్కారం, కడుపు పోరాటం. అదొకటే నిరంతర యుద్ధం.

బోసి గుట్ట వాలు ప్రక్కమీద వుంది గూడెం. రఖుమా బరువుగా అడుగులు వేస్తూ గూడేనికి వేసిన సీమకళ్ళి కంచెను దాటి, బయటికి వచ్చి నుంచుని చూసింది.

కనుమదారి చుట్టుకొని చుట్టుకొని దిగింది, బడలిక చెందిన వాని ఊపిరిలా. ఇంకా బలియని యెండ వెలుగులో, దినదినమూ ఎండకు ఉడికిపోయిన బాట బూడిద పరచినట్లు కనిపిస్తోంది. కళ్ళకు కనిపిస్తూన్న కొంచెం దూరమూ ఎన్నో వందలమైళ్ళ దూరంలాగా కనిపిస్తోంది ఆమె కళ్ళకు. నడవడానికి మొదలెట్టడానికి ముందే ఆయాసం ఆమె శరీరాన్ని ఆవరిస్తోంది.

అలాగని నిలుచుంటే జరగదు. నడవాలి. మూడు మైళ్ళు! ఎండ బలిసి నిప్పులవానగా అయ్యేందుకు ముందే నడిచి ఊరి నీడ చేరాలి. నడుద్దామంటే గట్టి నేలకూడా ఇసుకలా కాళ్ళను మింగుతోంది. అయితే మూడు రోజుల ఆకలి నిర్దయుడైన మేస్త్రీలా 'ఊఁ, నడు, ముందుకు' అంటోంది. ఆకలిగొన్న పసికందు తలపు అడుగులను పీకి ముందుకు పెట్టించింది.

రఖుమా బయలుదేరింది....

దారి నడవడం ఇప్పుడు ఆరునెలల బ్రదుకు నడిపినట్లే కష్టంగా వుంది. ఎక్కడైనా చెట్టు నీడను చూస్తే 'కూర్చో' అంటూంటుంది అలసిన శరీరం. అయితే ఆ రోజు ఊర్లో వున్న సర్కారు డిపోనుంచి గింజలు తేకుంటే, మళ్ళీ ఉపవాసం; నలిగిపోవాలి; తనకన్నా ఎక్కువగా ఆ పసికందు.

ఆ పసికందు ఏ పుణ్యం చేసి పుట్టిందో పాపిష్ఠది!

ఆ పసికందు పుట్టినపుడామెకు అలా అనిపించలేదు. అపుడెంత సంతోషం! తన బదుకు తీగలో తానే ఖిరియవేసిన పూవును తొలుతగా కళ్ళారా చూసినప్పుడు, ఈ సృష్టిలో తనలానే భాగం వహించిన మగడు జాత్ర్యాకు తానే చేతులనిండా ఎత్తుకుని కందును మొట్టమొదటిసారి చూపించినపుడు - నిజం, ఆ రోజు ఆమె పాలిటికి ఆ కందు నవ్వుతూన్న కళ్ళలోనే స్వర్గద్వారం కనిపించింది

రఖుమాకు పసికందుమీద ఎంతటి ప్రేమ వుండేదో, ఆమె తల్లి అయినాక ఆంతకన్న ఎక్కువగా పసికందు తల్లిమీద జాత్ర్యాకు ప్రేమ వుండేది. తాగడం వదలిపెట్టి ఆమె చెవులకు వెండి గొలుసులు చేయించాడు. చేతులకు దంతపుగాజులు వరుసలే తొడిగించాడు. పసివాడి తల్లి అయినాక ఆమె మృదువైన చేతుల్ని రాళ్ళు పగులగొట్టి ముగ్గుపిండి నూరడానికి వదల్లేదు జాత్ర్యా. ఇరుగు పొరుగు వాళ్ళలాగా ఆమె కట్టెల మోపుల్ని అమ్మేందుకు పోవడమూ అతనికి సహించదు. శ్రమించడానికి పురుషుడు తను ఉన్నాననేవాడు.

ముత్యంలాంటి మొగుడు జాత్ర్యా. మగవాడంటే అతడి పేరు చెప్పుకుని పుట్టాలి.

అలాంటి మగవాడు బెదరి కంగారుపడ్డాడు!

అతడొక్కడేనేమి? గూడెంలోని మగవాళ్ళందరూ ఆకాశం ముఖాన్ని చూస్తూ కూర్చున్నారు.

వాళ్ళకేమీ తక్కువగా లేదు. సర్కారు ఒక్కొక్కరికీ ఒకటీ, అరా ఎకరా పొలమిచ్చింది. దగ్గర్లోనే కట్టెలు సమృద్ధిగా ఉండే అడవి. అదీ తక్కువైతే గుట్టలో కనికిరాళ్ళకేం కొదవ లేదు.

దేవుడిచ్చినంత పండించుకుని హాయిగా పక్షుల్లా వున్నారు. అయితే వున్నదున్నట్లే దేవుడు వాళ్ళమీద కోపించుకున్నాడు-

ఒక ఏడాది పిచ్చిగా వానలు కురిసి, అరచేయి వెడల్పు కట్ట తెగిపోయి, ఒక చుక్క కూడా నీళ్ళు నిలువకపోయి, వాన వచ్చీ పంట కానరాకపోయింది. పొలముండీ కట్టెలమ్ముకొని బదకాల్సి వచ్చింది. వచ్చేఏడు దేవుడు కన్ను తెరవవచ్చునను కున్నారు.

మరుసటి యేడు దేవుడు కన్ను తెరిచాడు - చిచ్చరకన్ను! వాన చినుకు కూడా లేక నేలంతా బూడిదైపోయింది. తాగేందుకు నీళ్ళు లేవు. పండించుకునేందుకు వాన లేదు. ముంగారు వానలు ముగిశాయి.

దేవుడు కోపించుకున్నప్పుడే ప్రభుత్వానికీ కన్ను కుట్టాలా? మరెక్కడో కరువంటూ ఈ గూడెంలో గల సిరుపేదల విత్తనాల గింజల్ని తన్నుకుపోయారు. ఎంతగా బతిమాలు కున్నా వినలేదు. ఇది సరైన పంట పండించిన స్థలమని కరణాల లెక్కలు సాక్ష్యం చెప్పినాయట ప్రభుత్వానికి. దీనికి తోడు పోలీసువాళ్ళ బెదిరింపు కూడా.

ఆ రోజు ఆకాశం చుక్క రాల్చకపోయినా, గూడెంలోని ఆడవాళ్ళందరూ కన్నీళ్ళవాన కురిపించి నేలను తడిపారు. అయితే ఈ వానకు వేడెక్కిన భూమి పచ్చబడలేదు; బాధపడిన కడుపు మంటగా మండింది.

ఆ యేడు దీపావళినాడు ఎవరింటిలోనూ దీపం వెలుగులేదు; హోళీనాడు కోలాటపు గజ్జెల సద్దు వినిపించలేదు. ఊరిలోని యువకులతో రాసిక్యపు సుంకమెత్తడానికి ఏ ఆడదీ గూడెం వదలి బయటికి వెళ్ళలేదు.

ఆకాశంలో అలమని మొగిళ్ళు జనుల ముఖాలమీద అలమ నారంభించాయి. జాత్ర్యా కూడా మబ్బుపట్టిన ముఖాన్ని ధరించి ఉరిమాడు.

ఎవరేమి చేసినా కూడా గింజలు లేవు. తాగేందుకు నీళ్ళు, తినేందుకు మేతా లేక పశువులు ఒకటి తరువాత ఒకటి చచ్చాయి. కాకులకూ, గద్దలకూ విందు భోజనం దొరికింది. జనుల ఆకలి క్షణ క్షణ ప్రవర్థమానమైంది.

కడపటి కొకనాడు ఉన్నదున్నట్లే జాత్ర్యా మటుమాయ మయ్యాడు. మలనాడుకు కూలికి వెళ్ళాడన్నారు కొందరు. అయితే ఏ మాట నమ్మాలి?

జాత్ర్యా పరుగెత్తిపోయి ఒక వారమైంది. శ్రమించే భర్త తనే పరుగెత్తిపోయాక, నిరుపేద రఖుమా ఏం చేయగలదు? రెండు మూడు రోజులు ఇరుగు పొరుగు గూడేలవాళ్ళతో తిరిప మెత్తింది. నాల్గోరోజు అందరూ లేదన్నారు, ఇంకెక్కడనుంచీ నైనా గింజలు తేవాలంటే, పైసలు లేవు. జాత్ర్యా పోయేటప్పుడు ఇంట్లో వున్న అంతో ఇంతో వెండినీ చేతపట్టుకుని వెళ్ళివున్నాడు. ఇలా వుండడంచేత రెండురోజులు నిట్టుపవాసం చేయాల్సి వచ్చింది. ఆకలితో అలసిపోయిన బుద్ధికి దాన్ని అణచుకునే ఉపాయం కూడా తెలీలేదు.

చివరకు కడచిన సాయంత్రం గూడేనికి పెద్ద అయిన సోమ్లా నాయకుని దగ్గరికి వెళ్ళి, తన గోడు చెప్పుకుంది. ఆ ఆడదాని కరుణ కథ విని అతడు బాధపడ్డాడు. అయితే గింజలు అతని ఇంట్లో కూడా లేవు - ఇవ్వడానికి. ఆ రోజు కూలి డబ్బు చేతిలో వుంది. అందులోనే ఒక పావలా ఇచ్చి, పట్టణానికి వెళ్ళి, సర్కారు డిపోలో గింజలు కొనుక్కొని రా అన్నాడు.

ఎప్పుడు తెల్లవారుతుందో అని కనురెప్పలు వేయకుండా, అప్పుడప్పుడు లేచి, ఏడ్చే పిల్లవాడిని ఊచుతూనే, రేయి గడిపింది రఖుమా. తెల్లవారి లేచింది లేస్తూనే బయలుదేరింది. ఊరు దారి పట్టి.

దారి పిసినారి ధనంలా సముస్తూ వుంది....

పిల్లవాడు లేచి ఏడవవచ్చు. లేచి ఏడిస్తే ఆకలిగొన్న అనద పసివాడిని సమాధానపరిచేవాళ్ళెవరు?

ఆ పిల్లవాడో - కనుమూస్తే కూడా ఒక క్షణమే. మరు నిమిషమే అదిరిపడి లేస్తాడు....

పిల్లవాడిని గురించిన ఆలోచనలు ఆమె అడుగులకు వడిని నేర్పించాయి....

తుట్టతుదకు ఊరు కనిపించింది.

* * *

ఊరు! తనకూ, తన ఆకలిగొన్న పసివానికీ అన్నంపెట్టే ఊరు! ఊరి ముఖం కన్నంతనే ఆమెకు కడుపు సగం నిండినట్లయింది.

ఊరిలోకి కాలు పెట్టినంతనే హోటల్లోని వేడి తిండి సువాసన గమ్మని వచ్చింది. అందులోని గ్రామఫోను సంగీతం ఆమెను స్వాగతించింది. రఖుమాకు ఒంట్లో ఉత్సాహం నిండినట్లయింది.

దారిలో కనిపించినవాళ్ళను డిపో దారి అడుగుతూ అడుగుతూ పరుగెత్తింది డిపో దిక్కుకు.

నల్లని పలకమీద తళ తళలాడే వెండి అక్షరాల కిరీటం పెట్టుకుని వుంది డిపో! దానిముందు వందమంది జాతర. వెంకటరమణస్వామి తేరురోజు కూడా జనులు అంత శ్రద్ధగా నిలుచుండటం ఆమె చూడలేదు. ఎలా అయినా కానీ డిపో అన్న దేవత గుడే కదా?

ఎవరినో ఒకర్ని రఖుమా, "అన్నా, గింజల్యాడిస్తారు?" అంటూ అడిగింది.

"మొదలు చీటీ రాయించుకోవల్ల. ఆ కిటికీకాడికి పోయి దుడ్లిచ్చి, చీటీ రాయించుకొని రా." అంటూ దారి చూపించాడు అతడు.

రఖుమా అతడు చూపించిన కిటికీ దగ్గరికి పోయి నిలుచుంది. అయితే అక్కడ కూడా వరుసగా నిలబడ్డారు జనం. అలానే వాళ్ళమధ్య దూరుకుని కిటికీ దగ్గరికి పోవడానికి ప్రయత్నించింది. దగ్గరున్న పోలీసువాడు నిర్దాక్షిణ్యంగా రెక్కపట్టి ఈడ్చి, అందరికీ చివరగా నిలబెట్టి, ఇది 'క్యూ' అన్నాడు. క్యూనో, ఖ్యూనో ఆమెకేమీ అర్థం కాలేదు. ముందు నిలుచున్న వాళ్ళంతటి అదృష్టశాలి తను కాదనేది మాత్రం ఆమెకు అర్థమయింది.

ఆ క్యూ కరగడం చాలా ఆలస్యమైంది. అది ఆలస్యమౌతున్నకొద్దీ ఆమె తొందర ఎక్కువైంది....

చివరకు ఈమె వంతు వచ్చింది. కిటికీ దగ్గరికి పోయి, కమ్మీల కవతల పావలా పెట్టి, "అన్నయ్యా, చీటీ రాసి. పావలా రాగులకి." అంది.

తలెత్తకుండానే చీటీ రాస్తున్న గుమాస్తా, తలెత్తి చూడకుండానే, "కార్డేదీ?" అన్నాడు.

కార్డు? అదేమో ఆమె కర్థం కాలేదు.

"కార్డు కాదన్నయ్యా, రాగ్గింజలు కావల్ల." అంది రఖుమా.

ఈమె వింత వుత్తరం చూసి గుమాస్తా తలెత్తి చూశాడు. "కార్డు లేనోళ్ళకి ఈడ గింజలీరు" అన్నాడు.

ఆమె కదేమీ అర్థం కాలేదు. రాగులు కావాలి. దబ్బిచ్చింది. మధ్య ఈ కార్డువాళ్ళ తంటా ఏమి? తికమక పట్టి నిలుచుంది. వెనకాల వున్నవాళ్ళు 'పో' అంటూ తోశారు. అంతదూరం నడిచివచ్చి గింజలు లేకుండా తిరిగి వెళ్ళడమా?

"అన్నయ్యా, మూన్నాళ్ళనించీ పిల్లోనికి గంజి లేదు. పావలా గింజలీ, అన్నయ్యా, నీకు పుణ్యముంటుంది"

గుమాస్తా ఆమె దీనముఖాన్ని తదేకంగా చూశాడు. చూశే చూశాడు. ఏదో ఆకలి తీర్చుకునేవానిలా చూశాడు. కప్పను చూసిన పాము కళ్ళలా వాడి కళ్ళు మెరిశాయి. ప్రక్కన వున్న బంట్రోతును పిలిచి, వాడి చెవిలో ఏదో గుసగుసలాడాడు.

ప్రక్కన వున్న తలుపు తీసి బంట్రోతు బయటికి వచ్చి, రఖుమాను ఇవతలికి పిలిచాడు. గింజలిప్పిస్తాడేమోనని అనుకుని రఖుమా వాడివెంట వెళ్ళింది.

బంట్రోతు ఆమెతో చెప్పాడు. "కార్డు లేనోళ్ళకి ఈడ గింజలీరు."

"కార్డంటే ఏమన్నా?"

"ఏ వూరి గూడెం నీది?"

"బేతనాళ గూడెం."

"తనుకుగుట్ట దగ్గరుంది కదూ, అదేనా?"

"ఊనన్నా."

"ఇంతకుముందెప్పుడూ గింజలకి రాలేదా?"

"లేదు కదన్నా?"

"అందుకే కార్డంటే కండ్లు పెద్దవిగా చేస్తావు?"

"అట్లంటే ఏమన్నా?"

"సర్కారోళ్ళు ఒక్కొక్కరికిన్నే గింజల్నియల్నంటూ చీటీ ఇచ్చుంటారు. అదుంటేనే ఈడ గింజలిచ్చేది"

"అట్లయితే నాకి ఈడ గింజలిచ్చేకి లేదా?"

"లేదు పాపిడీ"

"నీ కాల్మొక్తా. ఒకిన్ని రాగ్గింజ లిప్పించన్నా. తెలీందాన్ని నేను. మూడ్దినాలుగా పిల్లోడుపాసం."

ఆ మాట చెప్తూతూ చెప్తుతూ ఆమె కళ్ళలో నీళ్ళువింంచింది.

బంట్రోతు ఆమె కష్టాన్ని చూసి కనికరించినవాడిలా మాట్లాడాడు.

"నీవు దూరంగా వుండు. నేనే స్వాములోళ్ని అడిగి చూస్తా. పాపం, మూడునాళ్ళుగా పిల్లోడుపాసమంటావు. స్వాములోళ్ళు మంచోళ్ళు. ఇచ్చినా యీవొచ్చు!"

"అంత చేయించన్నా, పుణ్యమొస్తాది." అంది రఖుమా కృతజ్ఞతాభార ధ్వనితో.

ఆమెను గుంపుకు అవతలగా నిలబెట్టి బంట్రోతు లోనికి వెళ్ళాడు.

రఖుమా అతడు రావడాన్నే కాచుకుని చూస్తూ వుంది.

కొంతసేపటి తర్వాత బంట్రోతు మళ్ళీ బయటికి వచ్చాడు.

"ఏమనిరన్నా?"

"శానా అడుక్కున్నాక సాయంత్రం కడాకు, అందరూ వెళ్ళిపోయినంక, డిపో తలుపులు మూసేటప్పుడు ఇస్తామని చెప్పినారు. కార్డు లేనోళ్ళకి గింజలిస్తే తల తీసేస్తారంట!"

"సాయంత్రం వరకూ కాచుకోని వుండల్నేమన్నా?"

"ఊఁ మరి. గింజలు కావల్లాంటే కాచుకోని వుండల్ల."

"గుడిసిలో పిల్లోణ్ణి ఒక్కణ్ణే పండబెట్టి వచ్చిండాను. ఇప్డే ఇచ్చేస్తే బలూపకారమయితుందన్నా"

"అదంతా కాదు. గింజలు కావల్లాంటే సాయంత్రం వరకూ ఉండల్ల. లేకుంటే అట్లేపో. మీ ఉపకారం చేసే కాలం కాదు." అంటూ కసురుకుని బంట్రోతు లోపలికి తిరిగి వెళ్ళాడు.

రఖుమా చల్లబడింది.

గుడిసెలో పసివాడొక్కడే. సాయంత్రం వరకూ ఇక్కడే వుంటే వాడి గతేమి? అలా అనుకుని వట్టి చేతుల్తో పోతే, వచ్చినందుకు ఏం చేసినట్టు? అలానే పోతే? - ఆకలి ఆమెను అపహాస్యం చేస్తూ వికారంగా నవ్వసాగింది.

దాని భయంకర స్వరూపాన్ని చూసి, అదిరిపడింది రఖుమా. ఆమె తీసుకోవాల్సిన నిర్ణయాన్ని భయమే తీసుకుంది. అదీకాక, సాయంకాలం లోపల మళ్ళీ మూడు మైళ్ళు వెనుదిరిగి వెళ్ళి, మళ్ళీ మూడు మైళ్ళు నడిచి రావడానికి అవుతుందా, ఆమెకు? బడలిపోయిన శరీరం ఇప్పుడే, ఇక్కడే, పడుకుంటే చాలునంటుంది. అయితే, పసికందుమీది ప్రేమ ఆమెను పల్లెవైపుకు ఈడ్చింది. తొట్లలో పడుకున్న శిశువు చిత్రం కనిపించి, 'రా' అంది. అలా అని ఆమె వట్టి చేతుల్తో వెళ్ళి, పాపడిని ముద్దుల్తో లాలిస్తే, వాడి ఆకలి తీరుతుందా?....

అయింది కానీ, సందెవేళ వరకూ ఉండి గింజల్ని తీసుకు పోవడమే సరైన పని అని నిర్ణయించుకుంది.

సూర్యుడు పెరిగి పెరిగి నడిమింటికెక్కి, డిపోకు వచ్చిన వాళ్ళంతా చెదిరిపోయారు. కాచుక్కూర్చున్న రఖుమా కూర్చునే వుంది.

వచ్చినవాళ్ళంతా వెళ్ళినాక, గుమాస్తా డిపో తలుపులు మూసుకుని వెళ్ళుతూండగా, అతడి వెంబడి వున్న బంట్రోతు రఖుమా వద్దకు వచ్చి, 'ఈడే వుండు. సందెకాడ గింజలిప్పిస్తా' అంటూ చెప్పాడు. బంట్రోతు ఆమెతో మాట్లాడుతూన్నపుడు, కొంత దూరంలో నిలబడిన గుమాస్తా ఆమెనే చూస్తూ వుండి, 'పాపం, శానా ఆకలిగొన్నట్లుంది. మధ్యాహ్నం నీవొచ్చేటప్పుడు ఒకింత తిండి తెచ్చిపెట్టు'. 'ఈడేవుండు, పాపిడీ. సాయంత్రం డిపో తలుపులు మూసినంక నీకు గింజలిస్తా. ఈ జనం ఎదురుగా ఇస్తే, నా తల తీసేస్తారు - సర్కారోళ్ళు. అయినా పాపం! పిల్లోడుపాసమంటే యేం చేయల్ల! చెప్పు. అందరికీ కష్టం.

అంటూ నాలుగు తీయని పలుకులు పలికి, ఆమెనే చూస్తూ, వెళ్ళిపోయాడు.

"మా గుమాస్తా అంటే ఏమనుకుంటివి? దేవుడట్లా మనిషి! చూస్తివా?" అంటూ చెబుతూ బంట్రోతు వెళ్ళిపోయాడు.

పెద్ద ఇత్తడి బీగం బిగించబడిన తలుపును చూస్తూ కూచుంది రఖుమా.

కడుపులో గడ్డ కడుతూన్న ఆకలి ఒకవైపు: నెత్తిమీద మండుటెండ. ఎండెక్కి మండినకొద్దీ ఆమె కడుపులోని ఆకలి తీవ్రరూపాన్ని ధరిస్తోంది. గడియ గడియ కొకసారి ఆకాశాన్ని చూపింది. ఆమె మనసేమో ఆత్రంతో పరుగడితోంది. కానీ ఆకాశం నడిమికి వచ్చిన సూర్యునికి ఏ తొందరా వున్నట్లు లేదు. ముందర పరుచుకున్న చావడి నీడలోనే ఒళ్ళు చాచి, గోడ కొరుగుకుని, కన్ను మూపింది. మండుటెండ వేడికి కళ్ళు అలసిపోయి, లోనికీడ్చుకుని పోతూన్నాయి. అది నిద్ర కాదు—మూర్ఛ. కళ్ళు మూసుకున్నంతనే కడుపులో కళపెళ ప్రారంభమయింది. నాల్క నీళ్ళు కావాలంది.

దగ్గర్లోనే వున్న ఇంటికి పోయి, ఇంటామెను పిలిచి, "తాగేకిన్ని నీళ్ళు పొయ్యి, అమ్మయ్యా." అంది. ఇంటావిడ నీళ్ళు పోసింది. ఆమె నీళ్ళు పోయడంలో చూపిన దయ, అన్నం పెట్టుమని బతిమాలించింది.

'ఒక ముద్ద కవళం పెట్టమ్మా, తల్లీ." అంటూ రఖుమా అయిదడుగుల శరీరాన్ని మూడు జేనెలు చేసుకుని అడుక్కుంది.

ఇంటావిడ దయామయి: బతిమాలిన నాలిక పడిపోనీ అని శపించలేదు; తాగిన నీళ్ళు విషం కానీ అంటూ తిట్టలేదు; లోనికెళ్ళి ఒక పిడుచ అన్నం తెచ్చిపెట్టింది.

గబ గబ తిని ముగించింది. కడుపు కొంత చల్లబడింది.

"అమ్మయ్యా, డిపో ఎంత పొద్దుకి మళ్ళీ తెరుస్తారు?" అంటూ అడిగింది.

"ఈ పొద్దు ఆదివారం. మధ్యాన్నం డిపో తెరవరు. మళ్ళా రేపే."

"అట్లయితే గుమాస్తా స్వాములోళ్ళు చెప్పిండారే. సందెకాడ గింజలిస్తానంటూ"

"ఏమో నాకు తెలీదు...." అంటూ ఇంటావిడ లోనికి వెళ్ళడానికి ప్రయత్నించింది.

"అమ్మయ్యా, మీ కడుపు చల్లగుణ్ణీ." అంటూ అన్నం పెట్టిన చేతిని దీవించి రఖుమా, మళ్ళీ డిపో దగ్గరికి పోయి, చావడి నీడలో కూర్చుంది.

ఇంటావిడ మాటలు విని ఆమెకు హృదయంలో సంశయం పడగెత్తి బుసకొట్ట ప్రారంభించింది. లేదనడాని కిష్టంలేక గుమాస్తా అబద్ధం చెప్పాడా? అయితే అప్పుడప్పుడే ఒకరి కరుణామృతాన్ని చవిచూచిన ఆమె హృదయం సంశయపు దుఃఖాన్ని అనుభవింప నిష్టపడలేదు. అయినా అలాగని తృప్తిగానూ, నెమ్మదిగానూ ఉండ నిష్టపడదు.

మనసులోని మథనమూ, అప్పుడప్పుడే తృప్తిపడిన బడలిన శరీరమూ, మండుటెండా - అన్నీ ఆమెను నిద్రాలోకం వైపుకు లాగుకున్నాయి. ఇష్టం లేకున్నా, రాత్రంతా నిద్రలేని కళ్ళు మూతపడ్డాయి. ఆమె ఆలోచనలు మెల్లమెల్లగా స్పష్టత నుంచీ నెమ్మదిగా అస్పష్టత అంచుల్లోకి జారుకున్నాయి....

చిమ్మచీకటి క్రమ్మింది. ఏదో భయం రూపం ధరించి నట్లుంది. ఎక్కడా ఏదీ కనబడదు. ఆ చీకటిలో పిల్లి కళ్ళు రెండు తళ తళలాడుతూన్నాయి. అపశకునపు భయాన్ని కలిగించే స్వరంతో పిల్లి 'మ్యావ్' అంటూ అరుస్తోంది. అది అరచినప్పు డొకసారి తొట్లలో పడుకొన్న శిశువు అదిరిపడి తొట్లనుంచీ బయటికి రావడానికి ప్రయత్నించింది.

అది పడనట్లు బిగువుగా హత్తుకుని పట్టుకుంది రఖుమా.

ఆమె శిశువును హత్తుకుని పట్టుకున్నకొద్దీ పిల్లి అరుపు వేగం పుంజుకుంటోంది. చుట్టూరా చీకటి దగ్గర దగ్గరగా అలుముకుంటూ వస్తోంది.

రఖుమా ఉన్మత్తశక్తి నుపయోగించి, శిశువును ఒత్తి పట్టుకుంది.

నల్లపిల్లి తారాస్థాయిలో అరచింది. చీకట్లు చిమ్ముకుని వచ్చాయి.

రఖుమా జారిపడే శిశువును తొట్లలోకి తోసింది.

అయితే శిశువు లేదక్కడ....

కెవ్వున కేకేసింది రఖుమా.

కళ్ళు తెరిచింది. ఎండవేడిమి తగ్గి దూరపుగుట్ట అవతలికి జారిన సూర్యుడు....

గుమాస్తా డిపో తలుపు తెరుస్తూన్నాడు. అతడు లోనికి వెళ్ళినాక అతడి వెంబడే లోనికి వెళ్ళిన బంట్రోతు, కొంతసేప టికి బయటికి వచ్చి, ఆమెను లోనికి పిలిచాడు.

అబద్ధం చెప్పలేదు ఇతడు. రఖుమా హృదయం కృతజ్ఞతా భారంతో నమ్రమైంది. లోనికి వెళ్ళింది.

ఈమె లోనికి వెళ్ళాక గుమాస్తా బంట్రోతుతో 'ఒక రూపాయి రాగ్గింజలు కొలిచిపెట్టు' అన్నాడు.

"రూపాయి లేద్సారు. పాపలానే ఉంటేద...."

"పరవాలేదు పాపిడీ. నీవు దుడ్లేమీ ఈవొద్దు."

ఆ మాటాడేం బదులు చెప్పాలో రఖుమాకు తోచలేదు. బదులు చెప్పలేదు. బంట్రోతు గింజలు తెచ్చేందు కెళ్ళాడు. బంట్రోతు వెళ్ళాక గుమాస్తా తనే తలుపులు మూసాడు. రఖుమా ప్రశ్నార్థకంగా గుమాస్తావైపు చూసింది.

"ఎవరైనా చూసేరు, పాపిడీ." అంటూ గుమాస్తా ఆమె చూపును తనవైపుకు తిప్పాడు - ఆమెను రెప్ప వేయకుండా చూస్తూ.

ప్రకృతి యొక్క అన్ని కష్టసుఖాలకూ గురియై భోగంగా పెరిగినట్టి, గోధుమరంగు ఒంటి నిగనిగలు గల, లంబాడి సుందరి అంగలావణ్యం గుమాస్తా శరీరాన్ని వేడెక్కించింది. అతడి చూపులోనే భోగ లాలసతకు సంబంధించిన జ్వాల వుంది.

రఖుమా శరీరం ఆమెకు తెలియకుండానే కంపించింది. కళ్ళల్లో ప్రశ్నకు బదులుగా భయం చోటు చేసుకుంది. పెదవులు కంపించి విచ్చుకున్నాయి.

గుమాస్తా ఆమెను బాహుపంజరంలో బిగించాడు.

రఖుమా కేకెయ్య ప్రయత్నించింది. పెనగులాడింది.

భోగశాలియైన పురుషుని భుజబలానికి, బలశాలియైనా ఆడది సరితూగగలదా?

"ఊరుకుంటే గింజలు. గలాటా చేసి, ఆకలిగొన్న శిశువు నోట్లో దుమ్మేయొద్దు!"

శిశువు.... శిశువు... ఆకలిగొన్న శిశువు. తన తనువు లోనే వికసించిన పూవు.... శిశువు ...

* * *

రాత్రి చీకటి బలిస్తూ వుంది - పండు తిని విత్తనాన్ని ఉమ్మి వేసినట్లు, నగరం రఖుమాను బయటికి గెంటివేసినపుడు.

ఆమె ఒళ్ళు మండుతోంది. బుద్ధి ప్రళయవేగంతో తిరుగు తోంది. కొనవూపిరిని బిగబట్టినట్లు గింజల్ని కౌగిలించుకుంది ఆమె భుజం.

ఆమె హృదయంలో చెలరేగుతూన్న ఆందోళన ఆమె నడకకు ఎక్కడ లేని వేగాన్ని తెచ్చిపెట్టింది. పిచ్చి పట్టిన దానిలా, ప్రవాహంలో చిక్కుకున్న దానిలా, గూడెంవైపుకు పరుగెత్తింది రఖుమా.

తొట్లలో పడుకున్న శిశువు చేతులు చాచి ఏడుస్తోంది. 'ఆకలి ... అమ్మా.... ఆకలి.'

పెరుకుంటూన్న చీకటిలో రఖుమా గూడెంవైపు పిచ్చి దానిలా ఉరికింది.

చెదరిన కురులూ, నలిగిన బట్టలూ - సుడిగాలి వెన్నంటిన ఎండుటాకు. రఖుమా మనిషిగా లేదు. ఆడదిగా లేదు. రెండూ కొంతసేపటి క్రితమే హత్య చేయబడ్డాయి.

ఆమెలో మిగిలివున్న దొకటే - తల్లితనం!

అది ఆమెను గూడెం వేపుకు వాయువేగంతో లాగుతోంది.

'మా....మా....మా' శిశువు కేక పిలుపనే పిలిచింది.

రఖుమా మెదడు పలు రకాలయిన తీవ్రభావాల చక్ర తీర్థంలో, క్షణానికొక దిక్కుగా తిరుగుతోంది.

మానం పోయింది.... గింజలు చిక్కి - శిశువు ప్రాణం దక్కింది. అది సరైందా? ఇది తప్పా....

మూసిన తలుపును సుడిగాలిలా తోసి, గుడిసెలోకి చొర బడింది. ప్రమిద ముట్టించిందే తడవుగా - 'మేత్యా' అంది.

మౌనపు నిరుత్తరతే ఆమె పిలుపుకు ప్రత్యుత్తరమైంది. భూతగణంలా ఆ మౌనం ఆమెమీద దాడిచేసింది. తల్లి తల్ల డిల్లింది.

తొట్లవద్దకు వెళ్ళి చూసింది. శిశువు పడుకుంది.

ఏదో శక్తి ఆమె శిశువును లేపేందుకు ప్రేరేపించింది. అవ్యక్త భీతి కోటి చేతులతో ఆమె గుండెను పిండుతోంది.

'మేత్యా....రే....మేత్యా....'

శిశువును లేపడానికి కదిలించిన వేగానికి తొట్ల ఆడింది. తెరచిన తలుపుద్వారా గాలి నిర్భయంగా తోసుకుని వచ్చి, ప్రమిదలోని వెలుగుమొగ్గను చెనకింది. 'కల్లు తాగినలాగ దీపం మొగ్గ అటునిటు తిరుగుతూ ఎగుర్లాడింది. తొట్ల నీడా, రఖుమా

నీడా గుడిసె పైకప్పుమీదికి కుప్పించి యెగిరి, నేలమీద ప్రాకి, మళ్ళీ పైకప్పు మీదికే కుప్పించాయి.

శిశువు లేవలేదు. ఎంత కదిలించినా అది సద్దు చేయలేదు. రఖుమాకు ఊపిరాడడం నిలిచిపోయింది.

నక్కి చూచింది రఖుమా. శిశువు శరీరాన్ని కప్పిన చింపిరిగుడ్డను పీకిపారవేసి చూసింది. తొట్లలో పడుకుని వున్నది శిశువు కాదు - మంచుగడ్డ! శిశువు నోటిప్రక్కల్లో నురుగు కారి; ఎండిపోయి వుంది.

జగత్తే ఒక క్షణం స్తబ్దమైపోయింది.

ఉన్నదున్నట్లే 'మ్యావ్' అంది పిల్లి బయటినుంచి.

చావు పిలుపు విన్నట్లు తిరిగి చూసింది రఖుమా.

తలుపుకు ఆవతల చీకట్లో ఒళ్ళు కనరాని నల్లపిల్లి కళ్ళు తళతళ తీవ్రంగా వెలుగుతున్నాయి.

'మ్యావ్, మ్యావ్, మ్యావ్'

కెవ్వున కేకేసింది రఖుమా!

'మ్యావ్, మ్యావ్, మ్యావ్'

చచ్చిన శిశువు ఏడ్చి, వెక్కిరించినట్లయింది రఖుమాకు. అనుకోకుండానే ఆమె కళ్ళు గింజల మూటమీద పడ్డవి.

గాలి విపరీతమై, దీపం మొగ్గ ప్రళయనృత్యం చేయనారంభించింది. నీడలూ దానితో వంతపాడాయి. బయట పేరుకున్న చీకటి 'లోనికి వచ్చేదా?' అంది.

'మ్యావ్.... మ్యావ్....'

పక పక నవ్వింది రఖుమా.... నవ్వే నవ్వింది....గుండె పగిలిపోయేట్టు పిచ్చి పిచ్చిగా నవ్వింది.

దీపం పిచ్చి పిచ్చిగా నృత్యం చేస్తోంది. నీడలూ అంతే. చీకటి తోసుకొచ్చింది....

రఖుమా చేయి ఉన్మత్తవేగంతో తొట్లనూస్తోంది.

తొట్ల యిద్దెనందేటట్లు పూచింది. దాని వేగానికి దీపమారిపోయింది.

అయితే రఖుమా చేయి మాత్రం తొట్లను ఊచుతూనే వుంది.

---

# తగిన ఫలితం

ఈ భవబంధాల బారినుండి బయటపడాలని
'ప్రభూ! నన్ను చేరదీయి' అని వేడుకున్నాను
చిరునవ్వు నవ్వి అంగీకరించాడు.
చిత్రం! అతడి కౌగిలిలో ఉన్నా తీరని విరహం!
ఎంత పిచ్చిదాన్ని నేను!
నాడు బాధలు బాపుకోవాలనే ఆశించాను కానీ
ఏ ఒక్కక్షణం అతణ్ణి నిస్వార్థంగా ప్రేమించాను?
నేడు అతడు దక్కినా అతడి ప్రేమ పొందలేనందుకు
దీనంగా రోదిస్తున్నాను
మళ్ళీ చిరునవ్వు నవ్వుతున్నాడు ప్రభువు!!

శ్రీ అనంత వేంకటేశన్

# మనసా వాచా!

నవ్వును కాను నిప్పురవ్వను
నీరవాన్ని కాల్చి నిశ్శబ్దాన్ని చీలుస్తాను
గువ్వను కాను వెలిగే దివ్వెను
చీకటిని చీల్చి శోకాన్ని ప్రేలుస్తాను
కలల పట్టు కుచ్చు భావాలను
కాగితం మీద పెట్టను
కళామతల్లిని కలలో కూడా తిట్టను
కష్టించే చేతిలో క్రాంతి బావుటానై నిలుస్తాను
కన్నీటి లోకాన్ని ప్రేమతో గెలుస్తాను.

శ్రీ సి. బి. కృష్ణ

డాక్టర్ సి. వి. రామచంద్రరావు

# అర్జున విషాదయోగం - అశోక విషాదయోగం

క్రీ.పూ. మూడో శతాబ్దంలో మౌర్యచక్రవర్తి అశోకుడు తన ప్రజల సుఖశాంతులను, ధర్మోన్నతిని కాంక్షించి, శాశ్వతంగా ఉండే రీతిలో, శిలాక్షరంగా వేయించిన ధర్మశాసనాలు భారతదేశ శాసన వాఙ్మయంలో అపూర్వమైనవి. అశోక చక్రవర్తి జీవిత విశేషాలను గూర్చి, చరిత్రను గూర్చి, అతని కాలంలోని పాలనా విశేషాలను గూర్చి, సాంఘిక, మత పరిస్థితులను గూర్చి, అన్నిటికీ మించి అతను తన సామ్రాజ్యంలోనూ, ఇరుగు పొరుగు రాజ్యాలలోనూ వ్యాప్తి చేయటానికి సంకల్పించిన ధర్మాన్ని గూర్చి అనేక విషయాలను ఈ శాసనాలు మనకు విదితపరుస్తాయి. ఈ అశోక శాసనాలు భారతీయ సనాతన ధర్మ ప్రతీకలు. అశోకుడు వీనిని 'ధర్మ లిపులు' 'ధర్మ శ్రవణాలు' అని పేర్కొన్నాడు. అఖండ భారతాన్నంతా ఆక్రమించి ఉన్న తన సామ్రాజ్య ప్రజల నుద్దేశించి ఈ శాసనాలలో అశోకుడు పొందుపరచిన ధర్మాన్ని పండితులు 'అశోక ధర్మ' మని పిలిచారు. ఈ అశోకధర్మం భారతీయ సనాతన ధర్మంకంటె వేరయినది కాదు.

ధర్మ స్వభావాన్ని, సనాతన ధర్మ స్వరూపాన్ని ఆర్ష గ్రంథాలు ఇట్లా నిర్వచించాయి.

'విద్వద్భి స్సేవితః సద్భిర్నిత్య మద్వేష రాగిభిః,
హృదయే నాభ్యను జ్ఞాతో యో ధర్మస్తం నిబోధత'
—మనుస్మృతి, 2:1

'సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః' —మనుస్మృతి, 4:138

'నహి వెవేనవేరాణి
సమ్మంతి ధకు దాచనమీ
అవెవేనచ సమ్మంతి
ఏస ధమ్మో సవన్తనో' —ధమ్మపద 1:5

"ధంమే సాధూ కియం చు ధంమేతి అపాసినవే
బహూ కయానే దయా దానే సచే సోచయే."

—ప్రాకృత మూలం ("ధర్మః సాధుః కియాంస్తు ధర్మ ఇతి అపాస్రవో బహు కల్యాణం దయా దానం సత్యం శౌచమ్". —సంస్కృతచ్ఛాయ)

—అశోక ధర్మశాసనం : రెండో స్తంభ శాసనం

"అహింసా పరమో ధర్మః"

భారతీయ సనాతన ధర్మానికంటె వేరు కాని ఈ అశోక ధర్మ స్వభావాన్ని తెలుసుకోవటానికి ముందు, ఆ అశోకధర్మం రూపు గొనటానికి నేపథ్యంగా ఉన్న పరిస్థితిని ఇక్కడ సమీక్షిస్తాం.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో అర్జున విషాదయోగం వలె, కళింగ యుద్ధక్షేత్రంలో* అశోక విషాదయోగం ఏర్పడింది. హింసా విముఖమై, కృపయా విష్టమైన హృదయంతో, తీవ్రమైన అనుతాపానికి లోనైన ఒకానొక మానసిక స్థితినుంచి బయటపడ టానికి నరునకు, నారాయణుని బోధ ఉపకరించింది; ఫలితంగా భారతీయులకు 'భగవద్గీత' వారసత్వంగా నిలచిపోయింది. అట్టి మానసిక స్థితినుండే బయట పడటానికి అశోకునకు బుద్ధ వచనం ఉపకరించింది; ఫలితంగా 'అశోక ధర్మం' భారతీయులకు వారసత్వంగా నిలచిపోయింది. కృష్ణుడు, బుద్ధుడు ఇద్దరు కామ్య కర్మలను నిరసించినవారే. కృష్ణుని బోధవల్ల అర్జునుడు, బుద్ధ వచనంవల్ల అశోకుడు సమదర్శులు అయినారు. ఈ సమదర్శిత్వమే అర్జునుని యుద్ధోన్ముఖుని, అశోకుని యుద్ధవిముఖుని చేసింది. తాను కురుక్షేత్ర యుద్ధరూపంలో చేయబోవు హింసను తలచి అర్జునుడు.

---

* అశోక చక్రవర్తి, తన రాజ్యాభిషేకం ఎనిమిదవ ఏట, (అంటే క్రీ.పూ. 260లో) కళింగం మీద దండెత్తి దానిని జయించినట్లు తన 13వ శిలాశాసనంలో చెప్పి ఉన్నాడు.

"న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖానిచ
కింనో రాజ్యేనగోవింద కిం భోగై ర్జీవితేనవా
యేషా మర్థే కాంక్షితంనో రాజ్యంభోగ స్సుఖానిచ,
త ఇమేఽవ స్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ
ఆచార్యాః పితరః పుత్రాః స్తథైవచ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్రాః శ్యాల స్సంబంధిన స్తథా
ఏతాన్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్య రాజ్యస్యహేతోః కిన్ను మహీకృతా"

(భగవద్గీత, అర్జున విషాదయోగం, శ్లో. 32-35లు)

ఇత్యాదిగా శోక సంవిగ్న మానసుడై తన యుద్ధవిముఖత్వాన్ని,

"యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్"

(అదే. శ్లో. 16)

-అని కృష్ణునికి తెలియబరచాడు. గురువులను, పెద్దలను సంహరించి అనుభవించే రాజ్యభోగాలనే రక్తపు కూటికంటే భిక్షాన్నం మేలని,

"గురూ నహత్వాహి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహలోకే,
హత్వాఽర్థ కామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్"

(అదే, సాంఖ్యయోగం, శ్లో. 5)

తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

ఇక, తాను కళింగ యుద్ధరూపంలో కావించిన అపార హింసాకాండను తలచి అశోకుడు అంటున్నాడు.

"(1) అఠ వషాభిషితషా దేవానం పియష పియదషినే లాజినే కలిగ్యా విజితా (2) దియఢమితే పానషత షహసే యే తఫా అపవుఢే శతషహషమితే తత హతే బహుతావతకే వా మటే (3) తతో పఛా అధునా లధష కలిగ్యేషు తివే ధంమవాయే ధంమకామతా ధం మానుషథి చా దేవానం పియషా (4) షే అథి అనుషయే దేవానం పియషా విజినితు కలిగ్యాని (5) అవిజితం హి విజినమనే ఏతతా వధ వా మలనే వా అపవహే వా జనషా షే బాఢ వేదనియముతే గులు ముతే చా దేవానాం పియషా (6)ఇయం పి చు తతో గులు మత తలే దేవానం పియషా (7) య తతా వషతి బా భనా వ షమవా అనే వా పాశండ గిహిథా వాయేశు విహితా ఏష అగభుతి షుషుషా మాతా పితి షుషుషా గులు షుషుషా మి తషంథుత షహాయా-నాతికేషు దాశభటకషి షమ్యా పటిపతి ధిడ భతితా తేషం తతాహోతి ఉపఘాతే వా వధేవా అభిలతానం వా వినిఖమనే (8) యేషం వాపిషు విహితానం షినేహే) అవివహినే ఏతానం మితశం థుతుష హాయనాతిక్య విషయనం పాపునాత తతాషే పి తానమేవా ఉపఘాతే హోతి (9) పటిభాగే చా ఏష షవ మనుషానం గులుమతే చా దేవానం పియషా (10) నథి చా షే జనపదే యతా నథి ఇమేనికాయా అనతా యోనేషు బంహ్మనే చా షమనే చా నథి చా కువాపి జనపదషి యతా నథి మనుషానం ఏకతలషి పి పాషండషి నో నామ పసాదే (11) షే అవతనే జనే తదా కలింగేషు లధేషు హతే చా మటే చా అపవుఢే చా తతో షతే భాగే వా షహష భాగేవా అజ గులుమతే వా దేవానం పియషా" —ప్రాకృత మూలం, 13వ శిలాశాసనం

"(1) అష్టవర్షాభిషిక్తస్య దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః కళిఙ్గా విజితాః (2) అధ్యర్థమాత్రం ప్రాణశత సహస్రం యత్తతోఽపవ్యూఢం శతసహస్ర మాత్రాస్తత్ర హతా బహుతావత్కా మృతాః (3) తతః పశ్చాదధునా లబ్ధేషు కలిఙ్గేషు తీవ్రం ధర్మపాలనం ధర్మ కర్మ చ ధర్మాను శిష్టిశ్చ దేవానాం ప్రియస్య (4) తదస్త్యమశోచనం దేవానాం ప్రియస్య విజేతుః కలిఙ్గాన్, (5) అవిజితం హి విజితమన్యో యత్తత్ర వధో వా మరణం వా అపవాహో వా జనస్య, సవదో వేదనీయమతో గురుమతశ్చ దేవానాం ప్రియస్య. (6) ఇదమపి తుతతో గురుమతతరం దేవానాం ప్రియస్య. (7) తత్రహి వసన్తి బ్రాహ్మణా వా శ్రమణా వా అన్యే వా పాషణ్డా గృహస్థా వాయేషు విహితైషా అగ్ర్య వృద్ధ శుశ్రూషా మాతా పితృ శుశ్రూషా గురూణాం శుశ్రూషా మిత్ర సంస్తుత సహాయ జ్ఞాతిషు దాసభృతనేషు సమ్యక ప్రతిపత్తిర్ధృఢభక్తితా, తేషాం తత్ర భవతి ఉపఘాతో వా. వధోవా అ భిలా ర్తానాం వా లినిష్క్రమణ. (8) యేషాం వాపి సంహితానాం స్నేహః అవిప్రహీణ ఏతేషాం మిత్ర సంస్తుత సహాయ జ్ఞాతియా వ్యసనం ప్రాప్నువన్తి తత్సోఽపి తేషామేవో పఘాతో భవతి. (9) ప్రతి భాగం చైతత్ సర్వమనుష్యాణాం గురుమతం చ దేవానాం ప్రియస్య. (10) నాస్తి చ సజ్యపదో యత్ర నసన్తీమే నికాయా అఙ్జాప్తా యేనైష బ్రాహ్మణే వా శ్రమణే వా ఇహనాస్తి చ క్వాపి జనపదే యత్ర నాస్తి మనుష్యాణామేక తరస్మిన్నపి పాషణ్డే న నామప్రసాదః, (11) యావాజ్జన స్తదా కలిఙ్గేషు లబ్ధేషు హతశ్చ మృతశ్చాప వ్యూఢశ్చ తతః శతభాగోవా సహస్రభాగోవా అద్య గురుమత ఏవ దేవానాం ప్రియస్య." —సంస్కృతచ్ఛాయ, 13వ శిలాశాసనం

"(1)దేవతా ప్రియుడయిన ప్రియదర్శిరాజా పట్టాభిషిక్తుడయిన ఎనిమిదో ఏట కళింగరాజ్యం అతనిచే జయింపబడింది. (2) లక్ష యాభై వేల జనులు ఆ రాజ్యంనుంచి పంపివేయబడినారు. లక్షమంది అక్కడ చంపివేయబడినారు. అక్కడ అంతకంటె ఎన్నోరెట్లమంది చనిపోయారు. (3) తర్వాత కళింగ రాజ్యం స్వాధీనమై వున్న ఇప్పుడు దేవానాం ప్రియుడు తీవ్రంగా ధర్మపాలనాన్ని, ధర్మకర్మలను ధర్మానుశాసనాన్ని చేస్తున్నాడు. (4) కళింగులను జయించిన దేవానాం ప్రియునికి ఇట్టి అనుతాపం కలిగింది. (5) జయింపబడని ఒక రాజ్యం జయింపబడినప్పుడు అందు జనుల వధ, మరణం, ఇతర దేశాలకు పంపబడుట జరుగుచున్నవనటం దేవానాం ప్రియునికి బాధాకరంగాను, శోచనీయంగాను తోస్తున్నది. (6) కాని ఈ కిందివి దేవానాం ప్రియునికి మరింత శోచనీయాలు. (7) అక్కడ నివసించేవారిలో పెద్దల (ఉద్యోగస్థుల) శుశ్రూష, మాతా పితృ శుశ్రూష, గురు శుశ్రూష, స్నేహితులు, పరిచితులు, సహచరులు, బంధువులు, దాసులు, భృత్యులు అయిన వారియెడల ప్రతిపత్తి, దృఢభక్తి, కలిగిఉండే బ్రాహ్మణులు, శ్రమణులు, ఇతర శాఖలవారు గృహస్థులైనవారు ఉంటారు. అట్టివారికి బాధ, వధ, తమ తమ ప్రియులైనవారికి పరదేశ గమనం సంభవిస్తుంది. (8) తమకు అత్యంత ప్రియులైన స్నేహితులు, పరిచితులు, సహచరులు, బంధువులు అయినవారికి బాధ కలుగుతున్నప్పుడు తమ స్థితి బాగుండినా, వారి బాధ తమకూ బాధాకరమే అవుతుంది. (9) ఈ బాధ అందరిచేతా పంచుకోబడుతుంది. ఇది దేవానాం ప్రియునికి శోచనీయంగా ఉంది. (10) యవనులలో తప్ప తక్కిన అన్ని దేశాలలోను బ్రాహ్మణులు, శ్రమణులు ఉన్నారు. ఏదో ఒక శాఖకు చెందని మనుష్యులు లేని దేశమే లేదు (11) అందుచేత, కళింగ రాజ్యాన్ని జయించినప్పుడు ఆ దేశ జనులలో నూరో వంతుమంది కాని, వెయ్యోవంతుమంది కాని వధింపబడో, మరణం పొందో ఉందురని తలంచుకొన్నప్పుడు దేవానాం ప్రియునికి శోకం కలుగుతున్నది."

—తెలుగు అనువాదం, 13వ శిలాశాసనం

ఇంకను, అశోకుడు తన పుత్ర, పౌత్రుల నుద్దేశించి అంటున్నాడు:

"ఏతాయే చా అఠాయే ఇయం ధంమ లిపి లిఖితా కితిపుతా పపోతా మే అసు....నవం విజయ మ విజయ తవియ మనిషషయ కషినో విజయషి ఖంతి చా లహుదండతా చా లో చేయ తమేవ చా విజయం మనతు యే ధంమ విజయే"

—13వ శిలాశాసనం - ప్రాకృత మూలం

"ఏతస్మై చార్థాయేయం ధర్మలిపిర్లిఖితా, కిమితి పుత్రా ప్రపౌత్రాః మే శృణుయుః సర్వం విజయ మా విజేతవ్యం మన్యేరన్ శరాకర్షినో విజయే శాన్తించ లఘు దణ్డతాం చే లో చ యన్తాం తమేవ విజయం మన్యన్తాం యోధర్మవిజయః"

—సంస్కృతచ్ఛాయ

"ఇంతకుముందు కలిగిన జయము చాలును. కొత్త దేశాలను జయింప అక్కరలేదు. తమకు కొత్త జయం పొందవలెననే కోరిక కలిగిన యెడల తాము దయ కలిగి చిన్న శిక్షలను మాత్రమే తాము అవలంబింపవలెను. ధర్మ విజయమే నిజమయిన విజయమని తాము తలంచవలెను' అని నా పుత్రులు, ప్రపౌత్రులు విందురుగాక అనే ఉద్దేశ్యంతో ఈ ధర్మలిపి లిఖింపబడింది."

—తెలుగు అనువాదం

భగవానుడైన కృష్ణుడు ప్రవచించిన సమదర్శిత్వము అధిభౌతికము; చక్రవర్తి అశోకుడు నిర్వచించిన సమదర్శిత్వము భౌతికము. నారాయణుడు నరునకు అనుగ్రహించిన సమదర్శిత్వము దేశకాలాద్యనవచ్ఛిన్నమయినది; అశోకుడు సుగతుని నుంచి గ్రహించిన సమదర్శిత్వము దేశకాలావధి అయినది. కావుననే కృష్ణార్జునులు పురాణ పురుషులు; తథాగతాశోకులు చారిత్రక పురుషులు. కావుననే అర్జునుడు విన్నది 'యోగ శాస్త్రము', అశోకుడు చెప్పినది 'ధర్మశ్రావణము'.

శిలాక్షర రూపమై, శాసనస్థమైన 'అశోక ధర్మా'న్ని విపులంగా తరచి దానిలో సారభూతమయిన విషయాన్ని గ్రహించినపుడు అశోకధర్మం ఈ కింది నైతిక సూత్రాచరణతో కూడినదని తెలుతుంది. ఈ సూత్రాలను గురించి, అశోకుడు, "ఈ శాసనాలలో కొన్ని కొన్ని భాగాలు మిక్కిలి మధురాలై ఉండటంచేత, జనులు వాటి ప్రకారం నడచుకొంటారని మరల మరల రాయబడినాయి" ("అథి చా హేతా పునపునా లపితే తష అథషా మధులియాయే యేన జనే తథా పటిపజేయా."—ప్రాకృత మూలం, 14వ శిలాశాసనం; "అస్తి చాత్ర పునః పునర్లిఖితం తత్తస్య తస్యార్థస్య మాధుర్యాయ యేన జనస్తథా ప్రతిపద్యేత" —సంస్కృతచ్ఛాయ) అశోక ధర్మానికి సారభూతమైన సూత్రాలు ఇవి:

1) తల్లిదండ్రులకు శుశ్రూష [శిలాశాసనం (శి.శా), 3, 11, స్తంభశాసనం (స్తం.శా). 7; లఘు శిలాశాసనం (ల.శి.శా), 2]

2) గురు శుశ్రూష స్తం.శా. 7).

3) పెద్దల యెడల, మహాత్ముల యెడల భక్తి(శి.శా.9)

4) బ్రాహ్మణుల, శ్రమణుల, దీనుల, వృద్ధుల, దాసుల, భృత్యుల యెడల అనురాగం (స్తం.శా. 7)

5) శ్రమణులకు, బ్రాహ్మణులకు, బంధువులకు, స్నేహితులకు, పరిచితులకు దానం (శి.శా, 3, 9, 11)

6) దాసుల, భృత్యుల యెడల ప్రతిపత్తి (శి.శా. 9, 11)

7) ఇతరులను భయపెట్టకుండుట, వారిని చంపకుండుట (స్తం.శా. 7)

8) సర్వభూతాలకు బాధ కలిగించకుండుట, ప్రాణి హింస చేయకుండుట (శి.శా. 3, 11, 13; స్తం.శా. 7)

9) నిగ్రహం కలిగి సమస్త జనుల యెడలా సమబుద్ధితో సంచరిస్తూ సంతోషంగా ఉండటం (శి.శా. 13)

10) అల్పవ్యయం, అల్పసంపద కలిగి ఉండడం(శి.శా.3)

11) అపకారం చేసినవానిని క్షమించడం (శి.శా. 13)

సనాతన ధర్మ ప్రతిపాదితాలైన ఈ నైతిక ప్రవర్తనా సూత్రాలతో కూడిందే అశోక ధర్మం. దీనిని ఆచరించటమే సాధువని (శి.శా. 3), ధర్మవ్రతమని (శి.శా. 9, 11), ధర్మ విజయమని (శి.శా. 13) అశోకుడు పదే పదే చెప్పాడు. ధర్మం సాధువయినదని చెప్పి, ఆ ధర్మం ఎట్టిదనే ప్రశ్నకు సమాధానంగా, "ధర్మంలో పాపాలు ఉండవు. దయ, దానం, సత్యం, శౌచం, అనే చాలా కల్యాణగుణాలు అందు చేరి ఉన్నాయి" ("ధంమే సాధూకియం చు ధంమేతి అపాసినవే బహు కయానే దయా దానే సచే సోచయే." స్తంభ శాసనం. 2, ప్రాకృత మూలం; "ధర్మః సాధుః కియాంస్తు ధర్మ ఇతి అపాస్రవో బహుకల్యాణం దయా దానం సత్యం శౌచమ్." —సంస్కృత చ్ఛాయ) అశోకుడు తన రాజ్యపాలనా కాలంలో చివరగా, తన ఇరవై ఏడో రాజ్యాభిషిక్త సంవత్సరం (క్రీ. పూ. 241 ప్రాంతం)లో వేయించిన శాసనమని తలచబడే ఏడో స్తంభ శాసనంలో "దయ, దానం, సత్యం, శౌచం, మోదం, సాధుత్వం అనేవాటితో కూడిన ధర్మాన్ని ఆచరించటమే ధర్మాపదానమనీ, అదే ధర్మ ప్రతిపత్తి అనీ" చెప్పాడు.

భగవద్గీతలో వ్యక్తి ఔన్నత్యం ద్వారా సమాజ సమష్టి శ్రేయస్సు, లోకసంగ్రహం సాధించే మార్గం చెప్పబడింది. 'అశోక ధర్మం' సమాజ సమష్టి ప్రవర్తన ద్వారా వ్యక్తి శ్రేయస్సు పొందే మార్గం తెలిపింది. ఆధునిక యుగంలో, నేటి కాలంలో, సంఘంలోని వ్యక్తుల సమష్టి ప్రవర్తన మీద వ్యక్తి శ్రేయస్సు పూర్తిగా ఆధారపడి ఉంది. ఈ సమష్టి ప్రవర్తన తప్పుదారులు పట్టటంయొక్క ఫలితమే నేడు మనం ప్రతిచోటా చూచే, జాతి, ప్రాంత, మత, కుల స్పర్థలు, వైషమ్యాలు, కలహాలు. అశోకుని కాలంలో వివిధ మతధర్మాల మధ్య స్పర్థా వైషమ్యాలు ఉండి, సమష్టిలో సత్ప్రవర్తన సహనశీలత లోపించి సంఘశ్రేయస్సుకు, రాజ్యశాంతికి భంగకరమైన పరిణామాలు ఏర్పడినాయి. ఈ పరిణామాలు దృష్టిలో ఉంచుకొని, నాటికీ, నేటికీ, సంఘంలో మతపరమైన స్పర్థా వైషమ్యాలు సమసింప చేయటానికి, మత సామరస్యాన్ని పెంపొందింపచేయటానికి, సారభూతమైన నాలుగు సూత్రాలను అశోకుడు తన పన్నెండో శిలాశాసనంలో ప్రతిపాదించాడు. సులభంగా జ్ఞాపకం ఉంచుకోవటానికి వీలుగా, శాసనంలోని పదాలనే కొండగుర్తులుగా వాడి, వాటిని ఈ కింది విధంగా పేర్కొనవచ్చు.

1) మూల : అన్ని మత శాఖలవారి మూల ధర్మాలను పెంపొందించటం.

2) వచో గుప్తి : అసందర్భంగా తన మత ధర్మాన్ని పొగడకుండా ఉండటం; ఇతర మత ధర్మాలను తెగడకుండా ఉండటం.

3) సమవాయ : తన శాఖవారూ, అన్యశాఖలవారూ ఒకరి మతధర్మాన్ని మరొకరు వింటూ, ఒకరినొకరు ఉపచరించుకొంటూ పొత్తుగా ఉండటం.

4) బహుశ్రుత : అన్ని మత శాఖల ధర్మాన్ని గూర్చి వినటం, తెలుసుకొనటం.

ఈ 'అశోక ధర్మం' భారతీయ సనాతన ధర్మాన్ని అనుసరించినది; దానికంటె భిన్నమయింది కాదు. అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించటంచేత, ఈ ధర్మం బౌద్ధ ధర్మాన్ని అనుసరించిందని భావించినా, అశోకుని కాలానికి బౌద్ధధర్మం ప్రత్యేక మతధర్మంగా రూపొందలేదు. నాటికి అది వైదిక ధర్మంలో అతిగా చోటు చేసుకొని వెర్రితలలు వేసిన యజ్ఞయాగాది కామ్య కర్మలను, వర్ణ విభేదంవల్ల సంఘంలో కొన్ని వర్గాలవారు పెంచుకొన్న ఆధిక్యతాహంకారాన్ని నిరసించిన నిరసనోద్యమం మాత్రమే. దానిని బుద్ధప్రేరితమైన వైదికమత సంస్కరణోద్యమంగా మాత్రమే భావించవలె.

భారతీయ సంప్రదాయం ధర్మార్థ కామమోక్షాలను చతుర్విధ పురుషార్థాలుగా, అంటే మానవుడు తన జీవితకాలంలో సాధించవలసిన ప్రయోజనాలుగా పేర్కొనింది. అశోకుడు ధర్మానుసరణవల్ల అర్థకామాలతో కూడిన ఇహసుఖం అబ్బుతుందని చెప్పాడు;

కాని అంతకన్న గొప్పదైన పరసుఖం దొరకుతుందని గట్టిగా చెప్పాడు. సర్వజనుల ఇహ, పరలోక సౌఖ్యప్రాప్తికై, రాజుగా ప్రజల యెడల తనకు గల బాధ్యతా ఋణాన్ని తీర్చుకొనటమే తన ధర్మమని అశోకుడు ఉద్ఘాటించాడు. "సమస్త జనుల సౌఖ్యాన్ని అభివృద్ధి చేయటమే నా ధర్మమని తలుస్తున్నాను. ఆ సౌఖ్యానికి, నేను పడే శ్రమ, కార్య నిర్వహణ మూలంగా ఉన్నాయి. ఎందువల్లనగా, జనుల సౌఖ్యం అభివృద్ధి చేయటానికంటే ముఖ్యమయిన ధర్మం మరొకటి లేదు. జీవలోకమంతా ఇహలోకంలో సౌఖ్యం చెంది, అటుతర్వాత స్వర్గాన్ని పొందటానికై నేను వారికి అప్పు పడివున్న ఋణాన్ని తీర్చుకొనటానికే నా ప్రయత్నాలన్నీ వినియోగపడుతున్నాయి." ("కట వియ మతే హి మే సపలోక హితే, తసా చా పునా ఏసేములే ఉఠానే అఠసంతిలనా చా. నథి హి కంమతలా సవలోక హితేనా. ఈం చ కిథి పలకమామి హకం కితి భూతానం ఆననియం యేహం హిద చ కాని సుఖాయామి పలత చా స్వగం ఆలాధయితు" —ఆరో శిలా శాసనం, ప్రాకృతమూలం; "కర్తవ్యం మతం హి మే సర్వలోక హితం తస్యపునరే తన్మూల ముత్థానమ్ అర్థ సంతరణం చ. నాస్తిహి కర్మాన్తరం సర్వలోక హితేన. యత్కించి త్పరాక్రమేహం, కిమితి? భూతానామానృణ్యమేయామ్ ఇహ చ కాంశ్చింత్ సుఖయామి పరత్ర చ స్వర్గమారాధయితుమ్" -సంస్కృతచ్ఛాయ). శీలం, దానం, సంయమం, భావశుద్ధి, కృతజ్ఞత, భయరాహిత్యం, ధర్మకామత, శుశ్రూష, పాపభయం, పుణ్యపాప విచక్షణ, ఆత్మవిశ్లేషణ మొదలుగా చాలా గుణాలు, అర్హతలు తాను ప్రబోధించిన ధర్మాన్ని అనుసరించటానికి ఒకనికి ఉండాలనీ, అందువల్లే తన ధర్మాన్ని అనుసరించటం దుష్కరమని అశోకుడు పదే పదే చెప్పాడు.

అశోకుడు రాజర్షి. నిష్కామ కర్మచేత చిత్తశుద్ధిని పొంది లోకసంగ్రహమైన ధర్మాన్ని ప్రవర్తింపచేసినవాడు. తాను అహింసను పరమధర్మంగా అవలంబించి తన ప్రజలలో అహింసా ధర్మవ్యాప్తికై పాటుపడి కృతకృత్యుడైన రాజశ్రేష్ఠుడు అశోకుడు. "నేను చేసిన సాధు కార్యాలను లోకం అనుకరించి తానూ అవలంబిస్తున్నది." ("యాని హి కానిచి మమయా సాధవాని కటాని తం లోకే అనుపటీ పంనే తం చ అను విధియంతి" —ఏడో స్తంభ శాసనం, ప్రాకృతమూలం; "యాని హి కాని చిన్మయా సాధూని కృతాని తానిలోకః అనుప్రతిపన్నస్తాని చానువి దధాతి" —సంస్కృతచ్ఛాయ) అని ఎంతో ఆత్మ ప్రత్యయంతో తన ధర్మప్రచార సాఫల్యాన్ని గూర్చి చెప్పుకొన్నాడు.

అఖండ భారతదేశాన్ని పాలించిన చక్రవర్తులలో అతి విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడు అశోకుడు. బహుశా, ప్రపంచ చరిత్రలో సామర్థ్యం, సాధన సంపత్తి ఉండి కూడా యుద్ధ విజయాలను కాంక్షించని పాలకుడు అశోకుడు ఒక్కడే కనపడతాడు. అహింస ప్రాతిపదికగా రాజనీతిని రూపొందించిన రాజు అశోకుడు తప్ప మరొక్కడు కానరాడు.

'యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే.'

అనే సూక్తికి ఆదర్శమే అశోకుడు.

# సగటు సిద్ధాంతము

ఎప్పుడో వచ్చి తలుపు తట్టే
అవకాశాలు
ఆశయాలను
భేతాళుడిలా వెక్కిరిస్తూ
అనంతాకాశంలో ఐక్యమైనాయి.

అవసరాలు, ఆలోచనలు
వేనవేల నామాలతో
శతకోటి రూపాలతో
చెదలా మెదడును తొలుస్తున్నాయి.

లెక్కలు వేయని కాలం
లేడిలా గెంతుతుంటే
జీతానికీ, జీవితానికీ పడ్డ బ్రహ్మముడి
అయ్యింది గుండెకు, గొంతుకు ఉచ్చుముడి

శ్రీ కస్తల వేంకట విజయంబాబు

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

Amrutanjan Limited 

# వీధి చెట్టు!

ఆ మధ్య
మా వీధిలో
నాటిన చెట్టు
సన్నని మొదలుతో
నిటారుగానే
నిలిచి వుండి
కానీ ఎండిపోయింది!

దాని తీగెలు
బార్లా
బాగానే
సాగాయి
కానీ
తెల్లగా పాలిపోయాయి!

దానికి వ్రేలాడుతున్న
ఒకే ఒక
బాతుగ్రుడ్డంత
తెల్లటి మొగ్గ మాత్రం
చీకటి పడగానే
వికసిస్తుంది;
నైట్‌క్వీన్‌లా—

# పరిమళం

వాళ్ళ
చింపిరి తలల్లో
తెల్లవారగానే
వాళ్ళ
గతుకుల బతుకుల్లో
చైతన్యం విచ్చుకుంది—

దాని పరిమళమే
ఇప్పుడు దేశమంతటా
అలుముకున్నది!

# తొక్కుడు ఊహలు...!

కళ్ళు గిర గిరా తిరిగి
ఊడి పడతావని,
అప్పుడు చింతించి
ఫలితం వుండదని
ఎంత చెప్పినా
వినదేం ఈ చంచల?

తియ్య తియ్యటి
వింత పరిమళాలు
ఆఘ్రాణిస్తూ,
దాని వెంట
అల్లరిగా తిరుగుతూ
రోజు రోజుకు పెరిగిపోతున్న
పోకిరిని వెంటేసుకుని—

తనను తాను
కవ్వించుకుంటూ
అటునించి ఇటు
ఇటు నించటు
ఒకటే
తొక్కుడు ఊహలు....
ఊగుతోంది!
అంతెత్తున వున్న
చిటారు కొమ్మను
చేత్తో తాకాలని
ఊర్కే
ఉబలాట పడుతోంది!

# పచ్చని గాధలు!

శత సహస్ర సంవత్సరాల
వయసు మీద పడిన
నా తల్లి గుండెలో
ఎన్నెన్నో చేదు అనుభవాలు—
అయినా చూడు
అన్నిటిని పచ్చని గాధలుగా
రచిస్తోంది!

శ్రీ ఖ్రమొద్దీన్

# కలగూరగంప

## సంజ్ఞా భాష

బాహ్యప్రపంచాన్ని తెలుసుకొనుటకు మనిషి దేహంలో ఐదు సాధనాలున్నాయి. అవి : కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం. వీటికి జ్ఞానేంద్రియాలు అని పేరు. ఒక మనిషి ఇంకొక మనిషిని అర్థం చేసుకోవడానికి భాష ప్రాముఖ్యం వహిస్తున్నది. జంతువులు శబ్దం, చూపు, వాసన ద్వారా ఒకదానినొకటి, పరిసరాన్ని అర్థం చేసికొంటాయి. తేనెటీగలు గాలిలో ఒక విధమైన భ్రమణం, నాట్యంచేత వేరే తేనెటీగలకు తమ అభిప్రాయాన్ని తెల్పుకొంటాయి. కీటకాలు, పాములు, జంతువులు "ఫిరొమోను" అనే వాసన రసాయనాల ద్వారా స్వజాతి జీవులతో అవగాహన కుదుర్చుకొంటాయి. కోకిల గానం, నెమలి క్రేంకారం, నాట్యం శృంగార సంకేతాలు.

శబ్దమయ భాష భావప్రకటనకూ, జ్ఞానార్జనకూ ముఖ్య సాధనమైనా, ఏకైక సాధనం కాదు. మూగ, చెవిటి, గ్రుడ్డి అయిన అమెరికా స్త్రీ హెలెన్ కెల్లరు "లిప్ రీడింగ్" (మాట్లాడే టప్పటి పెదవుల కదలికలను స్పృశించు పద్ధతి) వలనా, పలకల పైని ఉబ్బెత్తు చుక్కలను వ్రేళ్ళతో తడుముట (బ్రెయిలీ పద్ధతి) వలనా విద్య నేర్చుకొనింది. షేక్స్పియర్‌నూ అధ్యయనం చేసింది. అందరినీ తిట్టిపోసే జార్జి బెర్నార్డ్‌షా ఈమెను "నెపోలియనుకంటే గొప్ప విశ్వవిజేత" అని వూరకనే అన్నాడా?

సమాచార ప్రసారానికి మోర్స్‌కోడ్ (టెలిగ్రాఫ్‌లో టక ఒక్క టక్క టక లాంటి శబ్దాలవల్లా), లేక చేతులతో జెండాలు, దీపాలు పట్టుకొని ఒక నిర్ణీతక్రమంలో ఊపుతూ సిగ్నల్ చేస్తారు. దీనికి (రెండవదానికి) "సెమఫోర్" అంటారు. సైనికులు, బాలభటులు ఈ విధాన మనుసరిస్తారు. నాట్యంలో వివిధాంగ విన్యాసాలు చేస్తూ భావాలను ప్రకటిస్తారు. "అభినయ దర్పణం" అనే గ్రంథంలో ఇవి వున్నాయి. దీనికి ఆంగిక అభినయం అని పేరు.

నిత్య జీవితంలో నిత్య వ్యవహారంలో మనిషి మాట్లాడే టప్పుడు – వాడు నాగరికుడైనా, ఆటవికుడైనా, మాటతోబాటు తెలిసియో, తెలియకో అభ్యాసంకొద్దీ అప్రయత్నంగా అదనంగా శరీరాన్ని అవయవాలను కదలిస్తూ వుంటారు. ఈ భాషలోని అంగ విన్యాసంబు, భావ, చేష్ట, హావభావాలుగా వుంటాయి. వ్యక్తి సాంస్కృతిక స్థాయిబట్టి వుంటాయి. భాష సహాయం లేకుండా కేవలం అంగవిన్యాసాల ద్వారా భావప్రకటన కూడా మనలో నెలకొని వుంది. దీనిని "సంజ్ఞాభాష" ("గెశ్చర్ లాంగ్వేజ్") అంటారు. ఇది మౌనభాష. సంజ్ఞాభాష ఒక్కొక్క వ్యవస్థలో ఒక్కొక్క రకంగా విస్తరించి వుంటుంది. ఆ వ్యవస్థలోని వారు ఆ సంజ్ఞలనే వాడుతారు. అర్థం చేసికొంటారు. సంజ్ఞాభాషకు ఉపయోగించే అంగాలు: చేతులు, వ్రేళ్ళు, బుజాలు, కనుగ్రుడ్లు, కనుబొమలు, రెప్పలు, నొసలు, పెదవులు, మూతి, నాలుక, పళ్లు, గొంతు, తల వీని కదలిక ప్రదర్శనలు సంజ్ఞాభాష అవుతుంది. చెవి, ముక్కు స్వతహాగా కదలకున్నా సంజ్ఞలకు పనికివస్తాయి.

చరిత్ర ప్రసిద్ధి కెక్కిన సంజ్ఞలు: సంజ్ఞాభాష సార్వత్రికం కాకున్నా కొన్ని సంజ్ఞలు చరిత్ర ప్రసిద్ధాలయినాయి.

1) రోమక చక్రవర్తి పిడికిలి బిగించి బొటనవ్రేలు క్రిందికి చూపిస్తే, ఓడిపోయిన క్రీడాకారుని చంపివేయండని సంజ్ఞ. బొటనవ్రేలిని పైకి చూపిస్తే ("థంబ్సప్"), క్రీడాకారుని ప్రాణం కాపాడినానని సంజ్ఞ.

2) రెండవ ప్రపంచ యుద్ధమప్పుడు బ్రిటిషు ప్రధాని చర్చిల్, చేతి మొదటి రెండు వ్రేళ్లు ఇంగ్లీషక్షరం "వి" వలె చూపిస్తూ "వి ఫార్ విక్టరీ" ("విజయం కోసం వి") అనే నినాదమిచ్చి ప్రజలను ఉత్తేజపరచేవాడు. చర్చిల్ గెలిచెను. రాష్ట్రపతి ఎన్నికలో (1969) వి. వి. గిరిగారు, ప్రచారంలో ఇదే సంజ్ఞ చేసేవారు. ఈయనా గెలిచెను. ఈయనకు రెండు "వి"లున్నవాయె మరి!

సంజ్ఞాభాష – నిత్య జీవితంలో :

*మ్రొక్కుట-ఇవి సువిదితాలు. *భోజనం-ఐదు వ్రేళ్ల ముకుళించి నోటిదగ్గర చూపించుట *దప్పి-బొటనవ్రేలిని పెదవుల దగ్గరకు తీసికొనిపోవుట *మలవిసర్జన-మొదటి రెండు వ్రేళ్లు వంచుట *మూత్ర విసర్జన – చూపుడువ్రేలిని వంచుట *చీమిడి-చిటికెనవ్రేలు వంచుట *అశ్లీల క్రియాసూచకాలు-10

దాకా వున్నాయి. *ఏమో నాకు తెలియదు-భుజాలు తటాలున పైకెత్తి, రెండు చేతులు వెల్లకిల వేయుట. ఇది అమెరికా వెళ్ళి వచ్చిన భారతీయులు చేసే సంజ్ఞ. *తప్పు మాట అన్నానే-నాలుక కొరుకుకొనుట *ఏమి అని ప్రశ్నించుట-పిడికిలిని భుజాల స్థాయికి తెచ్చి గాలిలో ముందు వెనుకకు గ్రుద్దుట *విరసన-మూతి విరుచుట *వెక్కిరించుట-పండ్లు గిలించుట. దీనిని కోతులు కూడా చేస్తాయి *అసమ్మతి-తల అడ్డంగా త్రిప్పుట *అంగీకారం-తల పైకి క్రిందికి నిదానంగా వూచుట లేదా గొంతును ఒక ప్రక్కకు వంచుట *పిచ్చిని సూచించుట-చూపుడు వ్రేలిని కణత దగ్గరికి తీసికొనిపోయి గుండ్రంగా త్రిప్పుట *ముగిసింది-రెండు హస్తాలు బోర్లవేసి తటాలున ప్రక్కలకు కదిలించుట *ఆశ్చర్యం-కన్నులు పెద్దవి చేయుట, కనుబొమ లెగురవేయుట *ఉందిలే కిటుకు-కన్ను గీటుట *నేస్తాన్ని వదలుట-రెండు చూపుడు వ్రేళ్లు కొక్కెంగా తగిల్చి లాగివేయుట. చిన్నపిల్లలు ఇది చేస్తారు. *వైరం-చూపుడు వ్రేళ్ళను × గుర్తుగా చేర్చుట *పరాక్రమం, ఆత్మోత్కర్ష-భుజాలు చప్పరించుట, ఛాతీ తట్టుకొనుట, తొడలు కొట్టుకొనుట *వీడ్కోలు-చేతులు పైకెత్తి ప్రక్కలకూపుట ఈ సంజ్ఞలు సర్వసాధారణంగా మనం చేసేవి. మన దేశంలో 150 వరకూ ఈ సంజ్ఞలు కలవు. చిన్నదయిన ఇస్రాయెల్ (జనాభా 30 లక్షలు) దేశంలో 250 సంజ్ఞలు కలవంటారు. దీనికి కారణం వారు వివిధ దేశాల్లో శతాబ్దాల తరబడి వలస వుండడం, నిత్య సైనిక సన్నాహత అంటారు. సంభాషణలను రహస్యంగా సేకరించడానికి ఎలెక్ట్రానిక్ పరికరాలచే "మధ్యగ్రాహీకరణం" ("బగ్గింగ్") చేసే నేడు సంజ్ఞాభాషకెంతో ప్రాముఖ్యం రాగలదు.

సంజ్ఞాభాష - కావ్యాలలో :

గరుడుడు కద్రువ దగ్గరికి పోయి తన తల్లి దాస్యం విడిపించుమంటే ఆమె "మొగంబు ముఖకటించు" కొనెనట. ఇది "స్కౌల్" సూచకం. దీనిని "తిక్కనటచ్" అనవచ్చును.

భీమ దుర్యోధన గదా యుద్ధమప్పుడు అర్జునుడు భీముడు చూచునట్లు తొడను చేతితో అప్పళించే సన్న చేస్తాడు. పర్యవసానం దుర్యోధనుని ఊరు భంగం.

ఒక పుల్లను చీల్చి వ్యతిరేక దిక్కులకు విసరి శ్రీకృష్ణుడు జరాసంధ వధకు భీమునకు సంజ్ఞ చేస్తాడు. ఇది మూల భారతంలో వుంది. నన్నయ భారతంలో లేదు. శృంగార ప్రబంధాలలో కుంటెనకత్తెల సంజ్ఞల సంగతి చెప్పనక్కరలేదు. మునులకు, అవధూతలకు మౌనభాష ఉంటుంది. "మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్వం యువానాం" అని దక్షిణామూర్తి స్తోత్రం ప్రారంభమవుతుంది.

తోకతునుక :

ఒక అమెరికా దేశీయుడు నేపుల్స్‌లో ఒక హోటలులో దిగెను. అచటి చక్కని భోజన సదుపాయాలకు సంతోషించి "వెయిటరు"ను అభినందించడానికి, చూపుడువ్రేలు, బొటనవ్రేలు "O" మాదిరి కలిపి, సంజ్ఞ చేసెనట. ఇది అమెరికాలో మెచ్చుకొనే సంజ్ఞ (మన దేశంలోనూ ఇట్లే) వెంటనే, ఆ వెయిటరు పోలీసులకు ఫిర్యాదు చేసేందుకు పోయెనట. నేపుల్స్‌లో ఆ సంజ్ఞ "బదుద్ధాయి" అనుటకు సంజ్ఞ కావడమే కారణం అని పాపం అమెరికావానికి తెలియదు!

సర్దేశాయి తిరుమలరావు

# భక్తి సంప్రదాయం

భారతదేశంలో అతీంద్రియానుభూతి ప్రత్యక్షమేగాని మత ప్రవర్తనా నియమావళి కాదు. విభిన్న మార్గాలు. మతములెన్నో మార్గములన్ని, గమ్యం ఒకటే అది ముక్తి పరమానందం. స్వర్గం. సాధకుల సామర్థ్యాన్నిబట్టి జ్ఞానరాజ భక్తియోగాలు. పూర్వ బౌద్ధయుగంలో వైదిక కర్మకాండ ప్రజల్లో వుండేది. బౌద్ధయుగానంతరం 9వ శతాబ్దంలో శంకరుడు కుమారిలుని కాలంలో జ్ఞానభక్తి, యోగాలు ప్రజల్లో వున్నాయి. బౌద్ధం వైదిక కర్మకాండను పూర్తిగా తొలగించింది. మేధావి కుమారిలుడు కూడా దాన్ని పునరుజ్జీవింప చేయలేకపోయాడు. మేధస్సును మెప్పించే తార్కిక కౌశలం బౌద్ధంలో కొనవూపిరితో వుంది. శంకరుడు, కుమారిలుడు యిద్దరూ దాన్ని చావుదెబ్బ తీశారు. కొన్ని శతాబ్దాలనంతరం వేదాలు తమ ఆధిక్యతను నిలబెట్టుకున్నాయి. శంకరుని అద్వైతం సామాన్యులకు గగన కుసుమం. బ్రాహ్మణేతరులకు బ్రహ్మవిద్య బోధించుటకు విరాకరించాడు శంకరుడు. అద్వైత పండితులు నోరు మూసుకొనక తప్పలేదు. రామానుజుడు భక్తి ప్రసాదాన్ని అందరికీ పంచిపెట్టాడు. భక్తికి పాదు వేదాలే నన్నారు.

సర్వమును బొందజేయుచు సంగతములయి
విశ్వమంతట వ్యాపించి వెలసియుండి
యఖిల కామయమానంబు లేచునున్న
యస్మదీయ నుతుల్ పొందు హరిని వేగ
శుద్ధుడై ధనము కలిగిన సుజనుడు వరె
త్వరిత గోగిట బెట్టాయు తరతులల్లు
గాదు సంస్తుతులెల్ల సన్మానసు నింద్రు
బొందుచున్నవి మిగుల నానందమొప్ప.

(ఋగ్వేదం. 10-43-1)

పతి పత్ని అనురాగంగాను, స్నేహితుడుగాను ఇంద్రుడిని స్తుతించారు ఋగ్వేదంలో. ఇవి భక్తి భావాలనడానికి ఆస్కారం లేదు. కాని ఇటువంటి భావాలే ఆయా కాల పరిస్థితులనుబట్టి ఆనాటి సంఘ మర్యాదలనుబట్టి స్వరూప నిర్ణయంలోను, ఆరాధనలోను అభిప్రాయాలు, పద్ధతులు మారుతూ వచ్చాయి. భక్తి సంప్రదాయాన్ని పండితులు విశాలమూ విస్తృతమూ చేశారు.

బృహదారణ్యకంలో యాగ్నవల్క్యుడు మైత్రేయి సంభాషణలో కూడా ఆత్మయందు ఆరాధనా భావమే భౌతిక జీవితంలో సాంసారిక జీవనానందంగా భావించారు.

'కామాయ పతిః ప్రియోభవతి.... ఆత్మనస్తు కామాయపతిః ప్రియో భవతి... (బృహదారణ్యకోపనిషత్తు 4-5. 6)

దాంపత్య జీవితంలోని ప్రేమభావాన్ని వైష్ణవం అభివృద్ధి చేసింది. వైష్ణవంలోని కృష్ణ కథ మాండూక్యోపనిషత్తులలోను, శ్వేతాశ్వేతర ఉపనిషత్తులో భక్తి, గురుసేవావాదంలోను చూడ వచ్చు. భక్తి ఒక మార్గంగా ప్రబోధించింది ప్రథమంగా భగవద్గీత.

భజ్ ధాతువుకు 'క్తిన్' ప్రత్యయం చేరి భక్తి అయింది. భక్తి అంటే పని. అనిపాణిని, ఇతర అర్థాలు, సేవ, భక్తి, అనురాగము, ఆరాధన, నివాళి. భజ్=సేవ, క్తి=ప్రేమ అని వల్లభాచార్యుడు పరానురక్తిరీశ్వరే అని శాండిల్యభక్తి సూత్రాలు. సాతస్మిన్ పరమ ప్రేమరూప అని నారదభక్తి సూత్రాలు. బ్రహ్మ సూత్ర భాష్యంలో (111, 2.24) భక్తినే సాక్షాత్కార అర్థంలో చెప్పినట్లు కనిపిస్తుందన్నారు. పూర్ణ విలీనం లేదా సమారాధనం భక్తి, ధ్యానం వల్లనే సాధ్యం అని శంకరుడు. ఆరాధనమే భక్తి. భజనమ్ భక్తిః. ధ్యానం తైల ధారలా అవిచ్ఛిన్నంగా సాగాలి అని శంకరుడు, రామానుజుడు కూడా భక్తితైలధారలా వుండాలన్నాడు. విష్ణుతత్వం తెలిపిన వాడు జ్ఞాని, భక్తజనపాపాది కర్షణాత్ కృష్ణ అని గీత. రామానుజుని దృష్టిలో ధ్యానమే భక్తి, ఉపాసనకు పర్యాయపదం. వేదాంత దేశికులు భక్తిని ప్రీతి అన్నారు. భక్తి ఫలం ఈశ్వర సాయుజ్యం. భౌతిక సుఖాలు అల్పాలు. అస్థిరాలు. బాధాకరాలు. వీటినుండి విముక్తి పొందాలంటే భక్తి శరణ్యం. 'మహనీయ విషయ ప్రీతిర్భక్తిః ప్రీత్యాదయశ్చ జ్ఞానవిశేష ఇతితత్త్వతే స్నేహ పూర్వం అనుధ్యానం భక్తిః'. అని సర్వార్థ సిద్ధిలో వేదాంత దేశికులు, ఆమ వ్యాఖ్యానంలో భక్తి జ్ఞానాలు ఒకటేనని మధ్వ వాక్యాలు రాశారు.

భక్త్యాజ్ఞానం తతో భక్తిస్తతో
దృష్టి స్తతశ్చ సా
తతోముక్తి స్తతోభక్తిః సైవస్యాత్
సుఖరూపిణీ.

అని మాధ్వుడే అన్నారు. భక్తివల్లనే జ్ఞానం. జ్ఞానం వల్ల ముక్తి, భక్తి లేకుండా పరిపూర్ణ సాక్షాత్కారం లభించదన్నాడు (భక్తిం వినాన తత్ సాదృశ్యం సమ్యగ్ అభివాఙ్యతె). భక్తి ఉద్యమానికి ఒక సమగ్ర రూపాన్నిచ్చినవాడు మాధ్వుడే.

మహాత్మ్య జ్ఞాన పూర్వస్తు సుదృఢః సర్వతో
ధికః, స్నేహో భక్తిరితి ప్రోక్త స్తమాముక్తిర్
న చ అన్యథా.

అని వల్లభాచార్యుడు స్నేహభావం వుండాలంటాడు. చైతన్యుడు భక్తి లతకు ఎన్నో పూలు పూయించాడు. పురుషార్థాలు ధర్మార్థ కామమోక్షాలే కాక అయిదవది ప్రేమ. లేక భక్తిరసాన్ని కూడా చేర్చాడు. భక్తిరసామృత సింధు, ఉజ్జ్వలనీలమణి గ్రంథాలు రూపగోస్వామి, భక్తి సందర్భం జీవగోస్వామి గౌడీయ వైష్ణవ భక్తి సంప్రదాయాన్ని తెలిపే గ్రంథాలు.

భక్తి భావం సాహిత్యంలో వచ్చి శృంగారభావంగా రూపు దిద్దుకొన్నది. భౌతికానందమే భక్తిరసానందంగా భావించారు. జయదేవుని గీత గోవిందం, క్షేత్రయ్య పదాలు వంటి గ్రంథాలు వెలువడినాయి. శారీరకవాంఛ తొలగకుండా భక్తిభావం కలగదు. జంతుప్రవృత్తి (ఆహార నిద్ర భయ మైథునాలు) ఎక్కడ ఆగి పోతున్నాయో అక్కడ ఆరంభమవుతుంది భక్తిభావం. అచల తత్వయోగి కూడా 'కమలాక్షి మాంసపు స్తనములందే మనసు నిలుచు గదా' అని పాడుకున్నాడు. మనసు ఇంద్రియాలవేపు తిరిగితే కామం. భగవంతునివేపు తిరిగితే భక్తి. కామభావమే భక్తిభావం అనుకున్నారు. అందుకే భక్తిని మెత్తు వర్ణనలతో

వింపారు. పాశ్చాత్యులలో కూడా భక్తిని వచ్చి బూతు వర్ణనలతో వింపారని తెలిసినవాళ్ళుంటారు. అతీంద్రియానుభూతిని పొందినవారు భావము భాష వేరుగా వుంటాయి. ఆత్మసాక్షాత్కారం పొందినవారు ఎలా వుంటాడందే మనవాళ్లు చెప్పారు కూడా. బృహదారణ్యకం (4-4-23) లోను, భగవద్గీత (11.55-72; 12 13-20)లోను అతడి ప్రవర్తన, జీవన విధానం చక్కగా చెప్పారు. అదే మనకు గీటురాయి.

భక్తి ఉద్యమం ఆధ్యాత్మికంగానే గాక సామాజిక, చారిత్రక పాత్ర కూడా నిర్వహించగలిగింది.

**భారతీయ** సమాజంలో విప్లవాత్మకమయిన సంస్కరణలు ఆ ఉద్యమ నాయకు లున్నంతవరకే వుంటాయి. తరవాత వారితోనే సమాధి చేయబడతాయి.


సంప్రదించిన గ్రంథాలు :

1 చైతన్యుడు-జీవితము-సంప్రదాయము —ఎ. కె. మజుందార్
2. గౌడీయ వైష్ణవ స్టడీస్
3. భక్తి రినైజాన్స్
4. బృహదారణ్యకోపనిషత్తు
5. ది అద్వైతిక్ నోషన్ —కె. సచ్చిదానందమూర్తి
6. ఎ క్రిటికల్ సర్వే ఆఫ్ ఇండియన్ ఫిలాసఫి —డా॥ చంద్రధర్ శర్మ


**శివలింగం**

# వీరభక్తి

'రస్యతే ఆస్వాద్యతేతి రసః' అని రసశబ్ద నిర్వచనం. రసాన్ని గూర్చి భరతముని 'న భావహీనో స్తి రసః - న భావో రస వర్జితః' అని రసం యొక్క ప్రాముఖ్యాన్ని ఉగ్గడించాడు. రసాలు ఎనిమిది లేదా తొమ్మిది అనీ, ఇంకా మరికొన్ని రసాలు ఉన్నాయనీ రసచర్చ ఉంది. అయితే భరతుడు చెప్పిన తొమ్మిది రసాల్లో 'భక్తి'ని రసంగా అంగీకరించలేదు.

'భక్తి' రసమేనా? అనే విషయంలో చాలామంది లాక్షణికులు రసంగా అంగీకారం తెలుపలేదు. వారిలో జగన్నాథ పండితుడు కూడా ఒకడు. కాని భక్తిని రసంగా ప్రతిపాదించింది 'ఉజ్జ్వల నీలమణి' కర్త రూపగోస్వామి. ఇతడు ప్రతిపాదించిన భక్తి కృష్ణగోపికా సంబంధమైన మధురభక్తి. శృంగార రూపంలో ఉన్న విషయం. ఇతర లౌకిక శృంగారాలు ఉపాదేయాలు కావు. దీనిని భక్తిలో ఏకదేశంగా గ్రహించగలం గాని, సంపూర్ణమైన భక్తిగా చెప్పలేం. ఇట్టి భక్తిని 'మధుసూదన సరస్వతి' తన 'భక్తిరసాయన' గ్రంథంలో సంపూర్ణమైన రసంగా సిద్ధాంతీకరించాడు. ఆలంకారిక లోకంలో 'భక్తి' రసం వివాదాస్పదమైనా సహృదయామోదం అనటంలో సందేహం లేదు.

ఇట్టి భక్తి భగవద్గీతలో—

"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతి నోర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భర తర్షభ" (7-16)

అని చతుర్విధాలుగా చెప్పబడింది.

శ్రీమద్భాగవతంలో భక్తి "శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదన" యాపాల్లో నవ విధాలుగా చెప్పబడింది. నారద భక్తి సూత్రాల్లో పదకొండు విధాలుగ చెప్పబడింది. 16వ శతాబ్దంలోని 'పరమానంద-తీర్థయతి తన వివేక చింతామణి'లో వీరశైవుని పూర్వ శివలింగ పూజా విధానాన్ని తెలుపుతూ 'శ్రద్ధాభక్తి, నిష్ఠా భక్తి, అవధాన భక్తి, అనుభవ భక్తి, ఆనంద భక్తి, సమరస భక్తి' అని షడ్విధ భక్తి మార్గాలను చెప్పాడు.

పైన తెలిపిన భక్తి మార్గాలన్నిటికీ భిన్నంగా మల్లికార్జున పండితారాధ్యుడు తన శివతత్త్వసారంలో వీరభక్తి అని మరొక భక్తి మార్గాన్ని పేర్కొన్నాడు.

దేవ భవదీయ భక్తులు
మా వల్లభ భక్తి యోగ-మార్గమ్ములు నా
నా విధములుండు రవియును
గోవిందాదులకు నెఱుఁగ - గోచరమె శివా!

శివతత్త్వసారము-389

ఉమావల్లభుని భక్తుల భక్తి మార్గాలు నానావిధాలుగా ఉంటాయని తెలుపుతూ, అనేకమంది శివభక్తుల చరిత్రలు వివిధ పద్యాల్లో చెప్పాడు.

దేవ! నిను వీరభక్తిని
త్రోవక తన తలలు దఱిగి-పూజించి పడిన్
రావణుడు చంద్రహాసము
దేవేంద్ర జయంబు వడసె-దెల్లము గాదే!

శివతత్త్వసారము-395

మల్లికార్జున పండితుడు పై పద్యంలో రావణాసురుని ఉదంతాన్ని ఉటంకిస్తూ, అతని భక్తిని వీరభక్తిగా పేర్కొన్నాడు. ఇంద్రుణ్ణి జయించడం కోసం రావణాసురుడు తన శిరస్సులను ఖండించి పరమ శివునికి పుష్పాలుగా పూజిస్తాడు. ఇది వీరోచిత కృత్యం. కాబట్టి ఈతని భక్తిని మల్లికార్జునుడు వీరభక్తిగా పేర్కొన్నాడు. మల్లికార్జున పండితుడు ఈ "వీరభక్తిని" మరి ఇద్దరు భక్తుల చర్రితలలో కూడా చెప్పాడు.

పూని వడి నేఁడు నాఁటఁ
పీనుఁగునకు వీరభక్తిఁ బ్రీతాత్మఁడవై
ప్రాణం బొసఁగితి గాదెద
యా నిరతిం గదిరి రేమాణార్యునకు శివా!

(శివతత్త్వసారము-429)

అల పూరి వీరభక్తికి
నళి నెంతయు మెచ్చి పాండ్య-నాయకు కరకి
మ్ముల నీవ వచ్చి పీఠము
వెలయఁగ చేకొంటి కాదె! - విష్ణువరేణ్యా

శివతత్త్వసారము-434

పై పద్యములలోని రేమణాఖ్యుడు, పాండ్యభూపతి ఇరువురును వీరభక్తి తత్పరులుగా తెలియటమే గాక, మల్లికార్జునుడు భక్తి మార్గాలలో వీరభక్తి కూడా ఒకటని ప్రముఖంగా భావించినట్లు చెప్పవచ్చు.

ఈ వీరభక్తిని "పాల్కురికి సోమనాథుడు" కూడా తన "బసవ పురాణం"లో పేర్కొన్నాడు.

శివాలయంలోకి పాదరక్షలతో ప్రవేశించటం నిషేధం. ఆనాడు శైవులు పాటించే ఆలయ మర్యాదల్లో ఇదొకటి. ప్రాణ త్యాగానికైనా సిద్ధపడతారు గాని నియమోల్లంఘనం మాత్రం చేయరు. ఇటువంటి నియమం ఉందని తెలిసికూడా ఒక జైనుడు పాదరక్షలతోనే శివాలయ ప్రవేశం చేస్తాడు. ఏకాంతరామయ్య అనే శివభక్తుడు ఈ కృత్యాన్ని చూసి—

"ఇంకఁ జెప్పులతోన యిట్లుంటి వేని
శంకింప కిప్పుడ సందు సందులకు/నఱకుదు"

అని హెచ్చరిస్తాడు. అంతటితో ఆ జైనుడు జంకి, నీవే భక్తుడవు-శివుడే వేల్పు అయితే తల తరిగి మలహరుచేత మళ్ళీ పొందమంటాడు. అపుడు ఏకాంతరామయ్య జైనుడికి, ఇంతకు ముందు ఎంతమంది శివభక్తులు తమ శిరస్సులను ఖండించుకొని తిరిగి పొందారో వివరిస్తాడు. ఆ వివరణయందు సోమన—

"మారారి విస్మయ మానసుండగుచు
నోరోరి! వంక! నా కూరుపువోదు
ఓడితి నన్నను మేడెము వొడువ
జాడియే నీ వీరభక్తికి నిలువ"

-అని వీరభక్తిని గూర్చి ప్రస్తావించాడు. ఈ వీరభక్తిని ప్రదర్శించిన శైవభక్తుడు 'మొదలిగ వంకయ్య'. ఈతడు తన శిరస్సును ముప్పై, నలభైసార్లు ఛేదించి శివునికి సమర్పించిన వీరభక్తుడు. ఇలాగే 'అల్లయ్య మధువయ్యల కథ'లో సోమన ఈ వీరభక్తిని గూర్చి మరొకసారి ప్రస్తావించాడు.

"మల్ల బ్రహ్మయ లన మహి వీరభక్తి
కెల్లయై వర్తిల్లు నెడ నర్ధరాత్రి"

మల్లయ బ్రహ్మయ అనే జైనభక్తులు ఇద్దరు అర్ధరాత్రి బిజ్జలుని రాజప్రాసాదంలోకి ప్రవేశించి అతన్ని సంహరిస్తారు.

ఇంతకి ఈ వీరశబ్దాన్ని వీరశైవ శబ్దంలోని వీరశబ్దం వలె చేర్చారా? లేక వీరభక్తి అనేది ఒక భక్తిమార్గంగా తలిచారా? అని ప్రశ్నించుకుంటే వీరశబ్దాన్ని వినియోగించడం తరచు కనిపిస్తుంది.

అయిదుగ శివాగ్నిఁ దన యొద
లుయ తర శివభక్తి వీర హోమంబుగఁ జె
చ్చెరఁ గోసి వేల్చె నీ దయ
సరి ముక్తికిఁ జనఁడె! వీర శంకరుడు శివా

శివతత్త్వసారము-398

పై పద్యంలో 'వీరహోమము' అని వాడటంవలన తెలుస్తుంది. ఈ 'వీర' శబ్దం వినియోగంలో 'వి' అంటే విద్య అనీ, 'ర' అంటే రమించడం అనీ వివరణ ఇవ్వబడుతూ ఉంది. 'వి' అనే హ్రస్వాక్షరం 'వీ' అని, దీర్ఘాక్షరంగా ఎలా మారిందో తెలియదు. శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు నుడివినట్లు "దీని ప్రచారమునకు వీరోద్రేకముతో దండనీతిని గూడ నుపయోగింతురు గాన నీనామ మీ మతమున కౌచిత్యముతో వ్యవహరింపబడినది." అంతేగాకుండా వీరశైవ సమాసంలో వీర శబ్దానికైనా, వీరభక్తిలోని వీర శబ్దానికైనా ఒకటే అర్థం. ఈ వీరశబ్దాన్ని గూర్చి 'సిద్ధాంత శిఖామణి'లో ఈ క్రింది విధంగా నిర్వచించబడింది.

"విశబ్దే నోచ్యతే విద్యా జీవైక్య బోధినీ
తస్యాం రమతి యశ్శైవో వీర ఇత్యభిధీయతే"

పై శ్లోకంలోని భావాన్ని బట్టి శివస్వరూపంతో తమ జీవితాన్ని ఎవరు ఐక్యం చేయగలరో వారు వీర శబ్ద వాచ్యులుగా చెప్పబడ

తారు. ఈ జీవైక్య సంధాతలు ఏ క్రియతో ఎవరైనా సరే వారిని వీరభక్తులుగా పరిగణించవచ్చు. శిరస్సులను ఖండించుకొని శివుని పూజించే రావణాసురుని వంటి భక్తులే కానక్కరలేదు. మనసా-వాచా-కర్మణా శివుని లేదా భగవంతుని కొలిచే ప్రతివారూ వీరభక్తులే. వీరశైవులందరూ ఈ కోవకు చెందినవారే. అనేక భక్తి మార్గాలలో సుల్లికొట్టిన పండితుడు నుడివిన వీరభక్తి కూడా ఒక భక్తిమార్గంగా భావించవచ్చు.

### ఉపకరించిన గ్రంథాలు :

1. భగవద్గీత, 2. భాగవతము, 3. శివతత్వసారము, 4. బసవ పురాణము, 5. వివేక చింతామణి, 6. వీరశైవాంధ్ర వాఙ్మయము, 7. అమృతవల్లి (ఉపన్యాస లహరి రెండవభాగం).

గొల్లకోట సూర్యభాస్కరరావు

## నాలికేరం

'జూన్' నెల 'భారతి'లో శ్రీ వైద్య పమ్మి సత్యనారాయణ శాస్త్రిగారు 'నాలికేర' ప్రస్తావనకు సంబంధించిన ఒక శ్లోకానికి (ప్రహేళికకు) సమన్వయాన్ని కోరుతూ లేఖ వ్రాశారు. ఆ శ్లోక సమన్వయాన్ని అందించాలని ఈ లేఖ వ్రాస్తున్నాను.

శ్రీ శాస్త్రిగారు ఉదాహరించిన శ్లోకంలో రెండవ పాదంలో ఒక పదం తప్పిపోయింది. మూడవ పాదంలో ఒక పాఠాన్తరం కనిపిస్తోంది. ఆ శ్లోక స్వరూపమిది—

కః ప్రార్థ్యతే మదన విహ్వలయా యువత్యా
భాతి క్వ పుండ్రక ముపైతి కథం బతాయుః।
క్వా నాదరో భవతి కేన చ రజ్యతేఽబ్జం
బాహ్యాస్థి కిం ఫల ముదాహర 'నాలికేరమ్'॥

(సుభాషిత రత్న భాండాగారమ్-పుట 206 శ్లో 31)

అథసూచికలో ఆ శ్లోక సమన్వయానికి సంబంధించిన సూచన ఇలా వుంది. "నాలికేరమ్, నా పురుషః, అలికే భాలే, అరం శీఘ్రం, పునః ప్రతిలోమమ్, రంకే క్షుద్రే, అలినా భ్రమరేణ, బాహ్యాస్థి యస్య ఏవం విధం నాలికేరమ్." ఈ సూచన ద్వారానే విషయ మవగత మవుతున్నా స్పష్ట ప్రతిపత్తి కోసం వివరించి సమన్వయిస్తాను.

పై శ్లోకంలో ఆరు ప్రశ్నలున్నాయి. వాటి కన్నిటికీ సమాధానం 'నాలికేర' మన్న పదం. ఆ పదాన్ని మూడు విధాలుగా స్వీకరించి ఆరు ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వబడ్డాయి. మొదటి మూడు ప్రశ్నలకు సమాధానం చెప్పేందుకు 'నాలికేరం' అన్న పదాన్ని నా+అలికే+అరం అని విడగొట్టాలి. తర్వాతి రెండు ప్రశ్నలకూ సమాధానం చెప్పటానికి 'నాలికేరం' పదాన్ని ప్రతిలోమంగా(వెనుకనుండి ముందుకు)స్వీకరించాలి. అప్పుడు పద స్వరూపం రంకేఽలినా. దాన్ని రంకే+అలినా అని విడగొట్టాలి. ఇక ఆరవ ప్రశ్నకు సమాధానం 'నాలికేరం' అన్న పూర్తి పదం. ఇప్పుడు ప్రశ్నలూ, సమాధానాలు వరుసగా గమనించండి-

1) ప్రశ్న : కః ప్రార్థ్యతే మదన విహ్వలయా యువత్యా? = మదన విహ్వలయైన స్త్రీచేత ఎవరు కోరబడతారు?
   సమా : నాః = పురుషుడు.

2) ప్రశ్న : భాతి క్వ పుండ్రకమ్? = పుండ్రక మెక్కడ శోభించును?
   సమా : అలికే = ఫాలమునందు.

3) ప్రశ్న : ఉపైతి కథం బతాయుః? = వయస్సెలా మీద బడును?
   సమా : అరమ్ = శీఘ్రంగా

4) ప్రశ్న : క్వ అనాదరో భవతి? = దేనియందు అనాదరణ మేర్పడును?
   సమా : రంకే = నీచ విషయంలో

5) ప్రశ్న : కేన చ రజ్యతేఽబ్జః? = పద్మం దేనివలన శోభింప జేయఁబడును?
   సమా : అలినా = తుమ్మెదచేత.

6) ప్రశ్న : బాహ్యాస్థి కిం ఫలమ్? = బాహ్యాస్థి అయిన ఫలమేది?
   సమా : నాలికేరం = కొబ్బరికాయ.

డా॥ సూరం శ్రీనివాసులు

## వయస్సు కారణమా?

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఏ విషయం పరిశీలించినా ఒక గందరగోళం లేవదీస్తారు. ఆనాడు నన్నెచోడుని కుమార సంభవం కూటసృష్టి అన్నారు, యిప్పుడు నంది దుర్గాలయ శాసనం కూట శాసనం అంటున్నారు. కాదనే ధైర్యం ఎవరికీ లేకుండా పోతుంది.

ఏమైనప్పటికి వారు అష్టదిగ్గజ కవులుగా నలుగురను అంగీకరించటం సంతోషదాయకం. వివిధ ఉపపత్తులతో డాక్టర్ సూర్యదేవర రవికుమార్‌గారు మరొక యిద్దరికి స్థానం కల్పించారు. ఇక యిద్దరూ కాదని నిర్ణయించిన అమాయకులు ముగ్గురు. అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, భట్టుమూర్తి.

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"




మెలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మెలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్



**Amrutanjan Limited**

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

OBM 149 TG R

పై విమర్శకుల అభిప్రాయాన్ని బట్టి యీ ముగ్గురికి గల అనర్ఘ శ్రీకృష్ణదేవరాయల ప్రాభవ కాలానికి వీరి వయసు ఇరవై అయిదు వసంతాల ప్రాంతం. నిజంగా ఇది ఒక అనర్ఘ తరంగాలా! పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడే వయసులో కవిత చెప్పాడు? చిన్నాడి పెద్దాడి [illegible]. నా భాగ్య [illegible] [illegible] శ్రీనాథుని మాట ఏమిటి? అదెప్పటి మాటో అనుకుందాం-ఎనిమిదేళ్ళ ప్రాయంలో సకలావయులను ముగ్ధులను గావించిన మన మంగళంపల్లి బాలమురళీ కృష్ణ మన ఎదురుగనే ఉన్నాడే! మాండొలిన్ శ్రీనివాస్ వయసెంత! కళను సాధించటంలో వయసుతో నిమిత్తమేమిటి?

ఆనాటి చారిత్రక నేపథ్యం పరిశీలించినప్పటికి ఎనిమిదేళ్ళ వయసులో ఉపనయన సంస్కారంతో గురుకులంలో చేరిన విద్యార్థి పదునారేండ్ల వయసుకు సకల శాస్త్రాలను వంటబట్టించుకునేవాడు. తన పాండిత్య గరిమతో ఇరవై అయిదేళ్ళ ప్రాయానికి మహారాజుల ఆస్థానాలలో కొలువు సంపాదించటం విచిత్రమైన విషయం కాదు. చరిత్రగతమైన ప్రతి విషయాన్ని మన కొలతల్లో కొలవటం న్యాయం కాదు.

పై ముగ్గురు కవులను అష్టదిగ్గజాల పట్టికనుండి నెట్టివేయటానికి వేరే ఏమైనా కారణాలు చూపవచ్చును గాని వయసు మాత్రం కారణం కాబోదు.

చింతలపూడి వేంకటేశ్వర్లు

## శంఖం ఆయుధం కాదా?

మే భారతి కలగూరగంపలో శ్రీ సర్దేశాయి తిరుమలరావు "చత్వారివాక్" అని వివరిస్తూ విష్ణ్వాయుధాల్లో శంఖం ఆయుధం కాదన్నారు—

పంచాయుధ స్తోత్రంలో—

విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య,
యస్య ధ్వని ర్దానవ దర్ప హంతా
తం పాంచజన్యం శశికోటిశుభ్రం
శంఖం సదాఽహం శరణం ప్రపద్యే—

అనే శ్లోకం శంఖ ప్రాశస్త్య నిరూపకం—

ధ్వనికి భేదకశక్తి వుంది - పాంచజన్య ధ్వని దైత్య, దానవహరం — ధ్వని మాత్ర శ్రవణంతో శత్రు వినాశకరం అవడంవల్ల శంఖం ఆయుధంగా పరిగణింపబడి వుండాలి - ఆ ధ్వని యెంత దుస్సహమో శ్రీమద్భగవద్గీతా ప్రారంభంలో ఆయా శంఖాల ధ్వని వివరిస్తున్న—

"స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీంచైవతుము లోవ్యనునాదయన్"

శ్లోకం పరిగణింప తగివున్నది - అందువల్ల శంఖం ఆయుధమే-

ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు

## ద్వాదశాదిత్యుడు

జూన్ 89 భారతిలో (పే. 57) "ద్వాదశాదిత్యాది పద సముచ్చయాలకు అర్థం ఏమిటి?"ని చదివిన మీదట, నా ఊహ.

ఆదిత్యుడన్నా, మార్తాండుడన్నా సూర్యుడని అర్థం. మార్తాండుడంటే 'మృత అండమునుంచి పుట్టినవాడు' అని. మృతాండమునుంచే వచ్చిన నక్షత్రం (డెడ్ స్టార్) అని.

నక్షత్రం చచ్చిపోవడమంటే?

ఒక నక్షత్రం ప్రకాశిస్తూ వుండగా వుండగా దానిచుట్టూ వున్న వాయువులు ఘనీభవించి ముందు ధూళిగా అయి ఆ ధూళి దట్టమై పెద్ద అట్టగా కట్టి నక్షత్రాల్ని చుట్టుముట్టేనుంది. క్రమేపి ఆ అట్ట పెంకుగా అయి దళసరమై గోళాకారం పొందుతుంది. లోని నక్షత్రాన్ని బయటకు కన్పడనియ్యదు. అట్టిదాన్ని మృతాండమన్నారు.

ఆ మృతాండం యింకా యింకా ఘనీభవిస్తూ కుంచించుకపోతూ వుంటుంది. అప్పుడు లోపలి నక్షత్రం విచ్చుకపోయే శక్తితో వుంటుంది. పై పెంకు లోపలికి కుంచించుకపోయే శక్తితో వుంటుంది. చివరకు ఒకానొక దశలో లోని నక్షత్రపు విచ్చుకపోయే శక్తి బయటి పెంకు కుంచించుకపోయే శక్తిని మించి ఒక్కమాటుగా తనచుట్టూ వున్న పెంకును బద్దలు కొట్టేస్తుంది. ఆ నక్షత్రం తన పరిధిలో తాను తిరుగుతూనే వుంటుంది. చుట్టూ వున్న పెంకు పగిలిపోగానే లోని నక్షత్రం కొత్త సూర్యుడౌతాడు. పై పెంకు ముక్కలు ఆ కొత్త సూర్యుడి చుట్టూ తిరుగుతూ గ్రహాలవుతాయి. ఆ గ్రహాలు, కొత్త సూర్యుడూ, పాత సూర్యుడి భాగాలే కాబట్టి మొత్తం ద్వాదశాదిత్యులన్నారు. అంటే అసలు సూర్యుడు కాక పదకొండు గ్రహాలన్న మాట. వాటి పేర్లు. (1) ధాత (2) మిత్రుడు (3) అర్యముడు (4) శక్రుడు (5) వరుణుడు (6) అంశుడు (7) భగుడు (8) వివస్వతుడు (9) పూషుడు (10) సవిత (11) త్వష్ట (12) విష్ణువు. వీటిలో ఏది సూర్యుడో, ఏవి గ్రహాలో చెప్పటం కష్టం.

మన జ్యోతిషం ప్రకారం సూర్యుడు కాక మిగిలిన గ్రహాలు బుధ, శుక్ర, కుజ, భూమి, గురు, శని, మాంది, గుళిక. వరుణులు. చివరి మూటిని ఇంగ్లీషులో యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అంటారు. పదవ గ్రహపు ఉనికి తెలిసి వెతుకుతున్నారు. పదకొండవది మరొకటి వున్నదన్న మాట.

భాగవతుల ఉమామహేశ్వర శర్మ

# గ్రంథ విమర్శలు

## శ్రీరామచరితమ్

[రచన : డా॥ కొరవరాజు శ్రీధరరావు, ప్రాప్తిస్థానం: రచయిత పేర - రామచంద్ర క్లినిక్: చీరాల, ప్రకాశం జిల్లా, వెల : 9రూ.]

దశకంఠుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి వరాలు పొంది లోకాలను చీకాకు పరచడం కథారంభం. సీతా కళ్యాణం- శ్రీరాముడు-తమ్ములు, వివాహితులై భార్యలతో అయోధ్యలో హాయిగా ఉండడం - దశరథుడు — కౌసల్యాది మాతలూ ఆనందించడం - చివరి విషయం.

వాల్మీకి రామాయణం ఆధారంగా బాలకాండ ప్రధాన కథను నూరు శ్లోకాలతో వివిధ వృత్తాలతో సంతరించిన పద్యకావ్యం.

వృత్తికీ ప్రవృత్తికీ సంబంధం ఉండదని యీ రచయిత సాహితీ వ్యవసాయం చెప్తోంది.

సంస్కృతం ఉందా? ఊడిందా? అనే సందిగ్ధ దశలో ఉంది అని ఇలాటి రచనలు చెప్తూ ఉంటాయి. నిర్దుష్టమూ లలితమూ సుకుమార భావ సంకలితమూ అయిన రచన-

'వాల్మీకి దివ్య వచనామృత కూపలక్ష్మీం
ఆస్వాద్య' - అనే శ్లోకంలో 'వార్ధిలక్ష్మీం
ఆసేవ్య'-అని సవరిస్తే సమంజసముగా ఉంటుందని

నా అభిప్రాయం.

శ్రీ చింతలపాటి నరసింహదీక్షిత శర్మ, శ్రీ జొన్నలగడ్డ జానకిరామ శర్మ యీ చిన్నారి కృతికి టీకా తాత్పర్యాలు రచించారు. శ్రీ కేశవ పంతులవారి 'ఉపోద్ఘాతం' ముందు చదవ వలసేది.

## సీతాపహరణం

[రచయిత : శ్రీ కాకూరి హనుమంతరావు, ప్రతులకు: శ్రీమతి కె. వి. శేషుబాయి, L/58 - ఉస్మానియా యూనివర్శిటీ క్వార్టర్స్, హైదరాబాదు-7, వెల: రు. 16/-]

దేవనాగర లిపి - అయిదంకాల సంస్కృత నాటకం- సానుబంధం, సీతను అపహరించే సంకల్పముతో సహాయముగా రావణుడు మారీచుని వద్దకు రావడం ఆరంభం. రామ పట్టాభిషేక ముతో ముగింపు-

రామకథను ఎవరే రూపాన వ్రాసినా వాల్మీకి రామాయణం ఆధారం అనక తప్పదు. ఈ నాటకమునందు కొన్ని మార్పు లున్నాయి. వాటిని సమర్థిస్తుంది చివరి అనుబంధ రచన. మున్విధాల వాల్మీకి రామాయణం మార్పులూ చేర్పులూ పొందిందని హనుమంతరావు అనుబంధంలో చెప్పడం సముచితం అనే నాకు తోచింది. విశేషించి నాకు నచ్చినది రావణ వధానంతరం సీత అగ్నిపరీక్ష - రాముడు సీతను యథేచ్ఛగా నువ్వు పో! అని అనడం - వాల్మీకి వ్రాశాడా? అని నా సందేహం. ఈ నాటకంలో ఆ ప్రసక్తి లేకపోవడం నాకెంతో సమ్మతమయింది. రాముడన్న మాటలను వాల్మీకి రామాయణం 'పత్రిక'లో నా తాత్పర్యముతో వెలువడిన సందర్భమునందు ఇది రామునివంటి ఆదర్శ పురుషుడు అనవలసేదేనా అని వ్రాశాను. నేటివరకు ఎవ్వరూ ఎదిరించి వ్రాసినట్టు కన్పట్టదు——

ఈ నాటకంలో తారా సుగ్రీవుల సంబోధన తీరు, సీత విభీషణాదులను 'అభివాదయే' - అనడం - నాకు సముచితంగా తోచలేదు. నాయక ప్రతినాయకుల యుద్ధ ప్రస్తావన లవలేశమైనా ఇందు లేదు.

వాక్యరచన పటిష్ఠంగా నిర్దుష్టంగా ఉంది. క్రియా ప్రయోగాలు కొన్ని సర్వసామాన్యంగా సంస్కృత పరిచయం గల వారికి ఒకింత పెలుచుగా కనిపిస్తాయి. అక్కడక్కడ శ్లోకాల్లో గణభంగం కనిపిస్తుంది.

ప్రథమాంకమునందు 'యా నోత్సజేయుః పతిమాపదాసు' అనే చరణంలో 'ఆపదాసు' - అనేది మార్చాలనుకుంటాను.

'జనన్ మను వాసనాగుణా' అనే శ్లోకంలో

'అవదాత చరిత్ర కర్మభిః' అనేకన్న 'కర్మణా-' అంటే సరిగా ఉంటుంది.

ద్వితీయాంకంలో ఇరవైవ పుటలో రాముని మాటలో 'ఆవయోః ప్రతీక్షమాణా' - అనే వాక్యంలో 'ఆవాం' అనడం సమంజసం.

'అన్యోన్యంప్రీణనీయా' - అనే శ్లోకంలో 'యేఽవటు ఘటిత కరాస్తే గళౌ పీడయంతి' - సవరించాలి.

సుగ్రీవుని కంఠమందు పుష్పశాఖ వెయ్యడం వాల్మీక విరుద్ధం - శాఖ - వెయ్యడం స్వభావ విరుద్ధమనాలి.

ఇలా అక్కడక్కడ చిన్న చిన్న మార్పులు కరణీయము అని నా అభిప్రాయం—

అనుబంధం ముందు చదివి తదుపరి నాటకం చదవాలి. ఔను - అని అనుకుంటాము.

సంస్కృత భాష బ్రతికి ఉందా? అని సందేహించే కాలంలో ఇలాటి రచన చేసిన శ్రీ హనుమంతరావు ధన్యుడు - ఆ కంద్రికి తగిన కొడుకుగా సంభావిస్తున్నాను.

## శ్రీదత్తజయంతి చరితము

[కృతికర్త : శ్రీరంగయామాత్యుని రామకృష్ణకవి, పరిష్కర్త : శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, ప్రతులకు: ధరణి సీతారామ భక్తసమాజం, యస్. లింగందిన్నె : ఆళ్లగడ్డ మండలం, కర్నూలు జిల్లా, మూల్యము: రు. 5/-]

ఇది యక్షగాన పద్ధతిని రూపొందిన కృతి. దీనిలో వసంత తిలకావృత్త శ్లోకం 1, అనుష్టుప్ శ్లోకాలు రెండు, శార్దూల విక్రీడిత వృత్తాలు 2, ఉత్పలమాలావృత్తాలు 2, కందపద్యాలు 35, సీసపద్యాలు 28, తేటగీతులు 7, ఆటవెలదులు 5, చూర్ణిక 1, ద్విపదలు 125, దరువులు 25 ఉన్నాయి.

దత్తవ్రత కథ - అనే నామాంతరం కలది. దత్తాత్రేయ వ్రతమాహాత్మ్యం ప్రధాన కథ. ఒకప్పుడు శివుడు పార్వతికి చెప్పినది. సూతుడు నైమిశారణ్యమునందు మునులకు చెప్తాడు.

దేవేంద్రుడు, నారదుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు దత్తాత్రేయ వ్రతం చేసి అభీష్టసిద్ధి పొందినట్టు దీనివల్ల తెలుస్తుంది.

త్రిమూర్తి స్వరూపుడు దత్తాత్రేయుడు. ఆ దేవునికి సంబంధించిన వ్రత విధానం దీనివల్ల తెలుస్తుంది

ఇక - రచనలో అక్కడక్కడ సవరణలు-

'అనుత్తమము'-ప్రయోగం సాధువే-ప్రమాదజనితం కాదు. 'అణిమాది సిద్ధియుతునిన్' - అని సవరించాలి.

యీ పద్యం క్రింద వున్న దరువుతో 'అఖిల స్తోత్ర పాత్రునకు' - అనే చరణములో 'స్తుతిపాత్రునకు'-అని సవరిస్తే లయ సరిపోతుంది.

16వ పుటలో సీసపద్యం రెండవ చరణం 'కస్తూరికా తిలక లసన్నిటలు - అని సవరించాలి.

17వ పుటలో సీసపద్యం రెండవ చరణంలో 'రమాశక్తి'కి బదులు 'జ్ఞానశక్తి' - అని సవరించాలి.

18వ పుటలో - 'షష్టమ'యామం - సవరించాలి. 'షష్ట' గాని 'షష్ఠమ' అని ఉండదనుకుంటాను.

ఇలా సవరణలున్నా-గ్రంథం సకలజన సంస్తవనీయం.

## సంగీత శ్రీకృష్ణలీలలు

[సంకలనకర్త : శ్రీ చెన్నాప్రగడ హనుమంతరావు, ప్రతులకు : సి. యస్. జగన్నాథ్, లక్ష్మీ సుసీత ప్రచురణలు, పాల్వంచ - ఖమ్మం జిల్లా-507 154, వెల: రూ. 25/-]

నిజమే. ఇంతవరకు ఇలాటి సంకలిత కృతి మూర్తీభవించినట్టు నాకు తెలియదు. విడివిడిగా వేర్వేరు కవులు చెప్పిన పద్యాలూ పాడిన పాటలూ ఉన్నాయి. అవి అన్నీ ఒక కథగా ఒకచోట .... ....

ఇది 'తొలి తెలుగు సమాహార రచన' - నిస్సందేహంగా చెప్పవచ్చు.

శ్రీకృష్ణ జననం ఆరంభించి రుక్మిణీ కళ్యాణముతో మంగళహారతి పాడే యీ కృతిలో పోతనామాత్యుడు, నారాయణ తీర్థులు, అన్నమాచార్యుడు, త్యాగరాజు, జయదేవుడు, సదాశివ బ్రహ్మేంద్రుడు, రామదాసు, లీలాశుకుడు, కులశేఖరుడు దర్శనమిస్తారు.

కథను కలుపుతూ శ్రీ హనుమంతరావు ముద్దులొలికే ముచ్చటైన సంభాషణలు కూర్చడం సురీ మాన్యతను గడించు [illegible] గణనీయ కృతి దర్శనం అయింది.

సందర్భానుసారంగా పద్యాలనూ, శ్లోకాలనూ, కీర్తనలనూ సంఘటించి శ్రీ హనుమంతరావు ఆంధ్ర వాఙ్మయ పీఠములో ఒక దివ్యరత్నం పొదిగిన ధన్యజీవి అయినట్టు భావించి సంభావిస్తున్నాను.

మా సోదరుడు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) అన్నట్టు 'శ్రీకృష్ణుని చరిత్రతోపాటు మహాకవుల వివిధ కవితా ఖండికల మాధుర్యాన్ని కూడా మనకు పంచిపెట్టిన వీరి ప్రతిభ 'అప్రతిమానం'....

## కవిత్రయ భారతం - రాజనీతి

[డా॥ నేతి అనంతరామశాస్త్రి, ప్రతులకు : అరుణా పబ్లికేషన్స్, బి 1.82 పట్టాభిపురం, గుంటూరు-6, వెల : రూ. 50/-]

1) రాజ్యం-సప్తాంగాలు (ఎ) రాజ్యావిర్భావం (బి) రాజ్యం-స్వభావం, 2) రాజు - రాజధర్మాలు - స్వరూప స్వభావాలు, 3) రాజ్యపాలనా యంత్రాంగం, 4) పరిపాలనా వ్యవస్థ-ఆచరణ, 5) యుద్ధతంత్రం (ఎ) యుద్ధతత్త్వం, (బి) యుద్ధ సాధనాలు. (సి) వ్యూహారచనా విధానం - సమర రీతి 6) అంతర్ రాజ్య సంబంధాలు—

అనే శీర్షికలతో సంస్కృతాంధ్ర భారత స్వరూపమును అక్షర రూపములో సాధ్యమైనంతవరకు సప్రమాణంగా సంతరించిన ఉత్తమ విమర్శ గ్రంథం - తనుకనే తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన పోటీలో నిరాఘాటకీర్తి ఉత్తమ గ్రంథ రచన బహుమతి పొందింది. ఇంత సాకల్యంగా కవిత్రయ భారతముపై వెలువడిన విమర్శాత్మక గ్రంథం ఇంతవరకు నా చేతికి రాలేదు.

కవిత్రయం ఆంధ్రజాతికి ముమ్మూర్తులు - ముప్పొద్దులా అభివంద్యులు. మూల భారతమును సంగ్రహించి స్వతంత్రించి రూపొందించి దీనికి మూలం ఉన్నదా అనేట్టు అనుత్తమ రచనా సృష్టి చేసిన అవతార పురుషులు. ఆ దివ్యమూర్తుల రచనా వైశిష్ట్యమునూ పాత్ర స్వరూప స్వభావ ప్రదర్శననూ యథాశక్తిగా ఆవిష్కరించిన శ్రీ అనంతరామశాస్త్రి ప్రతిభ అప్రతిమానం అని అభినందిస్తున్నాను.

నాకు నచ్చనిది ఈ గ్రంథమందు ఒక్కటే. ఆంగ్లేయుల రచనలను నేను క్రిందు చెయ్యను కాని వారి వ్రాతలు కూడా ప్రమాణీకరించితే గాని తన రచనకే ప్రామాణ్యం కలగదా.... అది అంతే.

యామిజాల పద్మనాభస్వామి

# పుస్తక సమీక్ష

"వింత ప్రాణులు" (1), "జీవుల సహజీవనం" (2) యుగసృష్టి పబ్లికేషన్స్, గుంటూరువారి ప్రచురణలు (3,4 నెం.) రెండూ 66 లేదా 64 పేజీలు, డెమీ సైజ్‌లో ఉన్నాయి. వెల అధికం అనిపిస్తుంది (రు. 7/- ఒక్కొక్కటి).

పుస్తకాలు రెండూ చదువుతూ ఉంటే సబ్జెక్ట్ ఓవర్‌లాప్ అయినట్లు తోస్తుంది.

పోర్చుగీస్ మాన్ ఆఫ్ వార్, యూప్లెక్టల్లా, ఋషిపీత ఇలాటి కొన్ని సందర్భాలు. ఒకే ప్రచురణ సంస్థ ఒకేసారి విడుదల చేసిన పుస్తకాలలో ఈ పరిస్థితి నివారించుకోవలసింది.

పుస్తకం శైలి మరీ విశృంఖలంగా ఉంది. జనరంజకంగా ఉండడం అవసరమే అయినా కొంచెం హుందాగా ఉండేట్లు రాస్తే బాగుండేది. అన్ని సందర్భాలలోనూ—

"శైలకన్యా దిగులు పడకు" (2-12), "ఈ ఇంటిమీద కాకి ఆ ఇంటిమీద వాలదు (గోలి యాడంది యూద్దాం)" (2-58), "అన్నట్లు మీరు విని ఉండరు 'వాడికి మోకాల్లో కలహాయ ఉండిరా" (1-41), "అలాంటివాళ్ళు ఇక లేరిస్తే....తెలియదా! పరిహాసం అంటారు" (1-24), లా యిలకస బాగా బాగులేదు.

ఇక చిన్న పొరపాట్లు కూడా లేకపోలేదు. కొన్ని ఉదాహరణలు

1. ఫ్రాన్ రోజెన్‌హాఫ్ 1775లో— (అమీబాను మొదటి సారిగా చూడారు)-లీవెన్‌హూక్ అనుకొంటా. సంవత్సరం కూడా తేడా వస్తుంది. (1-10)

2. 'లక్కదీవులు' హిందూ మహాసముద్రంలో లేవు.(1-21)

3. 'వెజైనా' బాహ్య జననాంగం అవుతుందా (యోని) (1-25)

4. (ఏలికపాము) రోజుకు సుమారు 2 లక్షల గుడ్లు.... -ఒక విడతకు 20 వేలు అని ప్రతీతి. (1-25)

5. డార్విన్ వానపాములను 30 సంవత్సరాలపాటు గమనించాడా. (1-29)

6. "మన కన్నులాగా పనిచేసే అనేక కళ్ల సముదాయం...." మన కంటి నిర్మాణానికి సంయుక్త నేత్ర నిర్మాణానికి, దానిలోని ఒమ్మటీడియమ్‌ల నిర్మాణానికి చాలా ప్రాథమిక తేడాలున్నాయి. వాటిని పోల్చలేము. సంయుక్త నేత్రానికి మొజాయిక్ దృష్టి ఉంది (1-38)

7 కీచురాయి బొమ్మ - కుమ్మరి పురుగుది వేశారు. (గ్రైల్లోటాల్పా) అని శబ్దం చెయ్యదు. క్రికెట్ అనీ, కీచురాయి అనీ, చిమ్మెట అని కూడా పిలిచే గ్రైల్లస్ శబ్దం చేస్తుంది(1-41)

8. ఎలాగే నాక్టిలూకస్ అని బొమ్మకింద రాయడం పొరపాటు అది నాక్టిలూకస్ కాదు. (1-64)

9. మిడతను సాధారణంగా గొల్లభామ అనము. గొల్లభామ అనే పదం మాన్‌టిస్‌కి వ్యవహరిస్తారు. (కొన్ని మిడతలకి ఉదరంలో కూడా చెవి ఉంటుంది.) (1-42)

10. గ్నాట్ అనము. నాట్ సరియైన పదము. ఇదీ ఒక రకం దోమే. కాని మనుషులమీదికి రాదు సాధారణంగా. (1-52)

11. 'పై చెల్లి' బహుశా పెయ్‌స్లెల్లీ దీవులు అను కొంటాను. (2.21)

12. లేడీ బర్డ్ క్రిములు అంటామా? కీటకాలు కదా. (2.23)

13. మోరే తిమింగిలము. ఈ పేరు ఎక్కడా విన్నట్టు గుర్తు లేదు. అదిస్పెర్మ్‌వేల్ (పై జెటర్) పటంలాగుంది (2.41)

14. ఎంతైనా 'మంగలి' వాచకంతో అంత ప్రత్యేకంగా దీర్ఘంగా చర్చించడం బాగులేదు. మంగలి చేప, మంగలి రొయ్య, మంగలి పిత. మంగలి అనే పదం హెయిర్ డ్రెస్సింగ్ సందర్భంగా బాగుంది కాని, ఇతరత్రా, అంటే శరీరం శుభ్రం చెయ్యడానికి సందర్భోచితంగా లేదు. ఆంగ్లంలో ఉన్నా (?) వదిలిపెట్టేయడమే సమంజసం.

15. మానవునితో "మైత్రి" సందర్భంగా, ఒకరి అవసరాలు ఒకరు తీర్చుకోవడం చర్చిస్తూ బొద్దింకలు, ఈగలు, ఎలుకలు ప్రస్తావించడం సమంజసంగా లేదు. అవి సహజీవనానికి ఉదాహరణలు కాదు. అవి పరాన్నజీవులు.

16. ఇక "చివరి మాటలో", రెడ్ ఇండియన్ గిరిజనుడు (?) వ్రాసిన లేఖ పుస్తకానికి హైలైట్.

**జమ్మి కోనేటిరావు**

# 'నేను సూర్యుడైనవేళ'

తెలుగు సాహిత్య లోకంలో విషజ్వరంలా వ్యాపిస్తున్న విషయాలు రెండున్నాయి : ఒకటి - వచన కవిత్వం రాయడం; రెండు-పి. హెచ్ డి, ఎం.ఫిల్ డిగ్రీల కోసం రిసెర్చి చెయ్యడం. ఈ రెండింటిలోనూ పొల్లు ఎక్కువ, నెల్లు తక్కువ. వీటిని అరికట్టవలసిన అవసరం ఎంతైనా ఉంది. పద్యకవులలోకన్నా వచనకవులలో కుకవులు ఎక్కువగా ఉండే అవకాశం ఉంది. పద్య కవిత్వంలో ఒకవేళ కవిత్వం లేకపోయినా కనీసం ఛందస్సయినా మిగులుతుంది (లయబద్ధంగా చదువుకుందుకు). వచన కవిత్వంలో కవిత్వం లేకపోతే ఇంకేమీ మిగలదు. వట్టి గడ్డిలాంటి వచనం తప్ప. (వట్టి గడ్డి పశువులకు మాత్రమే ఉపయోగపడుతుంది).

'నేను సూర్యుడైన వేళ' కాశీపాకం లింగన్నగారు రచించిన కవితా సంపుటి. ఇందులో 48 కవితలున్నాయి. వీటిలో అయిదారు కవితలు మాత్రా గణాలలో సాగినా ఎక్కువ భాగం వచన కవితలే. కాని ఈయన వచన గీతంకన్నా పాటలూ గేయాలూ బాగా రాయగలడేమో అనిపిస్తోంది.

లింగన్నగారిలో అభ్యుదయ భావాలున్నాయి. ప్రకృతి అంటే ప్రీతి ఉంది. దేశభక్తి ఉంది. ప్రపంచ శాంతికోసం తపన ఉంది. గాంధేయవాదంలో నమ్మకం ఉంది. శాస్త్రీయకపు లోతు ఉంది. ఆశావాదం ఉంది. తృప్తి ఉంది. అందుకే—

"రోజుకొక్కమారైనా
మనసారా నవ్వుకోని
జీవనమెందుకు - వట్టి బీడు"

అని అనగలిగాడు.

"నీ తలపైన పువ్వు
నీ పెదవిపైన నవ్వు
నా ఎద కొక మువ్వ
అనుక్షణం సవ్వడించు"

అని ఆనందించగలిగాడు. మినీ కవితలు కూడా బలంగా చెప్పగలడు ఈ కవి:

"ఈ దేహం
సందేహం
ఈ దేశం
సందేశం"

శీర్షికాగేయం, 'గమ్యం దిశగా అతి రమ్యంగా సాగిపో', 'చైతన్య సూర్యుడు' మొదలైన కొన్ని కవితలు బాగున్నా, ఈ కవికి కవితా స్వరూపం పూర్తిగా పట్టుబడిందని చెప్పడానికి వీలులేదు. ఇంకా చాలా మెట్లు ఎక్కవలసి ఉంది. (ఈ సంపుటిలోని 48 కవితలను జల్లెడ పడితే 18కన్నా ఎక్కువ మిగలవు). 'యౌవ్వనం', 'విశ్వంబరం', 'వికశించి', 'రాబంధులు', 'నిస్తబ్ద' మొదలైన వర్ణక్రమ దోషాలూ; 'అర్థరాతిరి', 'ఊహమేడ' మొదలైన దుష్టసమాసాలూ; 'రెక్కలు వస్తుంది', 'నేను సూర్యుడైన వేళ' లాంటి వాక్యదోషాలూ ఈ కవి పరిహరించుకుంటే బాగుంటుంది. 'రాతిలో నాతి' అనే కవిత స్త్రీలను కించపరిచేలా ఉంది. ఈ తప్పు 'ముళ్లబాట' 'సుమసౌమనస్కుడు' అనే కవితలలో సరిదిద్దుకున్నాడు.

**తంగిరాల**

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247


AMRUTANJAN
LTD ®
Gripe Water
For infants and children
Recommended for alimentary disorders such as indigestion Acidity Gripe Flatulence Vomiting and also other digestive Complaints during teething It facilitates digestion promotes sleep and keeps children healthy and Cheerful
FORMULA Each 5 ml contains
Sodium Bicarbonate I P 0 043 g
Dill Oil B P C 0 00475 ml
Chloroform Water I P 1 7125 ml
Alcohol I P 0 1475 ml
Distilled water & Syrup base to make up 5 ml
Alcohol content 2 8 %v/v
Net Content 135 ml
DOSAGE For infants under 6 months 2 5 ml (half a teaspoonful) twice a day under 2 years 5 ml (one teaspoonful) twice a day over two years 10ml (two teaspoonfuls) twice a day
Manufactured by AMRUTANJAN LTD 42-45 Luz Church Road Madras 600 004
MADE IN INDIA
Mfg Lic No 16 56
Batch No



